# చతుర

సంపుటి : 8 జూన్ 1985 సంచిక : 5

## ఈ నెల సమగ్ర నవల

''ఇపుడేమయిందని తీరుబడిగా కూర్చుని ఏడుస్తున్నావ్? నాగరికత, సంస్కారం తెలీనివాళ్లతో ఇదే చిక్కు. కంట్రీఫూల్స్'' అని చీదరించుకుంటూ అక్కడినుంచి వెళ్లిపోయాడు అతను.

ఆమె చివుక్కున తలెత్తి అతను వెళ్లినవైపు చూసింది. సంస్కారం! నాగరికత! కంట్రీఫూల్స్!

ఆ మాటలు తననుద్దేశించేనని ఆమెకి తెలుసు. అంతకన్నా రెండు వాడిబాణాలు సూటిగా తన గుండెలో గురిపెట్టికొట్టినా అంత బాధని పెంచేది కాదు. కాని, ఆ మాటలు- నాగరికత! సంస్కారం!

ఏది నాగరికత? సంస్కారమంటే ఏమిటి?

ప్రతిరోజూ క్రమం తప్పకుండా తాగిరావటం నాగరికతేమో? ఇల్లు, వొళ్లు గుల్ల చేసుకుంటున్నందుకు బాధపడి హెచ్చరిస్తే దానికి పెడర్థాలు పుట్టించి, చివాట్లుపెట్టడం సంస్కారమేమో?

చివరికి అవన్నీ కలిసి సంసారాన్ని నరకంగా మారిస్తే, అది...

# స్వయంకృతం

అని అతను తెల్సుకోలేడా? ఆ వ్యసనం వారి దాంపత్యాన్ని ఎటు మలుపు తిప్పింది? దాని పరిణామాలేమిటి? పర్యవసానంగా తుదకు ఏం జరుగుతుంది?

## శంకరమంచి పార్థసారథి

నేటి ఆర్థిక వ్యవస్థలో మధ్యతరగతి జీవితాల్ని ఛిన్నాభిన్నం కావించే వ్యసనాలకు చేసిన యదార్థచిత్రణ 'స్వయంకృతం', ఈ నెల చతుర సమగ్ర నవల!

ముఖచిత్రం: జగన్ హేలాపురి

రెండవ కవరు: ఇ. రాజ్యలక్ష్మి

మూడవ కవరు: ఎల్. ఆర్. గ్రోవర్

# చతుర కత్తిరి

## సినామ్మ కత!

సుబ్బారావు సాహితీ రంగంలో ప్రవేశించాక నాలుగయిదు కథలు ప్రచురించబడ్డాయి. తర్వాత అహోరాత్రులు శ్రమించి 'ప్రేమ' సబ్జెక్ట్ మీద నవల రాశాడు.ఒక శుభముహూర్తాన ఓ పత్రికకు పంపించి ఎదురుచూడసాగాడు.

ఒకరోజు ఆ పత్రికవాళ్లనించి మీ 'పాకానపడ్డ ప్రేమ' ను సీరియల్‌గా ప్రచురిస్తున్నామని తెలియజేయడానికి సంతోషిస్తున్నామంటూ వుత్తరం వచ్చింది.

ఉప్పొంగిపోయాడు సుబ్బారావు.

తర్వాత వారానికో కాంప్లిమెంటరీ కాపీ వస్తుంటే అతని ఆనందానికి అంతులేదు.

ఆ సీరియల్ చదివినవాళ్లు బాగానే ఉందన్నారు. ఫలితంగా ఇంటా బయటా రచయితగా గుర్తింపు వచ్చేసింది.

ఓరోజు ఆఫీసుకని బయలుదేరుతుంటే ఇంటి ముందు కారు వచ్చి ఆగింది–

ఎవరబ్బా...అనుకుంటుండగానే–

"సుబ్బారావుగారిల్లు ఇదేనా...?" అడిగారు.

అవునండీ...నేనే సుబ్బారావుని" అన్నాడు.

"హలో...గ్లాడ్ టు మీట్ యు. మేం శామరాకు ప్రొడక్షన్స్ వాళ్ళం. మా సంస్థ తీసిన 'కన్నీటిలో చేప' 'కుక్కలు చింపిన విస్తరి' రెండూ దాదాపు శత దినోత్సవ చిత్రాలే.మీ'పాకానపడ్డ ప్రేమ'ను సినిమాగా తీద్దామనుకున్నాం. మీరెవరికీ హక్కులివ్వలేదు కదా ...." అని అడిగారు.

తను రాసిన నవలం సినిమాగానా! ఆశ్చర్యపోయాడు సుబ్బారావు.కాస్సేపటి దాకా నోటంట మాట రాలేదు.

చివరకు తేరుకుని "ఆహ...అలానా! రండి...కూర్చోండి" అంటూ మర్యాదలు చేసాడు.

హడావుడిగా కూల్ డ్రింకులు తెప్పించాడు.

"ఇప్పుడు చెప్పండి సార్...ఎప్పుడు మొదలుపెడుతున్నారు సినిమా నీ?" ఉద్వేగంగా అడిగాడు.

"ఇంకా డేట్ నిర్ణయించలేదండీ...మీ నవల మాకు నచ్చింది. వచ్చే ఆదివారం మద్రాస్‌లోని మా ఆఫీసులో కథ మీద చర్చ...అదే సిట్టింగ్ ఎరేంజ్ చేద్దామంటున్నారు. డైరక్టర్‌గారు,నిర్మాతగారు, అసిస్టెంట్ డైరక్టర్ మరికొంతమంది కూడా చర్చలో పాల్గొంటారు. మీ అంగీకారం తెలిపి ఆదివారానికి మద్రాసు రండి" అన్నారు వాళ్లు.

సుబ్బారావు ఉబ్బితబ్బిబ్బయ్యాడు.

"నాకు అంగీకారమేనండీ! ఒక పేరొందిన సంస్థ ద్వారా నా తొలి నవల సినిమాగా రావడం నా అదృష్టం" అన్నాడు మురిసిపోతూ.

"అయితే ఆదివారం మీరు మద్రాసు రండి. డబ్బుగురించి మనం అక్కడే..."

సుబ్బారావు ఆనందానికి పగ్గాలు లేకుండా పోయాయి. సినీ రచయిత అంటే మాటలా మరి!

శనివారానికే మద్రాస్ చేరుకుని ఓ



చిన్న హోటల్‌లో రూమ్ తీసుకున్నాడు. ఉదయాన్నే ట్రిమ్‌గా తయారై ఆ సంస్థ ఆఫీస్ చేరాడు.

అందరితోనూ పరిచయాలయ్యాక సిట్టింగ్‌కు కూర్చున్నారు.

"మీ కథలో హీరోయిన్ సొంత బావనే ప్రేమిస్తుంది కదా ... మరి మన సినిమాలో పక్కింటి అబ్బాయిని ప్రేమిస్తున్నట్టు తీస్తేపోలా" అన్నారు డైరక్టరుగారు.

"దానిదేముందండి... ఎలా తీసినా ఫర్వాలేదు" అన్నాడు సుబ్బారావు.

"నవల్లో ఓచోట హీరో త్యాగం సేసినట్టు రాసినావంట... మనకి లేడీస్ ఎట్రాక్సన్ కావాల్న. మన సినిమాలో హీరోయినే త్యాగం సేసినట్టు తీస్తే ఎలాగుంటదంట" అడిగాడు ఇంకొకాయన.

"అవును. మన సినిమాని లేడీస్ ఇరగబడి సూసేయాల" ఇంకొకాయన వంతపాడాడు.

"అలాగైనా తీయొచ్చు.." చెప్పాడు సుబ్బారావు.

ఇలాంటి మార్పులు, చేర్పులు, కూర్పులతో ఆ చర్చ సాయంకాలందాకా సాగుతూనేవున్నా కథ ఒక కొలిక్కి రాలేదు.

మరలా సిట్టింగ్‌కి వచ్చే ఆదివారం వరకూ ఖాళీలేదన్నారు డైరెక్టర్‌గారు. మీరు ఎలాగైనా వచ్చే ఆదివారం రావాలన్నారు వాళ్లు.

సుబ్బారావుకి ఏమీ తోచక రూముకి చేరుకున్నాడు. మరల తన వూరికి అంత దూరంవెళ్ళి తిరిగిరావడం దండగ. ఈ వారంరోజులూ మద్రాస్‌లోనే గడిపెయ్యాలనుకున్నాడు.

ఆఫీస్‌కు లీవ్‌లెటర్, ఇంటికి ఉత్తరం రాసేశాడు.

ఆ వారంరోజులు మద్రాసంతా తిరిగాడు.

అనుకున్నట్టే ఆదివారం సిట్టింగ్ జరిగింది మళ్ళీ.

సినిమాకి అనుగుణంగా కథలో మరలా అనేక మార్పులు జరిగాయి.

సుబ్బారావు కొస్త మొహమాట
పడుతూ, మరికొస్త బాధపడుతూ...అన్నిం
టికీ ఒప్పుకున్నాడు.

ఆ సాయంకాలానికెలాగైతేనేం..మొత్తా
నికి సినిమాకి అనుగుణంగా అతికష్టం
మీద కథ తయారయింది.

సుబ్బారావు మురిసిపోయాడు. తన
పేరు యావదాంధ్రలో మార్మోగిపోతుం
దని ఆనందించాడు.

షూటింగ్ వివరాలు, మొదలైనవన్నీ
తరువాత తెలియజేస్తాం అంటూ
సాగనంపారు నిర్మాతలు.

సుబ్బారావు ఇంటికి చేరుకున్నాడు.
ఈ వారంరోజులకి, ఖర్చులకీ..చార్జీలకీ..
దాదాపు వెయ్యిదాకా వదిలినయి.

సుబ్బారావు నవలని సినిమాగా తీస్తు
న్నారని తెలియడంతో అప్పుడే చుట్టు
పక్కలా, ఆఫీస్‌లోనూ సినీ రచయితగా
గుర్తింపు వచ్చేసింది. ఆఫీస్‌లో ఓ చిన్న
సైజు సన్మానంకూడా జరిగిపోయింది.

రెండు నెలలైనా నిర్మాతలనుండి
జాబులేదేమా అని ఎదురుచూస్తుంటగా ఆ
ఉత్తరం రానేవచ్చింది. ఆత్రంగా చూశాడు.
తామరాకు ప్రొడక్షన్స్‌వాళ్ళే రాశారు.
సుబ్బారావు ఆనందానికి అంతులేదు.

ఆదుర్దాగా చదవడం ప్రారంభించాడు.

"శ్రీ సుబ్బారావుగారికి నమస్కా
రములు. అప్పుడు చర్చించినకథతాలూకు
షూటింగ్ వచ్చే నెల మొదటివారం నుంచీ
మొదలు పెట్టాలనుకుంటున్నాం..నటీ
నటుల కాల్షీట్స్ తీసుకున్నాం.

ముఖ్యంగా మీకు తెలియపరచునది
ఏమిటంటే...మా సినిమా కథ ఇప్పుడు
డైరక్టర్‌గారే రాసేస్తున్నారు. మా డైరక్టర్
గారు మీ కథను సినిమాకి అనుగుణంగా
మలచడంలో... ఓ సరికొత్త కథను
సృష్టించారు. ఈ కారణం దృష్ట్యా..
ఇప్పుడు తయారైన కొత్తకథకు..మీ
పాతకథ..అదే 'పాకానపడ్డ ప్రేమ'కు
అసలు పోలికేలేదని మా డైరక్టర్‌గారు
ఈ నిర్ణయం తీసేసుకున్నారు. ఈ
విషయం మీకు తెలుపమన్నారు..

అందుచేత ఈ సందర్భంలో మీకూ
మాకూ ఇక ఎటువంటి సంబంధం
లేదనియూ.. మీరిది గమనిస్తారనియూ..
ఆశిస్తున్నాం.

ఇట్లు
తామరాకు ప్రొడక్షన్స్."

—జి.యస్.వి. సత్యనారాయణ

# అసాధ్యం

రామారావుకు ఆఫీసు వదిలాక అలా
సముద్రం ఒడ్డుకు వెళ్ళి ఓ గంటసేపు
తిరిగి రావడం అలవాటు. అలా స్వచ్ఛ
మయిన గాలిలో తిరగటం మూలంగా
మంచి ఆరోగ్యంగా ఉండవచ్చని అతడి
నమ్మకం. సాధారణంగా పక్కింటి సుబ్బా
రావు కూడా అతడితోబాటు వస్తుంటాడు.

ఆరోజు సుబ్బారావుకి ఆఫీసుపని
తెమలకపోవడంవల్ల, రామారావు ఒక్కడే
వ్యాహ్యాళికి బయల్దేరాడు. సముద్రపు
కెరటాలను సంభ్రమంగా చూస్తూ అడుగు
లేస్తున్న అతడికి ఓ సీసా ఒడ్డుకి కొట్టుకు
రావడం కనిపించింది.

'ఏమయి వుంటుందబ్బా?' అన్న
ఆత్రంతో ఆ సీసా వైపు గబగబా అడుగు
లేశాడు రామారావు.

సుమారొక అడుగు పొడవుందా సీసా!
లోపల ఏముందో స్పష్టంగా కనిపించడం
లేదు. అయితే సీసా కొంచెం బరువుగా
ఉండటం వల్ల లోపల ఏదో ఒకటి ఉండి
ఉంటుందనిపించిందతనికి.


మామిడి పండ్లలోని
మాధుర్యం ఇదే! ఇదే!!
SOMA
SOMA
సోమా మాంగో
సోమరస విహారం
ఎప్పుడైనా. ఎక్కడైనా.
గోవా, ఫ్రూట్ పంచ్
కూడా వున్నై.
మార్గదర్శి మార్కెటింగ్ ప్రైవేట్ లిమిటెడ్
ప్రస్తుతం హైద్రాబాద్, సికింద్రాబాద్‌లలోనే లభ్యం.



ఒక్కోసారి స్మగ్లర్లు పోలీసుల బారి నుంచి తప్పించుకొనే హడావిడిలో తమ దగ్గరున్న వజ్రాలు, బంగారం మొదలయినవాటిని సీసాలలో బిగించి సముద్రంలోకి విసిరేస్తుంటారని ఆమధ్య ఎక్కడో చదివినట్లు జ్ఞాపకం వచ్చింది రామారావుకి.

ఇక ఆత్రుత ఆపుకోలేక సీసాకున్న బిరడాను గట్టిగా లాగాడు. ఆశ్చర్యం! అందులోనుంచి తెల్లటి పొగ రానారంభించింది. భయపడ్డ రామారావు సీసాను కింద పడవేశాడు. తెల్లటి పొగ దట్టంగా అలుముకొందా ప్రాంతమంతా. ఉన్నట్టుండి "శభాష్ నరుడా! నాకు విముక్తి కలిగించినందుకు నీ మేలు మరువలేను! నీకేం కావాలో కోరుకో!" అంది భూతం ఆ పొగలో నుంచి వెలికి వస్తూ.

గుండె దిటవుచేసుకొన్న రామారావు "నేనేది కోరితే అది ఇవ్వగలవా?" అన్నాడు.

"ఆఁ! నేను ఈరోజు రాత్రంతా నీ కోరికలు తీరుస్తాను. అయితే ఓ షరతు! నన్ను ఖాళీగా ఉంచకూడదు. ఏదో ఓ కోరిక కోరుతూనే ఉండాలి సుమా! లేకపోతే నిన్నే మింగేస్తాను" అంది భూతం.

"సరే! అయితే ముందు మా ఇంటికిరా నాతో! ఏం కావాలో అక్కడ చెబుతాను" అన్నాడు రామారావు. భూతం అతణ్ని అనుసరించింది.

ఇంటికి చేరగానే భార్యతో సంప్రదించి "మాకు ఏడు తరాలవరకు కూర్చొని తిన్నా తరగనంత సంపద తెచ్చిపెట్టు!" అన్నాడు రామారావు భూతంతో.

"అదెంత పని...?" అంటూ మాయమయిన భూతం ఓ అరగంటలో అతని ముందు వజ్రాలు, బంగారం, నోట్లకట్టలు ఓ పెద్దకుప్పగా పోసింది.

"ఇంకేం కావాలి?" అంది భూతం.

"నా బంధువులు, స్నేహితులు బతికున్నంతకాలం కట్టుకోవడానికి సరిపోయే నన్ని దుస్తులు తీసుకురా" ఆజ్ఞాపించాడు రామారావు.



సింథాల్
రోజంతా మిమ్మల్ని
తాజాగా ఉంచడమే కాకుండా
శరీర దుర్గంధ రహితంగా కూడా
ఉంచే ఒకే ఒక సబ్బు.
Godrej
CINTHOL
DEODORANT AND COMPLEXION SOAP
CINTHOL
CHAITRA-B-284 TEL
రోజుకు అర లీటర్ చెమట కారుస్తాం మనందరమూను. అంతే ఏమవుతుందో మీకు తెలిసిందే. తప్పనిసరిగా వచ్చే ఆ శరీర దుర్గంధాన్ని ఒక్క సింథాల్ మాత్రమే నివారించగలదు. సింథాల్, 30 ఏళ్లగా విశ్వసించబడుతున్న పేరు, చర్మంపైని సూక్ష్మక్రిములను నాశనం చేసే ఒకే ఒక కుటుంబపు సబ్బు. దీనితో మీకు రోజంతా దుర్వాసనలేని తాజాదనం.
గోద్రెజ్
సింథాల్ దుర్గంధ నివారక సబ్బు
అందరి శరీరాలకూ
కావలసిన అంగరక్షకుడు

మరో గంటలో అతడి డాబా అంతా బట్టలతో నిండిపోయింది.

"ఇంకా ఏమేం కావాలి?" తిరిగి అడిగింది భూతం. రామారావు కోరికలు ఒక్కటొక్కటిగా చెప్పి చేయించుకో సాగాడు.

భూతం చిటికెలో నెరవేర్చి మళ్ళీ ఏం కావాలి అంటోంది.

చెమటలు పట్టాయి రామారావుకి, భూతం విధించిన షరతు గుర్తుకొచ్చి.

"మా ఆవిడ తలమీద, నా తలమీద ఎన్ని వెంట్రుకలున్నాయో లెక్కపెట్టి చెప్పమని" పురమాయించాడు రామారావు.

ఇద్దరి తలలమీదా కలిపి మూడు లక్షల ఎనభై రెండువేల ఆరువందల ముప్పై నాలుగు వెంట్రుకలున్నాయని తడుము కోకుండా చెప్పింది భూతం.

"మా నూతిలో ఉన్న నీళ్ళన్నీ చెంచాతో తోడు" అన్నాడు ఏమడగాలో తోచక రామారావు.

ఓ గంట పోయాక "అయిపోయింది. నీళ్ళన్నీ తోడేశాను....ఇంకేమి కావాలో చెప్పు?" అంది భూతం అతడి మీదకు వస్తూ.

ఇక తన ఆయువు తీరిపోయిందను కొన్నాడు రామారావు. ఉన్నట్టుండి అతడికి పక్కింటి సుబ్బారావు గుర్తొచ్చాడు.

"ఈసారి కోరికను మా స్నేహితుడు కోరతాడు!" అన్నాడు రామారావు.

"సరే...పద!" అంది భూతం.

నిద్రలో ఉన్న సుబ్బారావుని లేపి జరిగిన సంఘటనను మూడు ముక్కల్లో వివరించాడు రామారావు.

"నీ సమస్య నేను పరిష్కరిస్తాను... నాకేమిస్తావు?" అడిగాడు సుబ్బారావు చిరునవ్వుతో.

"భూతం ఇచ్చిన సంపదలో నీకు సగం ఇచ్చుకొంటాను!" అన్నాడు రామారావు అతడి చేతులు పట్టుకొంటూ.

"సరే!" అంటూ భూతాన్ని దగ్గరకు పిలిచి దాని చెవిలో ఏదో చెప్పి "వెళ్ళి వెంటనే తీసుకురా!!" అన్నాడు సుబ్బారావు.

రామారావు నోరు వెళ్ళబెట్టుకొని చూడసాగాడు. అరగంట, గంట, రెండు గంటలు గడిచిపోయాయి. భూతం జాడ లేదు.

ఆశ్చర్యంతో అతడికి నోట మాట పెగలడంలేదు. ఈలోగా చప్పగా తెల్లారి పోయింది.

భూతం తిరిగి రాలేదు.

"సుబ్బారావూ! నీ మేలు ఈ జన్మకి మరువలేను! నాకు పునర్జన్మను ప్రసాదించావు... అయితే నాదో సందేహం" అంటూ అడగబోయిన రామారావుని వారిస్తూ,

"ఆ భూతం తేలేనిది ఏమిటడిగానా అనికదూ నీ సందేహం....?" అడిగాడు సుబ్బారావు.

"అవును"

"అయితే విను...కట్నం ఇవ్వలేక పోవడం వల్ల ఇంట్లో మగ్గిపోతున్న నా ముగ్గురు కూతుళ్ళ కోసం కట్నం తీసుకో కుండా ఉదారంగా పెళ్ళిచేసుకోగల ముగ్గురు అల్లుళ్ళను తీసుకు రమ్మన్నాను...!!" బాధతో కూడిన చిరునవ్వుతో చెప్పాడు సుబ్బారావు.

—కె. హరిబాబు

రోజులో రెండు మధురానుభూతులు మీరు మెచ్చుకొనేలా అందిస్తోంది...




# ట్రస్ట్

## ఉదయం రివ్వురివ్వున తాజాదనపు అహ్లాదం కలిగించి, రాత్రి అంతా సూక్ష్మక్రిమికారకమైన దంతక్షయం బారినుంచి రక్షణ కల్పించే ఒకేఒక్క దంతరక్షణ ప్యాకేజీ.

మీరు అదమరచి నిద్రలో వున్నప్పుడు చిన్నచిన్న ఆహారపు అణువులు పళ్లలో చిక్కుకుని వుండి సూక్ష్మక్రిముల్ని సృష్టిస్తాయి. అవి అతి వేగంగా రెట్టింపై నోరంతా వ్యాపించి గార పట్టిస్తాయి. గార మూలంగా హానికరమైన ఆమ్లాలు ఉత్పత్తయి దంతక్షయానికి, పుప్పిపళ్లకు ప్రధాన కారణాలవుతాయి.

ప్రతి రాత్రి నిద్రకుపక్రమించేముందు ట్రస్ట్ (నైట్) తో మీ పళ్లను బ్రష్ చేసుకోవడం అలవరచుకోండి. నిద్రపోతున్నప్పుడు దంత సమస్యలు ఉత్పన్నంకావు.




ఒక్క ట్రస్ట్ (నైట్) లో మాత్రమే క్లోరెక్సిడిన్ అనే ప్రత్యేక రసాయనం వుంది. మీరు నిద్రిస్తున్న సమయంలో అనేక గంటలపాటు పళ్లపై గార పట్టకుండా నివారిస్తుంది.




ఉదయాన్నే మళ్లీ ట్రస్ట్ (మార్నింగ్) తో మీ దినచర్యను ఆరంభించండి. ట్రస్ట్ లో చురుకైన అంతర్గత ద్రవ్యాలు మీ పళ్లను పూర్తిగా శుభ్రపరచి తళ తళ లాడిస్తాయి. ట్రస్ట్ లోని అద్భుతమైన సువాసన, దుర్గంధాన్ని నివారించి మీ శ్వాసను చల్లగా తాజాగా వుంచుతుంది. ట్రస్ట్ నమ్మికకు మరోపేరు. ట్రస్ట్ ను అలవాటు చేసుకోండి. మీ దినచర్యను ప్రారంభించేందుకు ట్రస్ట్ ఒక్కటే ఉత్తమ మార్గం.

**ట్రస్ట్... మీకు అవసరం, రాత్రి -ఉదయం.**

వర్షం తగ్గింది!

డాబా మీద నుంచి కిందికి కారుతున్న వాన నీటి శబ్దం లయబద్ధంగా వినవస్తోంది. రివ్వున వీస్తున్న చల్లగాలి కత్తితో కోస్తున్నట్లుగా వుంది.

ఇందిరకి వానంటే ఇష్టం. వాన నీటితో తడిసిన నేలలోంచి వచ్చే విచిత్రపు వాసన అన్నా ఇష్టం. వాన జోరున కురుస్తున్నపుడు, వెచ్చవెచ్చగా ఇంట్లో కూర్చుని, కిటికీలోంచి వెండి దారాల్లాగా పడుతున్న నీటి ధారలని చూస్తూ, ఇష్టమైనవారితో ముచ్చట్లాడట మంటే మరీమరీ ఇష్టం...

కానీ-

ఆరోజు వర్షం జోరుమంటూ కురుస్తున్నా భూమిలోంచి ఇష్టమైన వాసన ముక్కుపుటాలని తాకుతున్నా, ఇందిర ఆ అనుభవం తాలూకు ఆనందాన్ని పొందకపోగా, ఆదుర్దాగా, భయంగా మాటిమాటికి వీధిలోకి దృష్టిసారిస్తోంది. బాల్యం నుంచి ఆహ్లాదాన్నందించిన వర్షం ఈరోజు చటుక్కున వికృతంగా మారి వికటాట్టహాసం చేస్తున్నట్లు, ప్రకాశరావునించి తనను దూరం చేస్తున్నట్లు ఫీలవుతోంది.

ఇందిర గడియారం వైపు చూసింది. తొమ్మిదిన్నర దాటింది! కిటికీ వైపుగా వెళ్ళి మరోసారి వీధివైపు చూసింది. ప్రకాశరావు వస్తున్న జాడ లేదు. వర్షానికెక్కడో చిక్కడిపోయివుంటాడు. వర్షం తగ్గింది కనుక వచ్చేస్తాడని సరిపెట్టుకోవాలని ప్రయత్నించింది.

కాని మనసులో వెంటనే ప్రశ్న -

సరే..ఈ రోజు వర్షం వచ్చింది గనుక ఆలస్యమైంది. మరి నిన్న, మొన్న, అంతకుముందు...?

ఇందిర కిటికీ మూసి కుర్చీలో కూలబడింది.

ఏడాది క్రితం వరకు ఇందిర వుద్యోగస్తురాలు కాదు. ఇల్లే స్వర్గం అనుకునే సాధారణ ఇల్లాలు. ప్రకాశరావును పదింటికి ఆఫీసుకు సాగనంపటం, మళ్ళీ సాయంత్రం అతడొచ్చేవేళకి ఎదురుచూస్తూ నిలబడటం ఆమె నిత్యకృత్యాల్లో అతి ముఖ్యమైన ఘట్టాలు. అందులో ఆమెకు అనూహ్యమైన ఆనందం కనిపించింది.

కష్టం, సుఖం, ఆనందం, దుఃఖం అనే మాటలకర్థాలు సందర్భాన్ని బట్టి మారుతుంటాయి.

సరిగ్గా ఏడాది క్రితం భర్త కోసరం ఎదురుచూడటంలోని ఆనందాన్ని అనుభవించిన ఇందిరకి, గత కొద్ది నెలలుగా దాంట్లో ఆనందానికి బదులుగా ఆవేదన, భయం, బాధ...

గడియారం పది గంటలు చూపిస్తోంది.

చేతిలోని పత్రికని పక్కన పెట్టి మెల్లిగా లోపల గదిలోకెళ్ళి పిల్లలిద్దరికి దుప్పటి సరి చేసింది. అటు తర్వాత ఏం చెయ్యాలో తెలీక మళ్ళీ ముందు గదిలోకొస్తుండగా...

తలుపు తట్టిన శబ్దం.

ఇందిర ఒక్క పరుగున వెళ్ళి తలుపు తీసింది.

ప్రకాశరావుమెల్లిగాలోనికొచ్చేడు. ఏం మాట్లాడకుండా లోపలి గదిలోకెళ్ళాడు.

అతడు లోనికి రాగానే, అతడితో పాటుగా విచిత్రమైన వాసన...

కొద్దికాలంగా అతడి నంటిపెట్టుకు తిరుగుతున్న వాసన... గుప్పుమంది.

ఇందిరకి తెలుసును-

మనిషి నైతికంగా, శారీరకంగా పతనమవుతున్నపుడు వచ్చే వాసన అది.

ఆమె భయంతో విలవిల్లాడింది. ప్రకాశరావు మళ్ళీ తాగొచ్చాడు!

ఇందిర విసుగా మధ్య గదిలో కెళ్ళింది.

అప్పటికే ప్రకాశరావు బట్టలు మార్చుకుని, 'దొడ్లోకెళ్ళబోతూ, భార్యని చూసి "నువ్వు భోంచేసెయ్యి...నే తినేశాను" అన్నాడు.

మాట్లాడుతున్నప్పుడు మనిషి కాస్త వూగుతున్నాడు. మాటలు ముద్ద ముద్దగా వస్తున్నాయ్.

"నే ఎదురుచూస్తుంటానని తెలిసీ హోటల్లో భోంచేయడంలో వుద్దేశం?" భార్య ప్రశ్నకి ప్రకాశరావు ఒక్క క్షణం ఆగేడు. వాలిపోతున్న రెప్పలని, పడిపోతున్న శరీరాన్ని అతికష్టంపై నిలబెడుతున్నవాడిలా వూగుతూ, "ఫ్రెండ్‌కి పెళ్ళయింది. పార్టీ ఇచ్చేడు" అన్నాడు.

కానిపని చేయటం ఒక తప్పు దాన్ని కప్పిపుచ్చటం మరో తప్పు. అతడు తాగొచ్చాడని ఆమెకి తెలుసు. కాని చేసిన పనిని సమర్థించి తనని మభ్యపెట్టాలన్న అతడి ప్రయత్నం ఇందిరకు మరింత కోపాన్ని తెప్పించింది. "అదృష్టవంతులు.. రోజూ పార్టీలే! ఇవ్వాళ ఫ్రెండు పెళ్ళికి పార్టీ, నిన్న ఫ్రెండు ప్రమోషన్ పార్టీ, మొన్న ఫ్రెండు పెళ్ళానికి నెల తప్పినందుకు..."

అంత మత్తులోనూ ప్రకాశరావు భార్య వంక చూసేడు. ఆమె మాటల్లోని వ్యంగ్యం అర్థమైంది. తాను చెప్పేది కట్టుకథని ఆమె కర్థమైందన్నమాట.

అంతే! ప్రకాశరావులో ఇంతకుమునుపు లేని ధైర్యం, తెగువలు చోటుచేసుకున్నాయి. మంచికి చెడుకి నడుమనుండే సన్నటి తెర జారిపోయినపుడు కలిగే తెగింపు అది! కడుపులోనున్న ద్రవం నరాల్లోకెక్కినపుడు వచ్చే రాక్షసి ధైర్యం అది. అవి అతడి ఎర్రటి కళ్ళలో తళుక్కున మెరిసాయి.

"అవును...నే తాగొచ్చాను. ఏమిటి నువ్వనేది?"

అతడి అసహ్యమైన ధైర్యాన్ని చూసి ఇందిర కాస్త జంకింది. అనునయంగా "ఏవండీ...ఎందుకిలా లేనిపోని అలవాట్లు చేసుకుంటున్నారు? ఎటుపోతున్నామో, ఏమైపోతామో ఆలోచించేరా?" అంది.

భార్య మాటల్లోని బతిమాలుడు ధోరణి చూసేక ప్రకాశరావుకి మరింత ధైర్యం వచ్చింది.

"ఇంకా ఆలోచించలేదు. తీరుబడిగా ఆలోచించి చెబుతా" అనేసి తూలుకుంటూ దొడ్లో బాత్‌రూంవైపుగా వెళ్ళేడు.

ఇందిర సామాన్య గృహిణి. అందరాడవాళ్ళలాగే ఆమెకీ భవిష్యత్తుపై కొండంత ఆశ, నిర్దుష్టమైన ఆశయాలు పైకిరావాలన్న తపన...కాని భర్త ప్రవర్తనని, అతడి మొండి సమాధానంతో కలిపి చూసుకుంటే ఎందుకనో ఆక్షణంలో భయంవేసి, ఏడుపాగిందికాదు. సాఫీగా వెడుతుందనుకున్న రోడ్డు మధ్యలో ఆగిపోయి ఎదర రాక్షసిలాంటి పెద్ద గోడ నిలబడి నవ్వుతున్నట్లు.

ఇందిర మోకాళ్ళ మధ్యన తలుంచుకుని సన్నగా ఏడవనారంభించింది.

ప్రకాశరావు తిరిగి లోనికొచ్చి ఏడుస్తున్న భార్యని చూసేసరికి స్వర్గంలోకి వెళ్ళబోతున్న తనని ఎవరో కాళ్ళు పట్టి నరకంలోకి లాగేస్తున్నట్లు ఫీలయ్యేడు. ఒళ్ళు మండింది.

"ఇపుడేమయిందని తీరుబడిగా కూర్చుని ఏడుస్తున్నావ్? నాగరికత, సంస్కారం తెలీనివాళ్ళతో ఇదే చిక్కు. కంట్రీఫూల్స్" అంటూ తనపక్క బట్టలు

# ప్రకృతి చెప్పే పాఠాలు...



ప్రకృతి నుంచి మనం నేర్చుకోదగ్గవి ఎన్నో ఉన్నాయి. కొద్ది కొద్దిగా కూడబెట్టి దాన్నే పెద్ద మొత్తంగా చేసే నేర్పు కూడా అందులో ఒకటి. ఈ సూత్రాన్ని ఆచరణలో పెట్టడానికి మార్గదర్శి మీకు తోడ్పడుతుంది. చిన్న చిన్న మొత్తాలలో పొదుపుచేసి పెద్ద మొత్తం పొందే అవకాశాలు మీ అందుబాటులో ఉంచుతుంది.

అంతేకాదు, రెండు దశాబ్దాల వ్యాపారానుభవం ఉన్న మార్గదర్శి మీరు పొదుపుచేసే మొత్తాలకు పూర్తి భద్రత సమకూరుస్తుంది. లాభసాటి డివిడెండ్లు కూడా వరుసగా ఆ మొత్తాలకు తోడవుతూ ఉంటాయి. మార్గదర్శిలో పొదుపు భవిష్యత్తుకు మదుపు అని లక్ష మందికి పైగా ఇప్పటికే గ్రహించారు. మరి, మీ మాటేమిటి?

**డబ్బు కొరతమేనా మీ చింత - మార్గదర్శి వున్నది మీ చెంత!**

## మార్గదర్శి

**చిట్ ఫండ్ ప్రైవేటు లిమిటెడ్**

మార్గదర్శి హౌస్, అబిడ్ సెంటర్, హైదరాబాద్ - 500 001.

**శాఖలు:** ● అబిడ్ సెంటర్, హైదరాబాద్ ● లక్డీకాపూల్, హైదరాబాద్ ● చిక్కడపల్లి, హైదరాబాద్ ● అమీర్‌పేట, హైదరాబాద్ ● చాత్రా కాంప్లెక్స్, ఎమ్.జి.రోడ్, సికిందరాబాద్ ● బిసెంట్ రోడ్, విజయవాడ ● బందరు రోడ్, విజయవాడ ● మెయిన్ రోడ్, గుంటూరు ● మెయిన్ రోడ్, కాకినాడ ● ఇన్నీసుపేట, రాజమండ్రి ● బెహూరి రోడ్, కర్నూలు ● మెయిన్ రోడ్, విశాఖపట్నం ● జె. పి. ఎన్. రోడ్, వరంగల్, ● వైరారోడ్, ఖమ్మం

KIRON/MLF/81/2

తీసుకుని ముందు గదిలోకెళ్ళిపోయాడు.

ఇందిర చివుక్కున తలెత్తి అతడెళ్ళిన వైపుగా చూసింది. సంస్కారం! నాగరికత! పైగా కంట్రీ ఫూల్స్!

ఆ మాటలు తననుద్దేశించి వాడినవని ఆమెకి తెలుసు. అందుకే మరింత బాధ.

అంతకన్నా రెండు వాడిబాణాలు సూటిగా తన గుండెకి గురిపెట్టి కొట్టినా అంత బాధనిపించేది కాదు. కాని ఆ మాటలు - నాగరికత, సంస్కారం!

ఏది నాగరికత? సంస్కారమంటే ఏమిటి??

ప్రతిరోజూ క్రమంతప్పకుండా తాగి రావటం నాగరికతేమో? ఇల్లు, ఒళ్ళు గుల్లచేసుకోవటం నాగరికతేమో?? నువ్వు ఎన్నుకున్న దారి ఋజుమార్గం కాదని హెచ్చరిస్తే, దానికి పెడర్థాలు పుట్టించి, చివాట్లుపెట్టడం సంస్కారమేమో?

ఇందిర ఆవేశం ఆపుకోలేనట్టు కళ్ళు తుడుచుకుని ముందర గదిలోకొచ్చింది. అప్పటికే ప్రకాశరావు పక్కపరచుకుని పడుకున్నాడు.

"ప్రతిరోజూ తాగిరావటం బాగానే వుందిగానీ నేనడిగితేనే తప్పొచ్చింది. నేనూ మీ అంతే చదువుకున్నాను. సంస్కారం, నాగరికత అనే మాటలకి నిజమైన అర్థాలు తెలుసు. మీకు తెల్సినవి పెడర్థాలు" అతడిపైకి వొంగి ఆవేశంగా మాట్లాడుతున్న ఆమెని అతడి బలమైన చెయ్యి వొడుపుగా మీదికి లాక్కుంది.

ఆమె అసహ్యంతో విదిలించుకోబోయింది. కాని ఉక్కుపూచల్లాంటి అతడి చేతులు అప్పటికే ఆమెని బంధం చేసినాయి. తన మొహాన్ని వొంగిన ఆమె గుండెలకేసి రుద్దుకుంటున్నాడు. ఒక చెయ్యి ఆమె నడుంచుట్టూ, రెండో చెయ్యి ఆత్రంగా కసిగా ఎక్కడెక్కడో...

బయట వర్షం మళ్ళీ ఎక్కువైంది.

కిటికీలోంచి వస్తున్న వాసన, భర్త లోంచి వస్తున్న వాసన కలిసి విచిత్రంగా, కొత్తగాను, జీవితంలా వెగటుగానువుంది.

చేయీ చేయీ కలుపుకెళ్ళినా, జర జరా లాక్కెళ్ళినా చేరే గమ్యం ఒక్కటే.

ఆ రాత్రి-ఆ వర్షం కురుస్తున్న రాత్రి, ఆ చీకటిరాత్రిలో ప్రకాశరావు భార్యని అనుభవపు అంచుల్లోకి బలవంతంగా లాక్కెళ్ళాడు.



2

కామాక్షమ్మ గారికి ఇద్దరాడపిల్లల తర్వాత పుట్టేడు ప్రకాశరావు. ఆటుతర్వాత పుట్టి పుణ్యలోకాల్లోకెళ్ళినవాళ్ళల్లో కూడా మగపిల్లలు లేకపోవటంచేత అతడిని గారాబంగా పెంచింది. ప్రకాశరావు తండ్రి సుబ్రమణ్యంగారు. ఆ వూళ్ళోనే బియ్యం మిల్లులో గుమాస్తా. ప్రకాశరావు పుట్టినప్పటి నుంచీ, ఆయనకి కొడుకుపట్ల లేని నిర్లిప్తత, అశ్రద్ధ. అతడు నష్టజాతకుడని ఒక గట్టి నిర్ణయానికొచ్చి, దాన్ని పదిలంగా గుండెలో దాచేడు. ఆయనలా అనుకోవటానికిగాని, ఆ నిర్ణయానికి రావటానికిగాని తగినన్ని ఆధారాలు ఆయనవద్ద వున్నాయి.

ప్రకాశరావు పుట్టీపుట్టగానే తన

తండ్రిద్వారా సంక్రమించిన రెండెకరాల మాగాణి, లంకంత కొంప అమ్మవలసి వచ్చింది. దానికి సుబ్రమణ్యంగారు బాధ పడ్డారు. అమ్మకాన్ని ఆపాలని ప్రయత్నం కూడా చేసేరు. కాని ఆయనవల్ల కాలేదు.

కారణం–అది జాయింటు ప్రాపర్టీ. అమ్మకం కూడదంటే దాయాదులకి తను అయిదువేలు కట్టవలసిన పరిస్థితిలో కిక్కురుమనకుండా సంతకంచేసేరు.

సుబ్రమణ్యంగారికి తండ్రంటే వల్ల మాలిన భక్తి,వాత్సల్యం. తండ్రి తాలూకు చివరి గుర్తుగా మిగిలిన ఆస్తి అమ్మినపుడు పుట్టడం ప్రకాశరావు చేసిన నేరం.

ప్రకాశరావు పుట్టినాకే బియ్యంమిల్లులో గుమాస్తాగా కుదిరాడు. అంచేత అతడి పుట్టుక తన జీవిత గమనాన్నే తారుమారు చేసిందని ఆయన భావన.

కామాక్షమ్మగారు మాత్రం కొడుకుని కళ్ళలోపెట్టుకుని పెంచింది. సాధ్యమై నంతవరకు అతడి కేలోటూ రాకుండా చూసేది.

ప్రకాశరావుకి అయిదో సంవత్సరం రాగానే సుబ్రమణ్యంగారు అతడిని ఆచారి వీధి బళ్ళో పడేశారు.

అక్షరాభ్యాసం ఘనంగా చెయ్యాలని భార్య, కుదరదని సుబ్రమణ్యంగారు మూడ్రోజులు ఘర్షణపడి, చివరికి నాలుగోనాడు రెండో కంటికి తెలేకుండా ఆచారి స్కూల్లో పడేశారు.

అక్కడితో ప్రకాశరావు జీవితంలో మొదటి అధ్యాయం ఆరంభమైంది.

ఆచారిది స్కూలని పేరేగాని, నిజానికి స్కూలు కాదు. అతడుండే రెండు గదుల కొంపలోనే ముందుగదిలో ఒకటో క్లాసు, మధ్య గదిలో రెండు మూడు జాయింటు క్లాసులు, బయట చెట్టుకింద నాలుగు, అయిదు క్లాసులు.

ప్రకాశరావు హైస్కూలుకొచ్చేసరికి పెద్దాడపిల్లకి పెళ్ళీడొచ్చింది. ఆడపిల్ల పెళ్ళిమీద పడటంతో ప్రకాశరావుకి తండ్రి నుండి లభించాల్సినంత ఆదరణ లభించ లేదు. జీతాలు కట్టాలన్నా, పుస్తకాలు కొనుక్కోవాలన్నా తల్లికే చెప్పేవాడు. ఆవిడ భర్తతో చెప్పి ఏ వారానికో, పది రోజులకో డబ్బులిచ్చేది. ఆ పదిరోజులు స్కూల్లో నోట్సు రాయలేదనో, టెక్స్టుబుక్కు తేలేదనో మాస్టర్లు అతడిని ఎండలో నిల్చోమనడం, బల్లెక్కి నిలబడ మనటం పరిపాటి.

అలా ఎండలోను, బెంచిపైన మిగతా పిల్లలముందు నిల్చున్నపుడు చదువు మానేసి పారిపోవాలనుకునేవాడు.

కాని, తల్లి కళ్ళనీళ్లు నింపుకొంటూ డబ్బులిచ్చి "ఇవిగో...మొన్న నోట్సు కొనుక్కోవాలన్నావుగా – ఏమిటో ఒక్కగా నొక్కడు. ఎప్పుడేం అడిగినా వెతుక్కో పటమే" అంటున్నప్పుడు మాత్రం ఆవిడ పైని అంతులేని అవ్యాజమైన ప్రేమాను రాగాలు పుట్టుకొచ్చి, ఎలాగైనా బాగా చదివి అమ్మని సుఖపెట్టాలనుకునేవాడు.

అలాంటి వాతావరణంలో ప్రకాశరావు స్కూలు ఫైనలు పాసయ్యేనాటికి ఇంటి పరిస్థితి అయోమయంగా వుంది.

పెద్దకూతురు పెళ్ళయి అత్తవారింట్లో సీతమ్మవారి కష్టాలు పడుతోంది. రెండో పిల్ల పెళ్ళీడుకొచ్చి, స్కూలు ఫైనలు పాసయ్యి ఖాళీగా కూర్చుంది. సుబ్ర మణ్యంగారు పిల్లకి సంబంధాలయితే చూస్తున్నారు గాని, కుదిరితే పెళ్ళి ఎలా చెయ్యాలో, ఏం పెట్టిచెయ్యాలో అర్థం కాకుండా వుంది. ఆస్తి లేదు. రాబడి తక్కువ. అప్పుచేస్తే తీర్చే స్తోమతు

లేదు. కాని గుండెలపై కూర్చున్న పిల్ల. భయపెట్టే వయసు.

ఆ దంపతులిద్దరూ పిల్ల పెళ్ళి ఎలా చెయ్యాలిరా భగవంతుడాని సందిగ్ధంలో వుండగా ప్రకాశరావు స్కూలు ఫైనలు పాసయ్యేడు.

సుబ్రమణ్యంగారు ఆ పరిస్థితిలో కొడుకు పాసయినందుకు ఆనందించటానికి బదులు బాధపడ్డారు, భయపడ్డారు.

కామాక్షమ్మగారి సంతోషానికి అవధు లేవు. ఆవిడకి ఆ సమయంలో పిల్ల పెళ్ళి సమస్య అప్రధానమైపోయింది. ఇంకో నాలుగేళ్ళు కళ్ళు మూసుకొని కష్టపడితే పిల్లాడు చేతికొస్తాడు గదాని ఆవిడ ధైర్యం.

భర్తతో సంప్రదించకుండానే ఆవిడ కొడుకుచేత కాలేజీలకి అప్లై చేయించింది.

సుబ్రమణ్యంగారికి తన శక్తి తనకి తెలుసు. అనవసరంగా ఎత్తలేని బరువు



పెత్తి అవస్థపడటం ఆయనకి గిట్టదు. ఆయన దృష్టిలో పిల్లవాడి చదువుకన్నా పిల్లదాని పెళ్ళి ముఖ్యం.

ఓ కాలేజీలో సీటు వచ్చింది ప్రకాశరావుకి. ఆ రాత్రి కామాక్షమ్మగారు భర్తతో మొదటిసారిగా చెప్పింది. "ప్రకాశానికి సీటొచ్చింది" అని.

"ఏం సీటు?"

"ఏం చోద్యమండి...ఏం సీటేమిటి? పీయూసీలో సీటొచ్చింది"

"అంటే వాణ్ని కాలేజీలో చేర్చాలని నీ వుద్దేశం?"

"మరి ... మాన్పించాలనా మీ వుద్దేశం?"

సుబ్రమణ్యంగారు గొడవపడితే లాభం లేదని, అనునయంగా చెప్పి చూసేరు. "చూడూ...కాలేజీ చదువంటే మాటలు కాదు. జీతాలు, పుస్తకాలు తడిసి మోపెడవుతుంది. ఎదర పిల్ల పెళ్ళుందా? పెద్దదాని పెళ్ళికి చేసిన అప్పు అలాగే వుందా? అన్నీ తెలిసీ నువ్వు ఇలా మాట్లాడితే ఎలా?"

కామాక్షమ్మగారి కళ్ళలో నీళ్ళు సుళ్ళు తిరిగాయి.

"ఒక్కగానొక్కడు. వుత్సాహంగా చదువుకుంటున్నాడు. అటువంటివాడిని మాన్పించెయ్యటం ఏం సబబు చెప్పండి. మన కష్టాలు, అప్పులు ఎప్పుడూ వున్నవే. పిల్లవెధవకి ఎప్పుడన్నా ఓ మంచి చొక్కా కుట్టించామా, కాలికి చెప్పులు కూడా లేవే! మొన్నటికి మొన్న అమ్మా పాసయ్యానే అంటూ ఇంత మొహం చేసుకునొచ్చి చెపితే, వాడి చేతిలో కాపాయిగూడా పెట్టలేకపోయాం. ఏం బతుకులండీ మనవి. మన కడుపున పుట్టి వాడేం బావుకున్నాడు?"

సుబ్రమణ్యంగారికి ఇబ్బందిగా తోచింది.

"ప్రపంచంలో సంపాదించిన వాళ్ళంతా చదువుకున్న వాళ్ళే కాదు. అలాగే చదువుకున్న వాళ్ళంతా దోసిళ్ళతో సంపాయిస్తారన్న గ్యారంటీ లేదు. ఇపుడు రోజులు మారాయి. చదువుకున్న వాళ్ళు వుద్యోగాల్లేక తిరుగుతున్నారు. అంచేత మనిషికి చదువుకన్నా ముఖ్యం అదృష్టం"

ఆయన వాదం కామాక్షమ్మగారికి ఏమాత్రం నచ్చెయ్యలేదు.

"మీరెన్నన్నా చెప్పండి. వాడిని మాత్రం కాలేజీలో చేర్చాల్సిందే. లేకపోతే నేనూరుకోను" ఖచ్చితంగా తేల్చి చెప్పేసింది. ప్రకాశరావు చాలా రోజులు సందిగ్ధంలో వుండిపోయేడు. తను కాలేజీలో చేరుతున్నాడో లేదో అతడికి తెలీలేదు. తోటివాళ్ళంతా ఫీజులు కట్టి జాయినయిపోయారు. తండ్రి మాత్రం తనకేం పట్టనట్లు ప్రవర్తిస్తున్నాడు. చివరికి సస్పెన్స్ భరించలేక ఒకరోజున తల్లినడిగాడు - "జీతం ఎప్పుడు కడతారు?" అని.

కామాక్షమ్మగారు ముక్తసరిగా "రేపు కడుదూగాని" అంది.

ప్రకాశరావు కాశ్చర్యం అన్పించింది. కాని అన్నట్లుగానే, ఆవిడ మర్నాడు డబ్బులు చేతిలో పెట్టింది.

ప్రకాశరావు జీతం కట్టి కాలేజీలో జాయినయ్యాడు.

ఆ సాయంత్రం రెండో అక్క అరవింద చెప్పింది. "అమ్మ గాజు తాకట్టు పెట్టి డబ్బులు తెచ్చింది" అని. ఆ మాట విన్నాక అతనిలో ఏదో బాధ, దాని వెనుక ఏదో పట్టుదల – అమ్మ కష్టం వృధాపోకూడదని.

అలా కాలేజీలో చేరిన ప్రకాశరావు

చదువు డిగ్రీ వరకు ఆగకుండా సాగినా ఎప్పటికప్పుడు ఏవో ఆటంకాలు, చికాకులు, ఇంట్లో ఘర్షణలు. కుటుంబ పరిస్థితి మరింతగా దిగజారింది. అరవింద పెళ్ళిచేశాక సుబ్రహ్మణ్యంగారికి అప్పుల బాధ మరింత ఎక్కువైంది. ఆయనకొచ్చే జీతం వాళ్ళ వడ్డీలకి కూడా చాలటం లేదు. పైగా పుస్తకాలు పుణ్యాలు...

ప్రకాశరావుకి కుటుంబ పరిస్థితి చూస్తే భయం వేసింది. కుటుంబం కోసరం తండ్రి పడుతున్న అవస్థలు, వదిలించుకోలేని బాధ్యతలు, నలిగిపోయి కుమిలిపోతున్న తల్లిని చూస్తుంటే అతడికి నిజానికి బాధకన్న భయం వేసింది.

అతడికి తెలుసు-

తన చదువు పూర్తయిన మరుక్షణం, తల్లిదండ్రులు తనవైపు ఎంతో ఆశగా చూస్తారు. తాను వాళ్ళ కష్టాల్లో పాలు పంచుకోవాలని ఆశిస్తారు. అది సహజం... న్యాయం కూడా.

కాని-

తనకి ఉద్యోగం వెంటనే వస్తుందన్న గ్యారంటీ ఏమిటి?

ప్రకాశరావులో సంఘర్షణ - పెరుగుతున్న వయస్సు, ఆశలు, ఆలోచనలు...

చదువు పూర్తయినంత మాత్రాన ఉద్యోగం రాదనే అనుకోవాలి. ఎంతమంది చదువుకున్న మెరికల్లాంటి కుర్రాళ్ళు వృధాగా వీధుల వెంట తిరగటం లేదు? రేపు తనూ వాళ్ళలో ఒకడవ్వాలి. నిరుద్యోగుల లిస్టులో ఇంకో నెంబరు పెరుగుతుంది... అంతే!

ప్రకాశరావుకి జీవితమంటే అర్థమవసాగింది. ఇన్నేళ్ళుగా కళ్ళపై కప్పుకున్న బాల్యపు తెరలు తొలగిపోయి, ఎదర జీవితం వికృతంగా కన్పించి భయపెట్టసాగింది.

పరీక్షలు దగ్గరపడుతున్నాయి. స్నేహితులంతా దీక్షగా ఇరానీ టీలు తాగి మరీ చదువుతున్నారు. ప్రకాశరావు ప్రయత్నమైతే చేస్తున్నాడుగాని, అనేకానేక భయాలు, శంకలు, ప్రశ్నలు.

ఇంట్లోకూడా పరీక్షలు మొదలైనాయి.

రెండోపిల్ల అరవింద పెళ్ళయిన ఏడాది తిరక్కుండా, ఏడో నెల కడుపుతో పుట్టింటికొచ్చింది.

సుబ్రహ్మణ్యం, కామాక్షమ్మగార్లకు మళ్ళీ విషమ సమస్య. అల్లుడు నర్సింహారావు పక్కవూళ్ళోనే ఉద్యోగం చేస్తుండటంవల్ల ప్రతివారం అత్తవారింటికి భార్యని చూడటానికి వస్తుండేవాడు.

అతడొక విచిత్రమైన వ్యక్తి. అత్తవారింట్లో మర్యాదలకి ఏమాత్రం లోటు జరిగినా అలిగి, విసుక్కువెళ్ళిపోయేవాడు. స్నానానికి వేడి నీళ్ళు, తుడుచుకోటానికి ఇస్త్రీ టవలు, పడుకునేందుకు పట్టె మంచం, పరుపు వగైరాలు కావాల్సిందే...

కామాక్షమ్మగారు వున్నంతలో అల్లుడికి ఏ లోటూ రాకుండానే చూసేది. అయినా ఎక్కడన్నా చిన్న లోపం జరిగితే భార్యని సాధించి, తిట్టిపోసేవాడు.

అందువల్ల శనివారం వస్తోందంటే భయంగా వుండేది ఆ ఇంట్లో జనానికి.

* * *

పరీక్షలు పూర్తయినాయ్.

ప్రకాశం పరీక్షలు బాగానే రాశానను కున్నాడు. పరీక్షలు జరిగిన వారంరోజులు అరవింద ఆసుపత్రిలో వుండటంవల్ల వాళ్ళకి వండిపెట్టేవాళ్ళు లేక అవస్థపడ్డాడు. కామాక్షమ్మగారు ఆసుపత్రినుంచి వచ్చేసరికి పదవుతుంది. ఆవిడ ఈ పని ఆ పని చూసుకుని వంటగదిలోకెళ్ళేసరికి

తొమ్మిది దాటిపోయేది. సరిగ్గా ప్రకాశానికి తొమ్మిదింటికి పరీక్ష మొదలు. అంచేత ఒక్కోరోజు ఏమీ తినకుండానే వెళ్ళిపోయేవాడు. ఒకటి రెండు పర్యాయాలు రాత్రి మిగిలిపోయిన అన్నం తల్లి బలవంతంపై తినప్రయత్నించాడు. కాని నోటికెక్కేది కాదు. వాంతి వచ్చేలా అన్పించగానే లేచి వెళ్ళిపోయేవాడు. పరీక్ష మధ్యలో ఆకలిచేత ప్రాణం రెపరెపలాడేది. లేచి వెళ్ళి గ్లాసుడు చల్లటి నీళ్ళు గడగడా తాగొచ్చి కూర్చునేవాడు.

పరీక్ష రాసి ఇంటికొచ్చేసరికి తల్లి ఆసుపత్రికి వెళ్ళటంచేత ఇల్లు తాళం వేసుండేది. పక్కవారింట్లోంచి తాళం చెవిని తీసుకుని తనే వడ్డించుకు తినేవాడు. ప్రకాశానికో అలవాటుంది. ఎవరయినా ఎదురుగా కూర్చుని వడ్డిస్తేనే తప్ప సుష్టుగా, కడుపు నిండుగా తిన్లేడు. తనే వడ్డించుకు తినాల్సినపుడు అర్ధాకలితోనే తినేస్తాడు. అందువల్ల పరీక్షల వారం రోజులు అర్ధాకలితోనే గడిపాడు.

ఎలాగైతేనేం పరీక్షలు పూర్తయినాయ్. చివరి పరీక్ష రాసి బయటకి రాగానే ఎంతో హాయనిపించింది. నెత్తిపైని పెట్టుకుని ఇన్నాళ్ళు మోసిన బరువు దింపేసినట్లు హాయిగా, తేలిగ్గా వుందనిపించింది. చీకటి గుహలోంచి బయటపడ్డట్టు అనిపించి, పెద్దగా 'హుర్రే' అని అరవాలనిపించినా, సభ్యతకాదని ఆ ముచ్చటకి స్వస్తి చెప్పాడు.

కాలేజీలకి సెలవులిచ్చేసారు.

నర్సింహారావు భార్య ప్రసవించటంతో పూరెళ్ళిపోయాడు. అరవిందని ఇంటికి తీసుకొచ్చేడు.

ఆసుపత్రిలో బిల్లు కట్టాల్సిన రోజున సుబ్రమణ్యంగారు అనేకచోట్ల తిరిగారు. మిల్లు యజమానిని అడిగేరు. కాని అప్పటికే రెండు నెలల జీతం అడ్వాన్సుగా పుచ్చుకునుండటంచేత పని సానుకూలం కాలేదు. ఏంచెయ్యాలో తెలీనిస్థితిలో ఇంటికొచ్చి భార్యవైపు దీనంగా చూసేరు.

కామాక్షమ్మగారి ముక్కుపుడక ఇరవై ఏళ్ళ అనుబంధాన్ని తెంచుకుని మాయమయింది. అరవింద ఆసుపత్రి నుంచి ఇంటికొచ్చింది.




ప్రకాశానికి పరీక్షలయిపోయిన మొదటి కొద్దిరోజులు ఫ్రీగా, హాయిగా అన్పించినా తర్వాతర్వాత విపరీతమైన బోరనిపించింది. అందులో స్నేహితులందరూ పూరెళ్ళిపోయారు.

ఆ రోజే మార్కండేయులు కూడా వెళ్ళిపోయేరోజు.

మార్కండేయులిది చిన్న పల్లెటూరు. వాళ్ళు బాగా స్థితిపరులు. ఇల్లు, భూములు వగైరాలే కాకుండా, అనేకానేక వ్యాపారాల్లో వాటాలున్నాయి. కాని మార్కండేయులి తండ్రికి కాపురాన్ని బస్తీకి మార్చాలన్న ఆలోచనే రాలేదు. బస్తీల్లోని కృత్రిమ జీవితమంటే ఆయనకి ఏవగింపు. కాని, కాలేజీ చదువుకొచ్చేసరికి కొడుకుని పట్నం పంపక తప్పలేదు. హాస్టల్లో సీటుకోసం ప్రయత్నించేరు. కాని కుదరలేదు. చివరికి తన స్నేహితుడింట్లో చిన్నగదిని

ఏర్పాటుచేసి, చదువుకోమన్నారు.

ప్రకాశం ఆరోజు పుదయాన్నే అతడి గదికెళ్ళాడు.

అప్పటికే అతడు ప్రయాణ సన్నాహాల్లో పుస్తకాలు,బట్టలు సద్దుకుంటు న్నాడు. ప్రకాశాన్ని చూడగానే – "వచ్చావా! కాస్త ప్యాకింగులో హెల్ప్ చెయ్యరా" అనడిగాడు.

మార్కండేయులికి చదువరితనం ఎక్కువ. కనబడ్డ పుస్తకమల్లా కొనేసేవాడు. రోజూ ఇంగ్లీషు పేపరు తెప్పించేవాడు. పాతపేపర్లు, పుస్తకాలు, సగం గదికి సరి పోను పున్నాయి. ఇద్దరూ కలిసి మూటలు కడుతున్నారు. మార్కండేయులు పున్నట్లుండి అడిగాడు–"ఒరే ప్రకాశం! నాకు క్లాసు వస్తుందంటావా?" అని.

"తప్పకుండా వస్తుంది. అందులో అన్ని పేపర్లు అదరగొట్టేవుగా"

"ఏమోరా...క్లాసు రాకపోతే మా నాన్న ప్లాన్సన్నీ దెబ్బతింటాయి'' అన్నాడు భయంగా.

ఆ క్షణంలో ప్రకాశానికి అసూయని పించింది. తండ్రనే పదానికి నిర్వచనం చెప్పి, రూపకల్పనచేస్తే అచ్చు మార్కండేయులి తండ్రిలాగా పుంటాడేమోనని పించింది. కొడుకు భవిష్యత్తుపట్ల నిర్దిష్టమైన అభిప్రాయాలు, దానికితగ్గ పథకాలు తండ్రి అంచనామేరకు పుండాలని కొడుకు తాపత్రయం. ఎంత అందమైన అనుబంధం. తనింటి పరిస్థితిని, తన తండ్రిని పోల్చుకోవటం ఇష్టంలేక అక్కడితో ఆలోచనల్ని ఆపుచేసేడు.

"అప్పన్నా ... సువు తర్వాత ఏం చేద్దామనుకుంటున్నావ్?" మార్కండేయులి ప్రశ్నతో మళ్ళీ ఈ లోకంలోకొచ్చి పడ్డాడు.

ప్రకాశం కట్టడం పూర్తిచేసిన మూటని పక్కన పెడుతూ–"చేసేందుకేముంది. ఇక విద్యార్థి అవతారం చాలించి,గుమాస్తావేషం కట్టాలి" అన్నాడు పేలవంగా నవ్వుతూ.

"అప్పుడే వుద్యోగమా? నాన్ సెన్స్" అన్నాడు మార్కండేయులు. ప్రకాశం పాత పేపర్లని క్రమపద్ధతిలో పేరుస్తూ–

"ఒరే...మార్కండేయులూ! నీకో సంగతి చెప్పనా? అందరి బతుకులు నీలాగా వడ్డించిన విస్తళ్లు కావురా. ఎన్నో జన్మలు పుణ్యం చేసుకుంటేనేతప్ప నీ జీవితం లాంటి జీవితం దొరకదు. అయామ్ ఎ పూర్ మాన్" అన్నాడు మంద్రస్థాయిలో.

మార్కండేయులికి భయంవేసింది. అతడి ఫీలింగ్స్‌ని హర్ట్‌చేసేనేమోననిపించి చేతిలోవున్న పనిని అలాగే వదలి ప్రకాశం దగ్గరగావచ్చి ఆప్యాయంగా భుజం చుట్టూచెయ్యిచుట్టి,"ఏరా ప్రకాశం! ఇన్నేళ్ల మన పరిచయంలో ఏనాడన్నా నిన్ను చులకనగా చూసేనా?కనీసం అవహేళనగా మాట్లాడేనా?? లేదే. నేనేంతిం చే నీ చేత అది తినిపించాను. నేనెక్కడికెడితే కూడా నిన్ను తీసుకెళ్లాను. నాలో ఏపట్ల చులకన భావమేవుంటే నువ్వంటే అంతగా ఎందుకిష్టపడతాను. మన కాలేజీలో డబ్బున్న కుర్రాళ్లు ఎంతమంది లేరు...వాళ్లతో స్నేహం చెయ్యొచ్చుగా. పున్నవాడు, లేనివాడు, గొప్పవాడు, పేదవాడు...ఇవన్నీ బయట ప్రపంచంలో ఇతికే రాస్కెల్స్‌కిగాని మనక్కాదు. అసలింతకీ మనం స్నేహితులంకాము" ప్రకాశం వులిక్కిపడి అతడివైపు చూసేడు.

మార్కండేయులు చెరగని చిరునవ్వుతో "అలా చూస్తావేరా! వెర్రిమొహం

నుప్వూను. నిజంగా మనం ఫ్రెండ్స్ కాదు...మనం బ్రదర్స్మి"

ఇద్దరూ హాయిగా నవ్వుకున్నారు.

సామాన్లు సర్దటం పూర్తయ్యాక, మార్కండేయులుగడియారం చూసుకుని, "ఇంకో గంట టైముంది. ఇవ్వాళ మనిద్దరం కలిసి చివరిసారి హోటల్లో భోంచేద్దాంరా" అన్నాడు.

ప్రకాశం సంతోషంగా ఒప్పుకున్నాడు. రూముకి తాళం పెట్టి ఇద్దరూ మెయిన్‌రోడ్డుపై వున్న ఖరీదైన హోటలు వైపుగా నడుస్తున్నారు. వున్నట్లుండి మార్కండేయులడిగాడు–"ఏరా ... నీకేమన్నా పర్సనల్ ప్రాబ్లమ్స్‌గాని వున్నాయా?" అని.

"అంటే..." తెల్లబోయి అర్థంకానట్లు చూసేడు.

"అహ...ఏంలేదు. ఎప్పుడూ వరేగా, ఏదో పోగొట్టుకున్నవాడిలా వుంటావు. ఏవైనా వుంటే చెప్పరా"

ప్రకాశానికి ఆపాటి అనునయానికి ఆప్యాయతకీ మనస్సు ద్రవించింది.

"అబ్బే... ప్రాబ్లమ్స్ ఏమ్మంటాయి. ఇంటి పరిస్థితులు, మా అమ్మ పనే అవస్థలు చూస్తుంటే ఏవిటో బాధగా, భయంగా వుంటుందిరా...అంతే!"

మార్కండేయులు భుజం తట్టేడు– "ధైర్యంగా వుండు. ఎప్పుడూ నీకు సహాయం చెయ్యటానికి నేను సిద్ధంగా వుంటానని మర్చిపోకు"

ఆ మాటలో ప్రకాశానికి కొండంత ధైర్యం వచ్చింది.

ఇద్దరూ హోటల్లోకెళ్ళారు.మార్కండేయులు రెండు స్పెషల్ మీల్సు టిక్కెట్లు తీసుకున్నాడు.

పక్కపక్కల్నే కూర్చుని సుష్టుగా భోంచేశారు. భోజనం చేస్తూనే ఎన్నో విషయాలు మాట్లాడుకున్నారు.

భోజనాలు పూర్తిచేసి బయటికొచ్చారు.

"ఇవ్వాళ సరదాగా కిళ్ళీ బిగిద్దామోయ్" అంటూ రెండు మిఠాయి కిళ్ళీలు కట్టించేడు.

మళ్ళీ ఇద్దరూ చెయ్యిచెయ్యి కలుపుకుని నడుచుకుంటూ రూముకొచ్చారు.

ప్రకాశానికి ఆరోజు చాలా హాయిగా, సంతోషంగా వుందనిపించింది. కాని కొది సేపట్లో మార్కండేయులు దూరం అవుతాడని తెల్సి బాధగా వుంది.

మార్కండేయులు టైం చూసుకుని రిక్షా కోసం బయటకి పరిగెత్తాడు.

కాస్సేపట్లో రిక్షా పిల్చుకొచ్చి సామాన్లన్నీ అందులో పెట్టి, రూముకి తిరిగి తాళం పెట్టి ఇద్దరూ ఎక్కి కూర్చున్నారు.

తోవలో మార్కండేయులు అన్నాడు– "సరదాగా ఎప్పుడన్నా మా వూరు రాకూడదూ" అని.

"అలాగే...తప్పకుండా" మొహమాటంగా అన్నాడు.

"అలాగే అంటే కాదు. నిజంగా రావాలి...తెల్సిందా. నీకెప్పుడు మనసు బాగోపోయినా, ఏ కష్టం వచ్చినా నాకు కార్డు రాసి పడేస్తే నేనొస్తా. లేదంటే బస్సెక్కి కూర్చో...మిగతావి, నేచూసుకుంటా" అన్నాడు.

ప్రకాశం నవ్వి సరేనన్నట్టు తలూపాడు.

తర్వాత మళ్ళీ అన్నాడు - "నాకో చిన్న హెల్పు చెయ్యాలి"

ప్రకాశం ఆశ్చర్యంగా తల తిప్పి చూసేడు.

"ఏం లేదు...ఇంటి ఓనరు దగ్గ

లేదు. ఫామిలీతో సహా ఊరెళ్ళాడట. రెండుమూడు రోజుల్లో వస్తాట. అంతేత రూము తాళం చెవి, అద్దె డబ్బులు నీకిస్తా. ఆయనొచ్చాక వాటిని అందజెయ్యాలి" అన్నాడు.

సరేనన్నాడు ప్రకాశం.

మార్కండేయులు జేబులోంచి చిన్న తాళం చెవి, పర్సులోంచి రెండు వంద రూపాయల కాగితాల్ని తీసి, ప్రకాశానికందించేడు. అతడు వాటిని తన జేబులో భద్రంగా పెట్టుకున్నాడు.

బస్సుస్టాండులో సామానంతా ఇద్దరూ సీట్ల కింద సర్దేసి, బయటికొచ్చి నిలబడ్డారు. ఇద్దరికీ ఏవిటో బాధగా, కాలమనే కత్తి ఇద్దర్నీ రెండు ఖండాలుగా చీల్చి వేరుచేస్తున్నట్లుగా వుంది.

"ఏవిటోరా...కాలేజీ లైఫు ఇట్టే అయిపోయినట్టుంది కదూ" అన్నాడుమార్కండేయులు.

"అవును...నాకేవిటో చాలా బాధగా వుందిరా" అన్నాడు ప్రకాశం.

కండక్టరు, డ్రైవరు బస్సులోకెక్కటంతో కింద నిల్చున్న పాసింజర్స్ కూడా గుంపులు గుంపులుగా బస్సులోనికి దూరబడుతున్నారు.

"వస్తారా ప్రకాశం.. ఎడపగంటా రాసుగదాని మర్చిపోయేవ్. ఈ ఫ్రెండుని గుర్తుపెట్టుకో" అన్నాడు మార్కండేయులు ప్రకాశం చేతిని గట్టిగా నొక్కుతూ.

"నిన్నెలా మర్చిపోతాన్రా! నీకివ్వాల్సిన పరీక్ష ఫీజు డబ్బులుకూడా..." అంటూ ఏదో చెప్పబోయాడు ప్రకాశం.

బస్సు స్టార్టయింది-

మార్కండేయులు ప్రకాశం చేతిని వదిలేసి "నేనడిగానా? దాన్నిగురించి బాధపడకు. ఇవన్నీ సిల్లీ థింగ్స్...గుడ్ బై" అనేసి పరిగెత్తుకుంటూ వెళ్ళి బస్సెక్కాడు.

మార్కండేయుల్ని తీసుకుని బస్సు రొదచేసుకుంటూ ముందుకెళ్ళింది.

* * *

మార్కండేయులు కూడా వెళ్ళిపోయాక ప్రకాశానికి మరీ కష్టం అన్పించింది. జీవితం చాలా ఇరుకైనట్లు, తానొక పళ్ళ చక్రంలో ఇరుక్కుని గిరగిరా తిరుగుతున్నట్లు, యాంత్రికంగా విసుగ్గా, దిగులుగా అన్పించింది బతుకు.

ఉదయమే లేచేవాడు. కాలకృత్యాలు, స్నానం అయ్యేక, ఆ పైన ఏంచెయ్యాలో తెలీక అయోమయంగా తిరిగేవాడు. తల్లి ఏదైనా పని పురమాయిస్తే చేసేవాడు. ఇంట్లో కూర్చుంటే మనశ్శాంతి వుండేది కాదు.

అరవింద కూతురు,పసికూన ఎప్పుడూ ఏడుస్తూనే వుండేది.

అందుకే ఇంట్లోకన్నా బయట రోడ్ల పైనే హాయిగా వుండనిపించి సాధ్యమైనంతవరకు బయటే కాలక్షేపం చేస్తున్నాడు.

దీనికి తోడు మార్కండేయులు వెళ్ళిపోతూ తనపై వుంచిన గురుతరమైన బాధ్యత-ఇంటివాడికి అందచెయ్యమన్న వందకాగితాల్ని కాపాడటం చాలా కష్టంగా తోచింది. ఇంట్లో చూస్తే భయంకరమైన పరిస్థితులు- వయస్కొచ్చిన ఆడపిల్లని వెయ్యికళ్ళతో కాపాడుతూ, కట్టడిచేసినట్లు ఆ కాగితాల్ని ఎవరి కంటపడకుండా జాగ్రత్తపెడుతూ వచ్చేడు. రాత్రిపూట ఆ కాగితాల్ని క్లాసుపుస్తకాల్లో పెట్టేవాడు. తెల్లవారంగానే తిరిగి జేబులోకి బదిలీ చేసేవాడు. రెండుసార్లు వెళ్ళినా ఆ ఓనరు ఇంకా ఊరినుంచి రాలేదు.

ఆరోజూ మళ్ళీ ఆయనొచ్చాడేమో చూద్దామని బయల్దేరాడు. పసిపిల్లని పరీక్ష చేసి డాక్టరు మందు రాసిచ్చాడు. అవి కొనటానికిడబ్బులుకావాలి. ఇంట్లో బియ్యం నిండుకున్నాయ్. డబ్బులు కావాలి. ఇంటికి అద్దెకట్టాలి. డబ్బులుకావాలి...డబ్బు... డబ్బు...అన్నిటికి డబ్బు కావాలి. డబ్బుకి, మనిషి మనుగడకి గట్టి లంకె. తండ్రి ప్రవర్తన మామూలే. రావటం, పోవటం, ఏదైనా చెబితే వోపిగ్గావిని నిస్సహాయంగా చూడటం, తల్లేమో సంసారం బరువుకి కుంగిపోతోంది.

ప్రకాశం దిగుళ్ళకి ఇవన్నీ కారణాలే.

ప్రకాశం స్నేహితుడి గదిని సమీపించాడు. ఆ గదిని చూస్తే సాక్షాత్తు మార్కండేయుల్ని చూసినట్టేననిపించింది.

అక్కడనించి కదిలి పక్క తలుపు తట్టేడు.

ఓనరు వూరినించి వచ్చినట్టున్నాడు. ఆయనే స్వయంగా వచ్చి తలుపు తీశాడు. ప్రకాశాన్ని చూసి- "రావోయ్... అలా కూర్చో" అంటూ కుర్చీ చూపించి ఆయన ఒకదాంట్లో చతికిలపడ్డాడు.

"వూరి నుంచి వచ్చేసరికి రాత్రి పొద్దు పోయింది. అవునూ...మార్కండేయులు వూరెళ్ళి పోయాట్టగా" అనడిగారాయన.

"అవునండీ...మీరు లేరని తాళంచెవిని, అద్దె మొత్తాన్ని నాకిచ్చి వెళ్ళాడు. నే రెండుసార్లు వచ్చి వెళ్ళాను. ఇల్లు తాళం వేసుంది" అంటూ చేతిని జేబులోకి పోనిచ్చాడు.

గుండాగినంత పనైంది. నరాల్లో రక్తం గడ్డకట్టింది. నోట మాట రాలేదు.

జేబులో వంద కాగితాలు రెండూ లేవు. తాళంచెవి మాత్రమే వుంది!

ప్రకాశానికి నోటమాట రాక అలానే వుండిపోయాడు.

"ఒక్కరోజులో వద్దామని వెళ్ళాను. పన్లు కాలేదు. సరే అన్చెప్పి వుండిపోయాను. అన్నట్టు... ఇద్దరూ పరీక్షలు బాగా రాశారా?" అంటూ అతడి వైపు చూసి జీవంలేని అతడి మొహాన్ని చూసి గతుక్కుమన్నారు.

"ఏవిటీ....ఒంట్లో బాగాలేదా?" అని అడిగారు.

ప్రకాశం తేరుకున్నాడు. ఆలోచన చేసేడు. డబ్బు పోయిందంటే ఆయన నమ్మకపోవచ్చు. చులకనగా చూస్తాడు. కాబట్టి ఏదో ఒకటి చెప్పి బైటపడాలి- అనుకున్నాడు.

"అబ్బే... అదేంలేదండీ!ఇలా వెడుతూ వచ్చారోలేదోనని ఇటొచ్చానంతే! సాయంత్రం తెచ్చి డబ్బులిచ్చేస్తాను" అంటూ లేచాడు.

ఒక్కక్షణం ఆయనకు కళ్ళలో అనుమానం. కాని వెంటనే నవ్వేస్తూ,

"డబ్బు లెక్కడికి పోతాయ్. మార్కండేయులూ, నువ్వూ ఎలా స్నేహితులో నేను, వాళ్ళ నాన్న అంత స్నేహితులం" అన్నాడు.

ప్రకాశం వస్తానని చెప్పి బయట పడ్డాడు.

ఇంటివైపు నడక ప్రారంభించాడు.

"డబ్బులు ఏమైనట్లు? ఉదయం తను బట్టలేసుకుని, పుస్తకంలోంచి వంద కాగితాల్ని తీసి జేబులో పెట్టుకున్నాడు. అంతవరకు గుర్తుంది. తర్వాత ఏమై వుంటుంది? ఎక్కడన్నా జారిపోయాయా? ఇప్పుడేం చెయ్యాలి. పోయాయంటే మార్కండేయులు నమ్ముతాడా? నమ్మడు...ఎందుకు నమ్మాలి? అతడి పరిస్థితిలో తనున్నా నమ్మడు! 'రేయ్

ప్రకాశం..అవసరం వచ్చి వాడుకున్నానని చెప్పరా. నేనేం అనుకోన్నా' అంటాడు. దానికి తగ్గట్టు ఇంటి పరిస్థితులు అలాగే వున్నాయి. వాడా మాటన్నాక తను కళ్ళెత్తి వాడి వంక చూడగలడా? చూసి బతగ్గలడా? తన అమాయకత్వాన్ని, నిజాయితీని ఎలా రుజువుచేసుకోవాలి. దానికన్న వురేసుకుని చావటం బెటరు గదా!

ఇంటి కొచ్చాడు.

అరవింద పిల్లకి మందు పడుతోంది. కామాక్షమ్మగారు వంట గదిలో బియ్యం బాగు చేస్తోంది.

ప్రకాశం మధ్య గదిలోకెళ్ళి తల పట్టుకు కూర్చున్నాడు.

తల్లి అతడు కూర్చున్న గదిలోకొచ్చి కొడుకు దీనంగా, బాధగా వుండటం గమనించింది. ఆ పైన మెల్లగా అంది–"నీకు చెప్పడం మరిచాను. ఉదయం నీ జేబులో డబ్బు కనిపిస్తే తీసుకున్నాను''

ప్రకాశం చివుక్కున తలెత్తి తల్లి వంక చూసేడు. అతడిలో ఇంతకు ముసురున్న బాధ, ఆవేదన కోపంగా మారి రక్తం పుడికింది. "ఏవిటమ్మా...ఆ డబ్బులు ఎవరివి, ఏమిటన్న ఆలోచన కూడా వుండక్కర్లేదా? డబ్బు కనిపిస్తే చాలు చెప్పాపెట్టకుండా వాడేసుకోవడమేనా?" అన్నాడు పెద్దగా.

కామాక్షమ్మగారు బిత్తరపోయింది. కొడుకు అలా మాట్లాడతాడని వూహించనైనా వూహించలేదు. ఆవిడకి దుఃఖం ముంచుకొచ్చింది.

చివరికి కన్నకొడుకు చేత చివాట్లు తినే యోగంపట్టింది. కాని ఇదంతా ఎవరి కోసం చేస్తోంది? తన స్వార్థం కోసం చేస్తోందా? ఆ విషయం ఎవ్వరూ ఆలోచించరేం?

ఆ మాటే అంది కొడుకుతో– "మీ అందరి పొట్టలు నింపటానికే ఈ స్థితికి దిగజారేను" అనేసి వెళ్ళి వంట గదిలో కూలబడింది. అన్నం కలియ తిప్పుతూ, మరో చేత్తో కళ్ళు తుడుచుకుంటోంది. "నువ్వేదో సంపాయిస్తావని, తవ్వి తల కెత్తుతావని ఆశపడి, వున్నదంతా నీ చదువు కోసం వూడ్చిపోసేను. నువ్వేమో రెండు వందల రూపాయల గురించి ఇలా మొహం కండలు చీల్చుకుని, కనీసం తల్లన్న అభిమానం లేకుండా కూడా మాట్లాడేవు. అసలు ఆశలు పెంచుకోవటమే పెద్ద తప్పు"

ప్రకాశంలో కోపం చప్పున చల్లారి పోయింది. తొందరపడ్డందుకు బాధ పడ్డాడు. తల్లి తనకోసం పడ్డ అవస్థలు, కష్టాలు, కార్చిన కన్నీళ్లు ఒక్కసారిగా స్ఫురణకొచ్చి, సినిమా రీలులా గిర్రున తిరిగాయి.

గాజులమ్మి డబ్బులిచ్చిన అమ్మ,అన్నం చల్లారిపోయిందని మళ్ళీ వుడకేసి వడ్డించిన తల్లి, తానురావటం ఆలస్యమైతే ఆదుర్దాగా ఎదురుతెన్నులు చూసే ఏకైక జీవిని ఎంత మాటనేశాడు?

కాని అటు-మార్కండేయులు నిలబడి 'రేయ్ ప్రకాశం! అవసరంవచ్చి వాడుకున్నానని చెప్పరా...నేనేం అనుకోన్నా' అంటున్న భావన.

ఇద్దరికిద్దరే తనకత్యంత ఆప్తులు. ఆ ఇద్దరిలో ఎవరి మనస్సు బాధపడినా తనకే బాధ. ఎవరు తనని ఛీత్కారంచేసినా తను సహించి బతకలేడు.

ప్రకాశం అక్కణ్ణించి కదిలి మెల్లిగా వంటగదిలోకెళ్ళి తల్లి పక్కగా కూర్చున్నాడు. ఆవిడేం మాట్లాడలేదు.

ప్రకాశమే అన్నాడు "క్షమించమ్మా... తొందర్లో ఏదో వాగేశాను. ఆ డబ్బు మార్కండేయులిది. అద్దె కట్టమనిచ్చాడు. మొన్న పరీక్షఫీజు కూడా వాడే ఇచ్చాడు. ఈ డబ్బు ఇలా వాడేసుకుంటే అపార్థం చేసుకుంటాడన్న బాధతో అలా అన్నాను"

"ఫర్వాలేదులే నాయనా...ఆ పసిపిల్లకి మందులని అది గోల. ఇంట్లో బియ్యం లేవు. ఏం చెయ్యను చెప్పు? ఆయనేమో తనకేం పట్టనట్టు వెళ్ళిపోయారు. ఉదయం అనుకోకుండా నీ డబ్బులు కనిపించాయి. అవసరానికి ఖర్చు చేసేను" అంది. మళ్ళీ కామాక్షమ్మగారే అంది-"ఫస్టు కిచ్చేద్దాం. అలా అన్చెప్పాయనకి". ప్రకాశం మాట్లాడలేదు. ఆ క్షణంలో ఏం మాట్లాడినా ఆవిడకి అపార్థం స్ఫురించే ప్రమాదం వుంది.

అక్కడినించి లేచి బయటకొచ్చాడు. అశాంతిగా, ఏదో అలజడిగా వుంది. రోడ్డుపైకొచ్చి అక్కడికి దగ్గరలోవున్న మున్సిపాలిటీవారి పార్కువైపుగా నడక సాగించాడు. పార్కులోనికెళ్ళి దూరంగా వున్న సిమెంటు బల్లపైన కూర్చున్నాడు.

ఎంతాలోచించినా, ఎన్ని విధాల సర్ది చెప్పుకున్నా జరిగిందానికి పోనీలెమ్మని ఊరుకుందామంటే మనసు అంగీకరించటంలేదు. గాజు భవనాల్లో వుండేవాళ్ళు రాళ్ళు విసరకూడదన్నట్టు ఆర్థిక ఇబ్బందుల్లోవున్నవాళ్ళు ఎవరికీ మధ్యవర్తులుగా వుండకూడదనుకున్నాడు. అతగాడిచ్చిన రెండొందలు కర్పూరంలా హరించిపోయింది. కాని దానివల్లవచ్చే మాట మాత్రం తనూ, మార్కండేయులు బతికున్నంతకాలం వెంటాడుతూనే వుంది. తామిద్దరి మధ్యన అపార్థమనే సన్నటి తెరపడుతుంది.

పార్కులో జనం పల్చగా ఉన్నారు. వున్నవాళ్ళంతా గుంపులు గుంపులుగా వన సమారాధన చేసుకుంటున్నట్లుగా కూర్చున్నారు.

సాయంత్రం లోపల ఆ డబ్బులు ఆ ఓనరుకిస్తే కథ సుఖాంతమవుతుంది. లేకుంటే ఈ బాధని మోసుకుంటూ బతకాల్సి వుంటుంది. కాని తన పిచ్చిగాని రెండు వందల రూపాయలు సంపాదించటం మాటలా?

"సార్... మిమ్మల్ని అక్కడివాళ్ళు పిలుస్తుందారు" అన్న మాటతో వులిక్కిపడి తెప్పరిల్లి చూసేడు.

ఏడేళ్ళ కుర్రాడు నిలబడున్నాడు. దుమ్ము కొట్టుకుపోయిన లాగు, చొక్కా. కొబ్బరిపీచులాంటి ఎర్ర జుట్టు, మట్టిలో పుట్టి దాంట్లోనే నివసిస్తున్నవాడిలా జాలిగా వున్నాడు.

ఆ కుర్రాడు దూరంగా కూర్చునున్న ముగ్గురు వ్యక్తుల వైపు చూపిస్తూ "ఆళ్ళు మిమ్మల్ని పిలుస్తుందారు" అన్నాడు మళ్ళీ.

ప్రకాశం అర్థంకానట్లు అటువైపు చూసేడు.

అక్కడ ముగ్గురు వ్యక్తులు కూర్చున్నారు. ఒకతను పంచె, లాల్చీ, మిగతా ఇద్దరూ పాంట్లు, బుషర్టులు ధరించారు. కాని వాళ్ళెవరో, తనతో వాళ్ళకేం పనో అర్థం కాలేదు.

ప్రకాశం లేచి అటువైపుగా వెళ్ళాడు.

ప్రకాశం దగ్గరకు రాగానే వాళ్ళలో పంచెకట్టు వ్యక్తి లేచి నాలుగడుగులు ముందుకేసి "నువు సుబ్రహ్మణ్యంగారి అబ్బాయివి కదూ?" అనడిగాడు.

అవునన్నాడు ప్రకాశం.

పంచెకట్టుకున్న వ్యక్తి సన్నగా పీలగా

వున్నాడు. నల్లటి నొక్కుల జుట్టులో తెల్ల వెంట్రుకలు పురుషులందు పుణ్యపురుషుల్లా అక్కడక్కడ కనిపిస్తున్నాయి. అతడికి పంచెకన్నా పాంటు, షర్టు బాగా నప్పేవి. అతడు పంచె కట్టటానికి కారణం పెద్దమనిషిలా కనిపించాలన్న తాపత్రయమేమో కూడా అర్థం కాదు. మిగిలిన ఇద్దరూ నల్లగా, లావుగా, మొరటుగా రోడ్డుపక్కన పడవేసే తారు డబ్బాల్లాగా వున్నారు.

ఆ ముగ్గురూ ప్రకాశం వంక ఆసక్తిగా చూస్తున్నారు.

ప్రకాశానికి మాత్రం అంతా అయోమయంగా వుంది. వాళ్ళెవరో, తనతో వాళ్ళకేం పనో అర్థంకాక వెర్రిగా వాళ్ళని చూస్తూ నిలబడ్డాడు.

"నన్ను గుర్తుపట్టేవా?" అనడిగాడు పంచెకట్టుకున్న వ్యక్తి.

లేదన్నట్టు తలూపాడు ప్రకాశం.

"నా పేరు కొండ్రావు. మీ నాన్న పనిచేసే మిల్లు భాగస్వామిని. ఆఫ్‌కోర్స్, ఇపుడు కాదనుకో"

ప్రకాశానికి వెంటనే స్ఫురణకొచ్చింది. అప్పుడప్పుడు తండ్రి కోసం వస్తుండేవాడు. కాని అప్పుడు వేషధారణ భిన్నంగా వుండేది. అందువల్ల పోల్చుకోవటం కష్టమయింది.

"అవునవును... ఇప్పుడు గుర్తు కొచ్చింది" నవ్వుతూ అన్నాడు.

కొండ్రావు కూర్చుని ప్రకాశాన్ని కూడా కూర్చోమన్నాడు.

ఆ తర్వాత మెల్లిగా అడిగాడు— "పరీక్షలు బాగా రాసేవా? క్లాసుగానే వస్తుందా?" అని. ప్రకాశం చిన్నగా నవ్వి తలూపాడు.

కొండ్రావు పక్కన కూర్చున్న తారు డబ్బాలతో "చాలా తెలివైనవాడు. బుద్ధిమంతుడు" అన్నాడు. తారు డబ్బాలు గ్రహించినట్లు తలూపేయి.

ప్రకాశానికి అక్కడ చాలా ఇబ్బందిగా అనిపించింది.

మళ్ళీ కొండ్రావు అన్నాడు— "నేను ఇప్పుడు ఆ మిల్లులో పార్ట్‌నర్ని కాను... తెలుసా?"

తెలీదన్నాడు ప్రకాశం.

"ఏడాది క్రితం ఆయనకు,నాకు మాట పట్టింపులొచ్చాయ్. అందుచేత నా వాటా నే పుచ్చుకుని బయటకొచ్చేసాను. తర్వాత నేను వేరే వ్యాపారం పెట్టుకున్నా"

ఇదంతా తనని పిలిచిమరీ ఎందుకు చెబుతున్నాడో మాత్రం అర్థం కాలేదు ప్రకాశానికి.

కొండ్రావు జేబులోంచి సిగరెట్టు పెట్టెతీసి తానొకటి ముట్టించుకుని పక్కనవాళ్ళకందించేడు.

తర్వాత మళ్ళీ "మెయిన్ రోడ్డులో యూనివర్సల్ బార్ అండ్ రెస్టారెంటు అని ఈమధ్యనే వెలిసింది... గమనించావా?" అని అడిగాడు.

లేదన్నాడు ప్రకాశం.

"అది మనదే. ఇదిగో...వీళ్ళిద్దరూ,నేను ముగ్గురం కలిసి స్థాపించాం. బాగా రన్నవుతోంది. ఫ్యూచరు కూడా గొప్పగా వుంది" అని సిగరెట్టు దమ్ము లాగేడు.

అతడు చెప్పే విషయాలన్నీ వింటూ తర్వాత కోసం చిరునవ్వు చిందిస్తున్నాడు ప్రకాశం.

"సరే...అసలు విషయానికొద్దాం. నిన్నెందుకు పిలిపించానా అని ఆశ్చర్యపడిపోతుండవచ్చు. మా దగ్గర పనిచేయ్యటానికి నిజాయితీ గల కుర్రాళ్ళు కావాలి. మంచి జీతాలిస్తాం. అందుకే నిన్ను

పిల్చాను" అన్నాడు.

ప్రకాశం తెల్లబోయి అతడి వంక చూశాడు.

కొండల్రావు అతడి తత్తరపాటు గమనించి పెద్దగా నవ్వేడు.

"కంగారుపడకు. మీ నాన్న ఎలాంటి వాడో, అసలు మీ ఫామిలీ ఎలాంటిదో నాకు తెల్సు. అక్కడ మిల్లులో, ఆ బస్తాల మధ్యన ఇరుక్కుపోయిన హరిశ్చంద్రుడిలా మీ నాన్న వుండి పోయేడు. నిప్పులాంటి వాడు, నిజాయితీ గలవాడు. అందుకే పాపం లైఫులో పైకి రాలేకపోయాడు. నాతో పాటు వచ్చెయ్యమన్నాను.కాదుఅన్నాడు,కుదరదన్నాడు. సరే...అది వేరే విషయం" అని మళ్ళీ సిగరెట్టుని ఓ పట్టుపట్టేడు.

''ఇంతగా ఎందుకు చెబుతున్నానంటే నీకు చదువుపూర్తయింది.ఖాళీగా వున్నావు! సాయంత్రం పూట ఫైవ్ టు టెన్ అయిదు గంటలు కాస్త లెక్కలు చూసి పెట్టు అంతే! నీకూ కాలక్షేపంగా వుంటుంది, పైగా మీ నాన్నకి సహాయం చేసినవాడివవుతావు"

ప్రకాశం అది విని ఆలోచన మొదలు పెట్టేడు.

కొండల్రావు చెప్పింది నిజమే. సాయంత్రంపూట ఖాళీగా రోడ్లవెంట తిరిగే కన్నా ఇది నయమే. కాని తండ్రి ఏమంటాడో? తాను రానన్నవాడు కొడుకుని పంపుతాడా...పంపడు.

తల విదిలించాడు ప్రకాశం.

కాని, ఆ వెంటనే మార్కండేయులు ఇంటి ఓనరు, రెండొందల రూపాయలు గుర్తుకొచ్చాయి. ఆసమస్య అలాగేవుంది.

ఈమధ్యన ప్రకాశం లైబ్రరీలో ఏదో ఇంగ్లీషు పుస్తకం చదువుతున్నపుడు ఒక కొటేషన్ అతడిని బాగా ఆకర్షించింది. దాని-సారాంశం 'నీకు ఒకేఒకసమస్యుంటే దాన్నిగురించే ఆలోచించు. రెండుసమస్యలుంటే రెండిటినికలిపి ఆలోచించు' అని.

అటు సర్దుబాటుచెయ్యాల్సిన డబ్బు, ఇటు వుద్యోగం ఇస్తానంటున్న కొండల్రావు. ఈ రెండింటినీ ముడిపెట్టి ఆలోచిస్తే?

అలాగే ఆలోచించాడు ఒక్క క్షణం. మరుక్షణంలో తేరుకుని కొండల్రావు నడిగేడు ''ఇంతకీ జీతం ఎంతిస్తారు?''

"ఎంత కావాలి''?

''నాకు తెలీదు...మీరే చెప్పాలి''

కొండల్రావు తలతిప్పి తాగుడబ్బాల వంక చూసేడు. వాళ్ళేం మాట్లాడకపోవటంతో తనే చొరవగా ''రెండొందలు'' అన్నాడు.

ప్రకాశం లేచి నిల్చున్నాడు 'సరే... అలాగేవస్తాను"కాని ఒకషరతు అన్నాడు కొండల్రావుకూడా లేచి నిల్చున్నాడు. ''ఏమిటి'' అనడిగాడు.

''నాకర్జంటుగా ఇప్పటికిప్పుడు రెండు వందలరూపాయలు అడ్వాన్సుగా కావాలి. అలా ఇచ్చేపక్షంలో సాయంత్రంవచ్చి జాయినవుతాను'' అన్నాడు. ఈదెబ్బతో అవుతే రెండు సమస్యలు పరిష్కారం అవ్వాలి. అలాకాని పక్షంలో పాత సమస్య అలాగేవుండిపోతుంది. అసలు వీళ్ళు కలవలేదనుకుంటే సరిపోతుంది.

కొండల్రావు మళ్ళీ కూర్చున్నాడు. పక్కనున్నవాళ్ళతో ఏదో అస్పష్టంగా గొణిగాడు. వాళ్ళేదో అన్నారు.

ప్రకాశం కావాలనే దూరంగా నిల్చున్నాడు.

కొద్దిక్షణాల తర్వాత కొండల్రావు లేచి ప్రకాశం దగ్గరకొచ్చి "సరే..నువ్వడిగినట్లు అలాగే ఇస్తాను. కానీ, నాదీ ఒక షరత



తుంది'' అన్నాడు నవ్వుతూనే.

''ఏవిటి?''

''మీ నాన్నని నప్పించే పూచీ నీదే. నాకేం సంబంధం వుండదు. ఒకవేళ మీ నాన్న ఏదన్నా అభ్యంతరం పెడితే నా డబ్బులు నాకిచ్చేయాలి''

ప్రకాశం సరేనన్నాడు.

కొండ్రలావు జేబులోంచి పర్సుతీసి రెండు వంద కాగితాల్ని బయటకుతీసి, ప్రకాశం చేతిలో వుంచేరు.

''సాయంత్రం అయిదింటికల్లా వస్తాము'' అన్చెప్పి ప్రకాశం సంతోషంగా గోడ మూకి రోడ్డెక్కాడు.

అక్కడినించి సరాసరి మార్కండేయులు ఇంటి ఓనరు దగ్గిరకెళ్ళాడు. అతడికేదో చెప్పలేని సంతోషంగావుంది. వుద్యోగం

వచ్చిందనికాదు...తన నిజాయితీ ఋజువు చేసుకునే అవకాశం లభించినందుకు. వెళ్ళితలుపుతట్టేడు. ఆ యజమానే తలుపు తీసి లోపలికి రమ్మన్నాడు. కాని అతడు లోనికిగూడా పోకుండా అక్కడే నిల్చుని ఆ గదితాలూకు తాళంచెవిని ఆరెండువంద కాగితాల్ని ఆయన చేతిలో వుంచేడు.

ఆయన వాటినందుకుని మర్యాదకి "తొందరేమొచ్చిందోయ్...మెల్లిగా ఇవ్వచ్చుగా" అన్నాడు.

సెలవు పుచ్చుకుని వెనక్కి తిరిగాడు. లోలోపల వెర్రి ఆనందంగా వుంది. ఆకాశాన్ని అందుకున్నట్లు, సముద్రాన్ని అవలీలగా అపోసన పట్టేసినట్లు, ప్రపంచాన్ని జయించినట్టు....

ఆ క్షణంలో పక్షిలాగా ఆకాశంలో ఎగరాలనిపించింది. చేపలాగా నీళ్ళలో అలుపు వచ్చేవరకు ఈదాలనిపించింది. ఏదైనా సినిమా భక్తిగీతం పెద్దగా పాడాలనిపించింది.

అప్పుడేఇంకోవిషయంగూడాఅర్థమైంది. తనకి తెలీకుండానే మార్కండేయులు తన మనస్సులో ఎంతగా చోటుచేసుకున్నాడో.

వుషారుగా ఇంటికొచ్చాడు. సన్నగా ఈలగూడా వేస్తున్నాడు.

అరవింద అన్నంతింటోంది. పసిపిల్ల పుట్టాక మొదటిసారి నిద్రపోయింది. ఇల్లంతా నిశ్శబ్దంగా, ప్రశాంతంగా, హాయిగా వుందనిపించింది.

"అమ్మా...నాక్కూడాఅన్నంవడ్డించు" అంటూ గావుకేక పెట్టాడు.

కామాక్షమ్మగారు ఆశ్చర్యపడింది పిల్లవాడికి పిచ్చిగాని పట్టిందాని.

అరవింద "అయ్యో....అలాఅరవకురా మా అమ్మాయి లేస్తుంది" అందిభయంగా.




ఆ సాయంత్రం అయిదింటికల్లా యూనివర్సల్ బార్ అండ్ రెస్టారెంటుని వెతుక్కుంటూ వెళ్ళేడు. కొండల్రావుచెప్పినట్లుగా అది మెయిన్‌రోడ్డు పైనే వుంది. రెండంతస్థుల భవనం. పైన లాడ్జింగు,కింద కాఫీ హోటలు, దానిపక్కన బార్. పైకి చూడటానికి చిన్న కొట్టులా వుందిగాని, లోపలికెళితే పొడుగ్గా విశాలంగా వుంది.

పెద్ద హాలు,ఆ హాల్లోనీటుగా, అందంగా అమర్చిన కుర్చీలూ టేబిల్సు, వాటిపైన ఫ్లవర్ వాజ్ లు, గ్లాసుల్లో తెల్లటి నాప్‌కిన్స్, కాళ్లకింద మెత్తటి తివాచీ, గోడలకి అర్ధనగ్న స్త్రీల చిత్రాలు, మసక వెలుతురు చిమ్మేటపాలు, గుమ్మంపక్కన పొడుగాటి కౌంటరు, దానివెనుక కేబిన్‌లో రకరకాల అందమైన సీసాలు, ఆ కౌంటర్లో ఇద్దరు కుర్రాళ్లు చేతులుకట్టుకు నిల్చున్నారు. దానిక్కాస్త దూరంలో వరుసగా తెల్లటి యూనిఫారమ్స్‌లో నిల్చున్న బేరర్సు శాంతిదూతల్లా,అమృతాన్ని పంచబోయే దేవతల్లా నుంచుని వున్నారు.

ప్రకాశం ఒక్కక్షణం గుమ్మంలోనే నిల్చుని పరిసరాలని కలియజూసేడు.

కొండల్రావు, పార్కులో అతడితో పాటుగా వున్న వాళ్లు,దూరంగా ఒక టేబులు ముందు కూర్చుని ఏదో విషయంపైన చర్చించుకుంటున్నారు.

ప్రకాశాన్ని చూడగానే కొండల్రావు

అక్కణ్నించి లేచివచ్చాడు.

''వెల్‌కం టు యూనివర్సల్ బార్'' అంటూ నవ్వుతూ ఆహ్వానించాడు.

ప్రకాశం కాస్త సిగ్గుపడ్డాడు.

ప్రకాశాన్ని భుజంపై చెయ్యివేసి లోనికి నడిపిస్తూ, ''నగేష్..నగేష్'' అంటూ పిలిచాడు కొండల్రావు.

నీటుగా డ్రస్‌చేసుకుని అందంగా, హుందాగావున్న ఓ యువకుడు పక్క కిచెన్‌లోంచి వచ్చి కొండల్రావు ముందు నిల్చున్నాడు. అతడికి పాతికేళ్లుండవచ్చు.

కొండల్రావు ప్రకాశాన్ని చూపిస్తూ, పరిచయం చేస్తున్నవాడిలా, ''ఇతడి పేరు ప్రకాశరావు. ఇప్పట్నించి మన ఎంప్లాయి. అకౌంట్సు చూస్తాడు'' అని ప్రకాశంవేపు తిరిగి, ''ఇతడు నగేష్, ఇక్కడ స్టీవర్డు'' అన్నాడు.

ఇద్దరూ చేతులు కలుపుకున్నార్లు.

మళ్ళీ కొండల్రావు నగేష్‌తో, ''అకౌంట్సువ్యవహారం అతడికి తెల్సేదాకా బిల్సు రాయించు. జాగ్రత్తగా చూసుకో'' అని ప్రకాశం భుజంపై తట్టి, వెళ్ళిపోయాడు.

కౌంటరుకి కాస్త దూరంగా ఒక చిన్న టేబిలు, దానిముందు కుర్చీ వున్నాయి. దానిపైన బిల్లు పుస్తకం, పెన్సిలు.

నగేష్ ప్రకాశాన్ని ఆ బల్ల దగ్గరకి తీసుకెళ్ళి ''ఇది నీ సీటు... కూర్చో'' అన్నాడు.

ప్రకాశం ఆ కుర్చీలో కూర్చున్నాడు.

నగేష్‌కూడా పక్కనే వున్న మరో కుర్చీని లాక్కుని కూర్చుంటూ, ''ఏం చదివావ్?'' అనడిగాడు.

''ఫైనలియర్ పరీక్షలు రాసేను. రిజల్ట్సు రావాలి''

''గుడ్! ఇంతకుముందు ఎక్కడన్నా పన్చేశావా?''

లేదన్నట్లు తలూపాడు.

ఆ తర్వాత గొంతుసవరించుకుని చెప్ప నారంభించాడు. ''మనకి వర్కింగ్ అవర్స్ ఫైవ్ టు టెన్. కాని ఏడుగంటలకిగాని కస్టమర్స్‌రారు. నువ్వు చెయ్యాల్సింది వేరన్న చెప్పినట్లు టేబిలు ప్రకారం బిల్సు రాయాలి. అంతేకాకుండా వాళ్ళపైన ఒక కన్నుగూడా వేసుంచాలి. ఏం తీసుకెడు తున్నారు, ఏం బిల్సు రాయిస్తున్నారు జాగ్రత్తగా గమనించాలి. ఎప్పుడన్నా అనుమానం కలిగితే నాకు చెప్పు''

సరేనన్నాడు ప్రకాశం.

''తర్వాత ముఖ్యమైన విషయం-ఎంతో మంది పెద్దవాళ్లు, చిన్నవాళ్ళు, అన్ని రకాలవాళ్లు వస్తుంటారు. పరిచయం వున్న వాళ్ళు కూడా వస్తుంటారు. కాని అందరి పట్ల మనం నిర్లిప్తంగా, వాళ్ళెవరో తెలీనట్లు ప్రవర్తించాలి''

అర్థమైనట్లు తలూపేడు.

''ఇక్కడ పన్చేసేవాళ్ళందరికి రాగానే కాఫీ, వెళ్ళేటప్పుడు బిరియాని ఫ్రీ''

''అబ్బే! నే మాంసం తిననండి''

''పోన్లే- నీ కిష్టమైంది వెజిటేరియనే తినొచ్చు. ఆపైన నీకు డ్రింక్సుగాని కావాలంటే నీ ఖాతాలో రాస్తారు''

''నాకలవాటు లేదు''

''సంగతి చెబుతున్నా... ఇంకేవన్నా అనుమానాలొస్తే అడుగుతుండు'' అని జనం రావటంతో, నగేష్ వాళ్ళవైపుగా వెళ్ళాడు.

ప్రకాశం అలానే కూర్చుని ఆశ్చర్యంగా చూస్తున్నాడు.

జనం మెల్లి మెల్లిగా వస్తున్నారు. కొద్ది సేపట్లోనే పర్వదినాన దేవాలయంలాగా జనంతో కిటకిటలాడసాగింది.

సిగరెట్ పొగ, కలగాపులగమైన సంభాషణలు, బేరర్ల పరుగులు..అదొక విచిత్ర ప్రపంచంలాగా వుంది.

ప్రకాశం బిల్లు పుస్తకాన్ని ముందుకి లాక్కుని, పెన్సిలు చేత్తో పుచ్చుకుని తయారుగా కూర్చున్నాడు.

"సార్! టేబిలు నెంబర్ త్రీ-త్రిబుల్ ఎక్స రమ్ హాఫ్, రెండు సోడాలు, కాజు" అన్చెప్పి బేరర్ వెళ్లిపోయాడు.

ప్రకాశం కంగారు కంగారుగా అతడు చెప్పినవి గుర్తుచేసుకుని రాసుకుంటున్నాడు.

అంతలో మరో బేరర్ "సార్! టేబుల్ నంబర్ సిక్స్-చికెన్ మసాలా, నాలుగు పుల్కా" అనేసి వెళ్ళిపోయాడు.

ప్రకాశం అంతకుమునుపు ఆరో నెంబరు టేబులు తాలూకు బిల్లులో ఇపుడు చెప్పినవి రాసేడు.

ఆవిధంగా మొదటిరోజు తలెత్తుకునే అవకాశం కూడా లేకుండా పన్చేశాడు. పది గంటలవరకే అన్నారేగాని, జనం పూర్తిగా వెళ్ళి, ప్రకాశం ఇల్లు చేరేసరికి పదకొండు గంటలయింది.

"ఎక్కడికెళ్ళావురా తిండి తిప్పలు లేకుండా?" అంది తల్లి తలుపు తీసి.

అప్పటికే అందరూ నిద్రపోయారు.

ఆ క్షణంలో ఏం చెప్పాలో తెలీక "సినిమాకి" అంటూ గొణిగాడు.

ఆరోజునించి ప్రతినిత్యం అతడు ఆలస్యంగా రావటం,ఏదో సాకు చెప్పటం అలవాటైంది.

రోజులు గడుస్తున్నాయి...

అరవిందని తీసుకెడతానని నర్సింహారావు ఉత్తరం రాశాడు.

ఇంట్లో పళ్ళీ హడావుడి - పిల్లని పంపేటప్పుడు చీరె సారె పెట్టాలని ప్రయత్నాలు. సాంప్రదాయమనే జరీ గుడ్డని గొంతుకి బిగించుకుంటున్నారని ప్రకాశం అనుకున్నాడు. అతడు మాత్రం సాధ్యమైనంతవరకు బయటనే కాలక్షేపం చేస్తున్నాడు.పొద్దుపోయి ఇంటికి రావటం. మొదటి నెల జీతం తీసుకునే వరకు వుద్యోగ విషయం గోప్యంగా వుంచాలని నిర్ణయించుకున్నాడు. కారణం- తెలిస్తే ఎక్కడ తల్లిదండ్రులు మానెయ్యమని గొడవ చేస్తారోనని బెంగ.

ఆ శనివారం నర్సింహారావు సాయంత్రం అయిదింటికే వచ్చాడు. అప్పుడే ప్రకాశం బయటికెళ్ళటానికి తయారవుతున్నాడు.

కాఫీ తాగుతూ, "అలా షికారుగా వెళ్ళొద్దాం...వస్తావా?" అడిగాడు ప్రకాశాన్ని.

"అబ్బే! నాకు చాలా అర్జెంటు పనుంది...వెళ్ళాలి" అన్నాడు.

వాళ్ళిద్దరి సంభాషణని వింటున్న కామాక్షమ్మగారులోపల్నించే"అదేవిట్రా.. ఆ వెళ్ళేదోటుకే బావని కూడా తీసుకెళ్లు" అంది ఎక్కడ అల్లుడు అలుగుతాడో అని.

ప్రకాశం లోలోపలే నవ్వుకున్నాడు. తానెక్కడికి వెడుతున్నదీ తెలిస్తే వీళ్ళంతా ఏమనుకుంటారోనని ఆలోచించేడు.

అంతలో నర్సింహారావు "పోన్లెండి... పనిమీద వెడుతున్నాడు లావుంది. వెళ్ల నివ్వండి" అన్నాడు.

ప్రకాశం బయటికొచ్చేశాడు.

ఆరోజు ఎందువల్లనో బార్‌లో విపరీతమైన రద్దీగా వుంది. ఏడింటికే సీట్లు మొత్తం నిండిపోయినాయి.

ప్రకాశం మామూలుగా తన సీటు

వద్ద కూర్చుని యాంత్రికంగా బిల్సు రాస్తున్నాడు.

కస్టమర్స్ రణగొణ ధ్వని, బేరర్ల హడావుడి...గోలగా వుంది.

సిగరెట్ పొగ అసహ్యంగాను, పక్క కిచెన్‌లోంచి వస్తున్న మసాలా వాసన అద్భుతంగానూ వుంది.

అంతలో బయటినించి దా దా పు ఆరుగురు వ్యక్తులు ఒక్కసారి గుంపుగా లోనికొచ్చేశారు. నిజానికి వాళ్ళంతా ఒక బృందంవాళ్లు కాకపోయినా ఒక్కసారిగా లోనికి రావటం చేత అలా అన్పించింది.

అప్పుడే తలెత్తిన ప్రకాశం ఆ వచ్చిన వ్యక్తుల్లోని చివరి మనిషిని చూసి గతుక్కుమన్నాడు.కంగారు,ఆందోళనలు మొదలైనాయి. భయంతో తలదించుకు కూర్చున్నాడు. కొద్ది క్షణాల తర్వాత కళ్లు తిప్పి చూసేడు.

నర్సింహారావు ఒక మూలగా అప్పుడే ఖాళీ అయిన టేబులుముందు కూర్చుని వున్నాడు. బేరర్‌కి ఏవేవో ఆర్డర్ ఇస్తున్నాడు.

అది నాలుగో నెంబరు టేబులు.

ఆరోజుకి నగేష్‌ని కూర్చోపెట్టి తాను తప్పుకోవాలనుకున్నాడు.

కాని నగేష్ తనపన్లో తలమునకలుగా వున్నాడు

వెంటనే ప్రకాశం బుర్రలో ఆలోచన మొదలైంది.

'తేలు కుట్టిన దొంగ అరుస్తాడా? ఇపుడు బావ పరిస్థితి అంతే గదా! ఇంట్లో చెప్పాలన్నా ఏమని చెబుతాడు?'

ఆ ఆలోచన రావటంతో కాస్త ధైర్యం వచ్చింది. కుర్చీలో సర్దుక్కూర్చున్నాడు. అంతలో బేరర్ "సార్! నాలుగో నెంబర్ టేబులు - హేవర్డ్స్ విస్కీ నిబ్, చిప్స్,

ప్రకాశం బిల్లు రాసేడు.

తన పని తాను చేస్తున్నా, ఒక కన్ను అటువైపు వేసి వుంచాడు. కాని కాస్సేపట్లోనే నర్సింహారావు ఏదీ గమనించలేని స్థితికి వెళ్ళేడు.

బావ ప్రతిరోజూ తాగుతాడా? లేక అప్పుడప్పుడు ఫ్యాన్సీ కోసం పుచ్చుకునే బాపతా? అరవిందకు ఈ విషయం తెల్సునా? తెల్సీ ఎవ్వరికీ చెప్పలేదా?

భర్తలు తాగుతున్నారన్న విషయాన్ని భార్యలిలా కప్పిపుచ్చుతారా ? ఇది పాతివ్రత్యంలో ఒక భాగమా?

పస్సేస్తున్నా ఇవే ఆలోచన్లు.

ముప్పావుగంట గడిచింది. మందు మహత్తులకి జపం ఎక్కువయ్యి, దాని ప్రభావం చేత వాక్కు దెబ్బతింది. అంచేత అక్కడ గోల కాస తగ్గి ప్రశాంతంగా అన్పించింది. బేరరు నర్సింహారావు బిల్లు పట్టుకెళ్ళాడు.

కాస్సేపటికి నర్సింహారావు కాస్త తూలుకుంటూ లేచాడు.

ప్రకాశానికిప్పుడు భయంగా లేక పోయినా అతడినిబ్బంది పెట్టడం ఇష్టం లేక తలొంచుక్కూర్చున్నాడు.

నర్సింహారావు తూలుకుంటూ బయటికి వెళ్ళబోయి, ఏదో గుర్తుకొచ్చినవాడిలా వెనక్కి తిరిగి టాయిలెట్ వైపు సాగేడు. టాయిలెట్ రూంకెళ్ళాలంటే ప్రకాశం టేబిలు పక్కనించే వెళ్ళాలి.

నర్సింహారావు వెడుతూ ఒక్క క్షణం తల తిప్పి ప్రకాశం వంక చూసేడు. ఆ వైపు తల తిప్పుకుని లోనికెళ్ళాడు.

మరి కాస్సేపట్లో తిరిగి బయటకొచ్చి వెళ్ళిపోయాడు.

ఈసారి అసలు ప్రకాశం వయిపు

చూడనైనా చూడలేదు.

ప్రకాశం అంతా గమనిస్తూనేవున్నాడు. కాని అతనికి అర్థం కానిదల్లా బావ తనని చూశాడా లేదాని.

ఆరోజు కూడా ప్రకాశం ఇల్లు చేరే సరికి దాదాపు పదకొండు గంటలయింది. కాని ప్రతిరోజులా కాకుండా భిన్నంగా తండ్రి, బావ బయట కుర్చీల్లో కూర్చుని వున్నారు. తండ్రి తనకున్న రాజకీయ పరిజ్ఞానాన్ని వివరిస్తుంటే నర్సింహారావు తప్పదన్నట్లుగా వింటున్నాడు.

అరవింద లోపల పసిపిల్లతో సతమత మవుతోంది.

కామాక్షమ్మగారు కొడుకు కోసం ఎదురుచూస్తూ బయట మగవాళ్ళ సంభాషణని, లోపల పసిపిల్ల ఏడుపుని బాలన్స్‌డుగా వింటోంది.

ప్రకాశం వాకిట్లో అడుగుపెట్టగానే "రోజూ ఇలా ఆలస్యంగా వస్తున్నావ్... ఎక్కడికెడుతున్నావ్?'' అనడిగారు సుబ్రమణ్యంగారు.

"ఫ్రెండ్స్ కనిపిస్తేను....'' అంటూ లోనికి పోబోయేడు.

అంతలో నర్సింహారావు కల్పించు కుంటూ–''ఈ కాలం కుర్రాళ్ళకి ఎన్ని పన్లు, ఎన్ని వ్యవహారాలు. అసలు అన్ని విషయాలు మనకి చెబుతారేమిటి?" అన్నాడు.

అప్పటికప్పుడు ప్రకాశానికి ఆరోజు జరిగిన విశేషం గురించి, తనుద్యోగం గురించి చెప్పేయాలనుకున్నాడు. తను తప్పు చెయ్యనప్పుడు ఎందుకు భయపడాలనిపించింది.

కాని–

చెబితే ఎలా పరిణమిస్తుందో అతడికి తెల్సును.

తల్లి అప్రతిష్టని ఏడుస్తుంది. తండ్రి తన పరువంతా తీసేస్తున్నాడంటూ గొడవ చేస్తాడు.

పెద్ద సన్నివేశం, మెలోడ్రామా–

ఫలితంగా తనచేత ఆ ఉద్యోగం కాస్తా మాన్పిస్తారు.

అది అతడికిష్టంలేదు.

అంటే సంపాదనపైన మోజు కాదు.

కొండల్రావు వద్ద పుచ్చుకున్న అడ్వాన్సుకి సరిపడ రోజులన్నా పని చెయ్యాలి.

ఇవన్నీ ఆలోచించి, నర్సింహారావు అంటున్న మాటని విననట్లు లోనికెళ్ళి పోయాడు.

మర్నాడు వుదయమే నర్సింహారావు భార్యని తీసుకుని ప్రయాణమయ్యాడు. ప్రకాశం అప్పటికింకా నిద్ర లేవలేదు.

రిక్షా పిల్చి సామాన్లన్నీ దాంట్లో సర్దుతుండగా కామాక్షమ్మగారు కొడుకుని తట్టిలేపింది, "బావా వాళ్లు వెళుతున్నార్రా.. ఏవిటా మొద్దు నిద్ర" అంటూ.

ప్రకాశం కళ్లు నులుపుకుంటూ లేచేడు.

అప్పటికే సామాన్లన్నీ రిక్షాలో పేర్చి, నర్సింహారావు బయట తండ్రితో మాట్లాడు తున్నాడు.

అరవింద తల్లికి చెప్పి తమ్ముడివైపు చూసి, "వస్తాన్రా ప్రకాశం! సెలవులేగా.. ఎప్పుడన్నా మావూరురాకూడదూ" అంది.

ప్రకాశం అక్కగారి వంక పరీక్షగా చూసేడు. కాళ్ళకి పసుపు, కళ్ళకి కాటుక, కొత్త చీరె ... అరవింద నిండుగా, గౌరవంగా కనిపించింది.

అరవింద కళ్ళ నీళ్ళతో గడప దాటింది. ఆ వెనుకే పిల్లనెత్తుకుని కామాక్షమ్మగారు...

నర్సింహారావు అతగారికి, మావగారికి

చెప్పి రిక్షా ఎక్కి కూర్చున్నాడు. అరవింద కూడా రిక్షా ఎక్కింది.

ప్రకాశం వెళ్ళి పక్కనే నిల్చున్నాడు.

కామాక్షమ్మగారు పసిపిల్లని కూతురికి అందించింది.

అరవింద చివరిసారి తల్లికి, తండ్రికి చెప్పి, పక్కనే వున్న ప్రకాశంతో "తప్పకుండా మా ఊరు రావా. సర్దాగా నాల్రోజులు వుండొద్దూగాని" అంది.

వెంటనే నర్సింహారావు నవ్వుతూ, "ఇప్పుడెల్లా వస్తాడు...వుద్యోగం వదులుకుని" అన్నాడు.

రిక్షా కదిలి ముందుకెళ్ళింది.

ఆ వెనక మిగిలిపోయిన కామాక్షమ్మగారు, సుబ్రమణ్యంగారు అల్లుడి మాట అర్థంకాక మొహాలు చూసుకున్నారు.

ప్రకాశం అప్పటికే లోపలికొచ్చేశాడు.

సుబ్రమణ్యంగారు లోపలికొచ్చి, కొడుకుతో, "వాడేమిట్రా...ఉద్యోగం వదులుకుని ఎలా వస్తాడు అంటున్నాడు" అనడిగారు.

కామాక్షమ్మగారికి ఆశ్చర్యంగానే వుంది. కొడుకు ఉద్యోగంలో చేరితే చెప్పకుండా వుంటాడా? మరేమిటి .... అతగాడు అలా అంటాడు.

ప్రకాశానికి పచ్చి వెలక్కాయ గొంతుకు అడ్డం పడినట్టయింది.

చెప్పెయ్యటమా, లేక ఏదో ఒకటి సర్ది చెప్పటమా? ఒకవేళ తనిప్పుడు మభ్యపెట్టినా విషయం తెల్సిన అరవింద క్షేమంకన్నా ముందు ఈ విషయమే రాస్తుంది. అంచేత దాచటం ఎంతమాత్రం శ్రేయస్కరం కాదు.

"అవునమ్మా... ఓల్సు రా సేపనికొప్పుకున్నాను" అన్నాడు తలొంచుకుని.

"ఎక్కడ? ఏ షాపులో??" తండ్రి ప్రశ్న.

"షాపు కాదు...కొండ్రాలావు కొత్తగా పెట్టిన రెస్టారెంటులో" బార్ అనే పదాన్ని తెలివిగా తప్పించాననుకున్నాడు ప్రకాశం.

సుబ్రమణ్యంగారు కస్సుమనటానికి క్షణం కూడా పట్టలేదు.

"ఏదీ...ఆ కొండ్రాలావు కొత్తగా పెట్టిన బార్ షాపులోనేనా?"

అవునన్నట్లు తలాడించేడు.

"ఛీఛీ... సిగ్గులేదురా. ఇంత చదువు చదివి చివరికి ఆ తాగుబోతు వెధవ దగ్గర నౌకరీనా? పైగా వాడికి, మనకి పడదని తెల్సికూడా చేరేవన్నమాట. పైగా అడిగితేనేగాని చెప్పవు" అని భార్య వైపు చూసి, "చూసేవా...నీ కొడుకు చేస్తున్న నిర్వాకం..చూసి సంతోషించు" అన్నారు అక్కసుగా.

కామాక్షమ్మగారికంతా అయోమయంగా వుంది.

"బారంటే ఏ షాపు?సూపర్ బజారా?" అనడిగింది.

"సూపర్ బజారుకాదు...సారా బజారు. అక్కడ తాగి తందనాలాడతారు. వాళ్ళందరికి ఎంత తాగేరో లెక్కకట్టి చెబుతాడు నీ కొడుకు" వెటకారంగా అన్నాడు.

ప్రకాశం అలానే నిల్చునున్నాడు.

"అదేమిట్రా...అట్లాంటి చోట పనిచెయ్యటం. అంతగా నౌకరీ కావాలంటే నాన్నగారికి చెప్పలేకపోయేవా" అందావిడ బాధగా.

"పెద్దవాడయ్యాడు... గడ్డం మీసం వచ్చిందిగా. ఇవాళ అక్కడ ఉద్యోగంలో చేరేడు. రేపు కుతికలదాకా తాగి మరీ వస్తాడు..." భార్యని ఎలా ఏడ్పించాలో తెల్సినవాడిలా అన్నారు.

దాంతో కామాక్షమ్మగారు ఆందోళనగా కొడుకువంక చూసింది.

"నేను తప్పుచెయ్యనన్న నమ్మకం నాకుంది" గట్టిగా చెప్పేడు ప్రకాశం.

"నాయనా ప్రకాశం... అది కాదురా! ఆయనకి తెలీకుండా ఇలా నౌకరీల్లో చేరటం, అందులో ఆ సారాకొట్లో పనేవిట్రా? ఎవరన్నా చూసినా అప్రతిష్ఠ" అంటూ సన్నగా ఏడుపు ప్రారంభించిందావిడ.

ప్రకాశం బదులివ్వలేదు.

"సరే... అయిందేదో అయింది. ఇవ్వాళనించి మానెయ్యి. వెళ్ళి ఆ కొండల్రావుకి చెప్పెయ్యి" అన్నారు సుబ్రమణ్యంగారు.

ప్రకాశానికిపుడు ఉద్యోగం విషయం కన్నా పంతం అధికమైంది.

"అసలు నాకర్థంకాక అడుగుతున్నాను అక్కడ పన్చేస్తే ఏవిటి తప్పు? మీరు మిల్లులో పన్చెయ్యటంలేదూ? అలాగే ఇదీనూ"

సుబ్రమణ్యంగారికి నిజానికి రెండు నిమిషాలు ఏం చెప్పాలో అర్థంకాలేదు. కాని వెంటనే తేరుకుని, "అంటే..సంపాదనే ముఖ్యంగాని చేసేపని కాదంటావ్? సానిది సంపాయిస్తోంది పదిమంది పక్కల్లో సలిగి...ఫర్వాలేదంటావా?"

"తాకట్టు పెట్టి బతుకుతూ తెల్లబట్టలేసుకు తిరిగేకన్నా వున్నదేదో అమ్ముకోపటం బెటర్. అయినా బార్‌షాపులో పన్చేస్తే తాగుడలవాటయి పాడైపోయే ప్రమాదం వుందని కదూ మీ భయం" అంత ధైర్యం ఎక్కడినించి వచ్చిందో ప్రకాశానికే తెలీదు.

"అవున్రా"

"అయితే నాకీ విషయం చెప్పండి- దేవాలయాల్లో వుండేవాళ్ళంతా మహనీయులా ? మంచిచెడు మనిషినిబట్టి వుంటాయిగాని ప్రదేశాలనిబట్టి కాదు"

"ఇంతకీ ఏవంటావ్ ? ఆ వుద్యోగం చేస్తానంటావ్...అంతేగా"

"అక్కడుద్యోగం చెయ్యటంవల్ల నామర్దా, పరువుపోతుందన్న అభిప్రాయంతోనే నేకీభవించను. అలాఅని నాకనిపించినపుడు అలాగే మానేస్తాను"

కామాక్షమ్మగారు కల్పించుకుంది - "నాన్నగారితో అలాగేనా మాట్లాడేది?"

"ఇప్పుడేంవుందే...ఇంకా ముందుంది. మా నాయనా, మా బాబంటూ గారాబంచేసేవుగా అనుభవించు" అని కొడుకుతో ... "సరే నీ ఇష్టంవచ్చినట్లు ఏడ్చుకో కాని ఒక్క విషయం. ఏనాడైనా తాగి ఇంటికొచ్చినట్లుతెలిస్తే ఆరోజుతోసరి" అంటూ విసవిసా వెళ్ళిపోయేడు.

కామాక్షమ్మగారు కళ్ళు తుడుచుకుంటూ, "ఆయనొద్దంటుంటే మానెయ్యకూడదూ. అంత పట్టుదల పనికిరాదురా ప్రకాశం" అంది.

"ఏవిటమ్మా ... నువ్వుగూడా అలా మాట్లాడతావ్. అయినా దీనికంతటికీ కారణం నువ్వే"

"నేనా...ఆదేవిట్రా?"

"అవును. ఆరోజు నా జేబులోవున్న మార్కండేయులి డబ్బు నువు ఇంట్లో వాడకుండా వుండివుంటే ఇంత జరిగేది కాదు. నేనిపుడు ఆ డబ్బు సర్దిన కొండల్రావుకమ్ముడుపోయానమ్మా"

కామాక్షమ్మగారు మరి మాట్లాడలేదు. మౌనంగా లోపలికెళ్ళింది.

* * *

ఆ రోజునించి ఆ ఇంట్లో నిశ్శబ్దం రాజ్యంచేస్తోంది.

వున్న ముగ్గురు ఒకళ్ళతో ఒకళ్ళు మాట్లాడుకోరు. ఎవరి పని వారివి. ప్రకాశం పగలంతా నిద్రలోనో, వీధుల్లోనో కాలం వెళ్ళదీస్తున్నాడు. సాయంత్రం పూట వుద్యోగానికి యధావిధిగా వెడుతున్నాడు. రాత్రిపూట ఆలస్యంగా వస్తూనే వున్నాడు.



ప్రకాశం వుద్యోగంలో చేరి నెల పూర్తయింది.

ఆరోజు డ్యూటీపూర్తిచేసి వచ్చేస్తుంటే నగేష్ 'జీతాలిస్తారు. కాస్సేపు ఆగ' మన్నాడు. కొద్దిసేపటికి కొండల్రావు అందర్నీ పిల్చి పొడుగాటి ఎకౌంటు పుస్తకంలో రెవిన్యూ బిళ్ళలసంటించి సంతకాలు చెయ్యమన్నాడు.

అందరితోపాటు ప్రకాశం కూడా సంతకం పెట్టాడు.

పేరుపేరు వరసనాపిల్చి డబ్బులెక్క పెట్టి ఇస్తున్నాడు కొండల్రావు.

ప్రకాశంవంతు వచ్చేసరికి అతడివంక చూసి సన్నగా నవ్వుతూ వందకాగితాన్ని.

చేతిలోవుంచాడు "అపుడు నీకిచ్చి దాంట్లో ఓ వంద ఎడ్వాన్సుచేసుకున్నాను. ఫర్వాలేదుగా" అనడిగాడు.

ప్రకాశం అలాగేనన్నట్లు తలాడించేడు

"నీకెప్పుడన్నా అవసరంపడితే అడగొచ్చు...సరేనా?"

సరేనన్నాడు. బయటికొచ్చాడు.

రోడ్లమీద రద్దీ లేకపోవటంచేత విశాలంగా వున్నట్లనిపిస్తోంది. చల్లగాలి చెంపలనితాకి హాయిగావున్నట్లనిపించింది.

ప్రకాశం వంద కాగితాన్ని అలాగే చేత్తో పట్టుకున్నాడు.

అతడికెందుకో చాలా థ్రిల్లుగావుంది. సంతోషంగావుంది. గర్వంగావుంది. అది అతడి జీవితంలో తొలి సంపాదన.

తల్లి గర్భంలోంచి భూమిపైన పడ్డాక తొలిసారి తనదంటూ, తన కష్టార్జితమంటూ కళ్ళచూసిన పర్వదినం. అదొక మహత్తరమైన అనుభూతి. తర్వాతర్వాత అదృష్ట దురదృష్టాలనిబట్టి లక్షలు కోట్లు సంపాదించుకోవచ్చు, కూటికి గూడా లేక బాధపడొచ్చు.కాని ఆ క్షణానికున్న విలువ జీవితంలో మరేదానికీ వుండదు.

నగేష్‌తోపాటు చాలామంది వర్కర్స్ జీతాలిచ్చిన సందర్భంగా ఒకచోట కూర్చుని బీర్లుతాగుతూ ప్రకాశాన్ని కూడా ఆహ్వానించేరు. కాని తనకలవాటులేదని చెప్పి బయటపడ్డాడు.

నడుస్తూ అతనాలోచిస్తున్నది తొలి సంపాదనని ఎలా సద్వినియోగం చెయ్యాలాని.

అమ్మ చేతిలోపెట్టి నమస్కారం చెయ్యాలా? లేక తనే ఆ డబ్బుతో మంచి చీర కొని ఆవిడ చేతికివ్వటమా? లేక వేరే మార్గంవుందా?

ఏదో చెయ్యాలన్న తపన తన గుండెల్లో ఆవిడపట్ల తనకున్న ప్రేమ, అభిమానం, గౌరవాలని ప్రదర్శించటానికి ఈ డబ్బుని ఎలా వుపయోగించాలి అని.

ఇల్లు చేరేసరికి రోజూకన్నా ఆలస్యమైంది.

తల్లి, తండ్రి ఇద్దరూ వాకిట్లో కూర్చునున్నారు. వాళ్ళ మొహాలు మామూలుగా కాక ఏదో ఆందోళన, బాధలతో నిండున్నాయి.

వెంటనే అర్థమైంది. ఏదో జరిగింది. లేకపోతే ఆ సమయంలో వాళ్ళిద్దరూ అలా కూర్చోరు.

"ప్రకాశం...కొంప మునిగిందిరా! పెద్దక్కయ్య కొడుకు మధుగాడు పోయాడ్రా. టెలిగ్రాం వచ్చింది" అంది తల్లి పెద్దగా ఏడుస్తూ.

మధు అయిదేళ్ళవాడు. పెద్దక్కయ్య వసుంధర తొలిసంతానం. మధు తర్వాత ఆడపిల్ల పుట్టగానే ఇక పిల్లలు పుట్టకుండా ఆపరేషన్ చేయించుకుంది.

"ఎలా జరిగిందిట?" నమ్మలేనట్టు అడిగాడు.

ప్రకాశానికి మొదట్నించి పిల్లలంటేను, అందులో అప్పుడప్పుడే మాటలొస్తున్నపుడు వాళ్ళు చెప్పే కబుర్లంటేను ఇష్టం. ఆమధ్యన వసుంధర ఆపరేషన్ చేయించుకుని కొన్నాళ్ళు రెస్టుతీసుకోవాలని పుట్టింటికొచ్చి నెలపైనే వుంది. అపుడు మధు ప్రకాశానికి బాగా చనువయ్యాడు. రాత్రిపూట ప్రకాశం దగ్గరే పడుకునేవాడు. నా పేరేమిట్రా అంటే 'పెకాచెం' అనేవాడు.

ఇల్లంతా వాడే అయ్యి తిరిగేవాడు.

వాడెళ్ళాక చాలాసార్లు, చాలా సందర్భాల్లో ప్రకాశం వాడిని గుర్తుతెచ్చుకున్నాడు. అలాంటి మధు ఇపుడు? ఆలోచించలేకపోయాడు.

కామాక్షమ్మగారు కొడుకు ప్రశ్నకి బదులివ్వక మౌనంగా కళ్ళొత్తుకుంటోంది. సుబ్రమణ్యంగారన్నారు "టెలిగ్రాంలో అవన్నీ ఎక్కడ రాస్తారు?" అని.

కాస్సేపటికి కామాక్షమ్మగారు తెప్పరిల్లి అడిగింది, "రేపుదయం మొదటి బస్సు ఎన్ని గంటలకి?" అని.

"అయిదున్నరకి"

"మళ్ళీ ఇద్దరం వెళ్ళిరావాలంటే తడిసి మోపెడవుతుంది. అన్ని ఎద్దళ్లు డబ్బులు లేనపుడే వస్తాయ్"

ప్రకాశం అక్కణ్ణించి లేచి లోనికి వెళ్ళాడు. తన కష్టార్జితానికి కాళ్ళొచ్చాయని అర్థమైంది. కాని తన మొదటి సంపాదనని ఇలా బస్సుఛార్జీలకింద వినియోగించటం సుతరామూ ఇష్టంలేదు. కాని తప్పని పరిస్థితి. కష్టాలు, బాధలు ఒకదాని వెనుక ఒకటి బాకుల్లాగా, ఈటెల్లాగా వచ్చి తగుల్తున్నాయే.

"అన్నం తిందూగాని పద" అంది కామాక్షమ్మగారు కొడుకుతో.

కాని ప్రకాశానికి తినాలన్న ధ్యాసేలేదు. అతడిలోని భయం ఆకల్ని మింగేసింది.

"తినాలని లేదమ్మా!"

"ఏవిటో... ఈ అవస్థలకి దరీ అంతూ కనిపించటంలేదు. మొన్నటిదాకా ఆ పిల్లతో అవస్థ. ఇపుడేమో ఇది. వెళ్ళాలి...లేకపోతే బావుండదు. వచ్చేటప్పుడు పిల్లనిగూడా తీసుకురావాలి. ఎలాగో ఏమో. ఆయనేమో యథావిధి కాళ్ళు చాపుక్కూర్చున్నారు. నేనెట్లా చచ్చేదిరా ప్రకాశం" అది సంభాషణో, వ్యక్తమవుతున్న ఆవేదనో అర్థం కాలేదు.

అటువంటి పరిస్థితుల్లో మౌనానికి మించిన మందు లేదని అతడికి తెలుసు.

"నీకు కొండప్రాపు డబ్బుగాని ఇచ్చాడా?"

ఆ ప్రశ్న తండ్రి అడిగుంటే గొప్పగా వుండేదనుకున్నాడు ప్రకాశం. సరైన సమాధానం ఇచ్చుండేవాడు.

కాని అడిగింది అమ్మ.

తండ్రి తెలివితేటలు అతడికి తెలినివి కావు. ఏ విషయాలకి తల్లిని ప్రయోగించాలో ఆయనకి తెలుసు.

తల్లి మొహం చూసి అబద్ధం చెప్పటం అయ్యేపనికాదు. అలాగే ఆ జీతం డబ్బుని తాను అనుకున్న రీతిలో ఖర్చుపెట్టడం గూడా అయ్యేపనికాదు. తనవల్ల ఏదీ అయ్యేపనికాదు. తానొక శాపగ్రస్తుడు, దురదృష్టవంతుడు. పరిస్థితుల ప్రవాహంలో కొట్టుకుపోతున్న అల్పజీవి. ఎదురు నిల్చిపోరాడే ఓపిక, ధైర్యం, చొరవ తనకిలేవు.

ప్రకాశం తనవంక దీనంగా చూస్తూ నిలబడిన తల్లి చేతిలో ఆ వంద కాగితాన్ని పెట్టి మరేం మాట్లాడకుండా పక్కబట్టలు తీసుకుని బయటికి నడిచాడు.

* * *

చాలామందికి అతిలేలిగ్గా జరిగిపోయే పన్లు కొంతమంది విషయంలో అతి ప్రయత్నం పైనగాని జరగవు. జీవితం ప్రతి అడుగులో పోరాడుకుంటూ ముందుకు సాగిపోవాల్సి వుంటుంది. అలాంటివాళ్ళు అవుతే మహనీయులు కాకుంటే వ్యసనాలకి బానిసలు అవుతారు.

ప్రకాశానికి ఏదో చెప్పలేని నిరుత్సాహం, నిర్లిప్తత పట్టుకున్నాయి. తల్లి తండ్రులెళ్ళి రెండ్రోజులైంది. పగలంతా ఒంటరిగా ప్రతిమలా కూర్చుండిపోయి, శూన్యంలోకి చూపులుసారిస్తూ కాలం గడిపేస్తున్నాడు. సాయంకాలం డ్యూటీ. నిజానికి అక్కడికెళ్ళటానికి సంతోషంగా వుంటోందిప్పుడు. ఎప్పుడు సాయంత్రం

అవుతుందాని. ఎదురుచూస్తాడు పగలంతా.

ఆరోజుగూడా అన్నంతిని నిద్ర పోతున్నాడు.

ఎవరో తలుపు తట్టిన శబ్దంతో పులిక్కి పడలేచాడు. రెండుక్షణాలు తన భ్రమేమో నని అలాగే చూస్తున్నాడు. కాని మళ్ళీ చప్పుడైంది.

విసుగ్గా లేచెళ్ళి తలుపు తీసాడు.

వాకిట్లో క్లాస్‌మేట్ అవధాని నిల్చుని వున్నాడు.

"సుఖంగా పడుకుని నిద్రపోతున్నావా? ఇవ్వాళ రిజల్ట్సు వచ్చాయిరా" అన్నాడు.

"నే పాసయ్యానా?"

"వాట్టి పాసవటం ఏమిట్రా ఫూల్... సెకండ్ క్లాసులో పాసయ్యేవు"

ఆ మాట వినంగానే ప్రకాశం మిత్రుడిని గట్టిగా కౌగలించుకున్నాడు.

పిచ్చి సంతోషం, వెర్రి ఆనందం చంద్రమండలం పైన మొదటిసారి కాలు మోపినవాడు కూడా అంత సంతోష పడుండడు.

"మార్కండేయులికి ఫస్టు క్లాసొచ్చింది" అవధాని చెప్పిన మాట విని ప్రకాశానికి మరింతగా ఆనందమైంది.

* * *

రిజల్ట్సు వచ్చి మూడురోజులైంది.

మార్కండేయులు కోసరం ప్రకాశం ప్రతిక్షణం ఎదురుచూస్తున్నాడు. తాను కొద్దిరోజుల క్రితం రాసిన వుత్తరానికి సమాధానం రాకపోవడంకూడా ఆశ్చర్యం అన్పించింది. ఆ వుత్తరంలో ఎన్నో విషయాలు రాశాడు. అనేక భావాలూ, వూహలు, ఆశలు,ఎన్నో రాశాడు. దాదాపు పదిపేజీల వుత్తరం అది. దాన్ని ముగిస్తూ చివరికి "మార్కండేయులూ! నా దృష్టిలో కనిపించని దేవుడికన్నా, కన్పించే నువ్వే గొప్పవాడివి. ఏమిటో..నువులేకపోతేబతుకు భలే బోరుగా వుంది. తప్పక వస్తావు కదూ! ప్లీజ్...నా కోసం" అని.

ఆ వుత్తరం చూసి అతడికి కోపం వచ్చిందేమోనని భయంకూడా వేసింది.

ఏదియేమైనా రిజల్ట్సువచ్చి మూడురోజులైనా మార్కండేయులి జాడలేదు. తోటి మిత్రులందరూ పైచదువుకెళ్ళే ప్రయత్నాలు మొదలుపెట్టేరు.

ప్రకాశం స్తబ్దుగావూరుకుండిపోయేడు. ఏ ప్రయత్నాలూ చెయ్యటం లేదు. అతడి కున్నది ఒక్కటే ఆశ-మార్కండేయులు.

ప్రకాశం పాసయ్యాడని తెల్సి కొండ్రావు కంగ్రాట్సు చెప్పి, "అంటే వుద్యోగం మానేస్తావా?" అనడిగాడు. నిజాయితీగా పన్చెయ్యటం, నగేష్ కూడా అతడి పనిని మెచ్చుకోవటం చేత ప్రకాశమంటే కొండ్రావుకి అభిమానం, గురి ఏర్పడినాయి.

"అబ్బే..అటువంటి ప్రమాదంవుండదులెండి" అన్నాడు ప్రకాశం.

కొండ్రావుకి ఆ నవ్వు, దాని వెనుక ఉన్న వ్యంగ్యంలోని నిజం అర్థమైంది.

ఈలోగా బార్ మొత్తం పూర్తిగా నిండిపోయింది. అందరూ ఎవరి పనుల్లో వాళ్ళున్నారు. ప్రకాశం తలొంచుకుని చకచకా బిల్సు రాస్తున్నాడు. నగేష్ టేబుల్సు వద్దకి వెళ్ళి ఆర్డర్స్ తీసుకుంటున్నాడు.

సరిగ్గా అదే సమయానికి ఒక నల్లటి నడివయస్సు వ్యక్తి గ్లాసు తలుపు నెట్టుకుంటూ లోపలికొచ్చేడు.

అతడికి నలభై పైగానే వయస్సు వుంటుంది. తెల్లపాంటు, అదే రంగు బుష్షర్టు ధరించేడు. లావుగా, నల్లగా,

వుబ్బిన కళ్ళు, దవడలు, మట్టి ముద్దని అతికించినట్లు ముక్కు, మొరటు పెదాలు, పల్చబడుతున్న జుట్టు ... అతడు రావటమే చాలా హుందాగా,ఏదో హక్కు దారుడిలా వచ్చేడు. చేతిలో రెండుమూడు ఫైల్సు కూడా వున్నాయి.

అతడు లోనికి రాగానే ఎన్నడూ, ఎవ్వరికీ లేనిది కొండర్రావు దాదాపు పరిగెత్తుకుంటూ వెళ్ళి అతడిని ఆహ్వానిం చేడు.

అప్పటికే వున్న టేబుల్సన్నీ ఆక్ర మింపబడటం చేత అతడికి ప్రత్యేకంగా వేరే ఒక కుర్చీని, బల్లని ఏర్పాటు చేయి స్తున్నాడు కొండర్రావు.

అదంతా గమనించిన ప్రకాశం, ఆ వచ్చిన వ్యక్తి చాలా ముఖ్యమైనవాడు, గొప్పవాడు అయ్యుండాలని నిర్ధారించు కున్నాడు.

అతడికి రావాల్సిన ఏర్పాట్లన్నీ చకచకా జరిగిపోతున్నాయ్.

కొండర్రావు నగేష్‌ని పిలిచి ఏవేవో తెమ్మని పురమాయిస్తున్నాడు.

అతడికి ఎదురుగా ఇంకో కుర్చీ వేసుకూర్చుంటూ-"ఈమధ్యన రావటం లేదు. వూళ్ళో లేరా ?" అనడిగాడు కొండర్రావు.

ఆ వ్యక్తి సిగరెట్టు ముట్టించుకుంటూ, "సెలవుపెట్టి మా వూరెళ్ళాను. పెథవది రొటీన్‌లైఫ్ బోరెక్కింది" అని సిగరెట్టు గట్టిగా దమ్ము పట్టి-

"అయినా టౌన్లో వుండే ఇక్కడికి రాకుండా ఎలా వుండగలను?" అన్నాడు నవ్వుతూ. ఇక్కడికి రానివాళ్ళ బతుకులకి సార్థకత లేనట్లుగా ఉందా నవ్వు.

కొండర్రావు పెద్దగా నవ్వేడు.

బేరర్ అన్నీ తెచ్చి, గ్లాసులో ద్రవాన్ని పోసి, సోడా కలిపి, ఐసు ముక్కలు వేసి తప్పుకున్నాడు.

ఆ వ్యక్తి గ్లాసు పైకెత్తి ఓ గుటకేసి తల తిప్పి చూస్తే ప్రకాశం కన్పించేడు. ఆ తర్వాత కొండర్రావుతో "ఈ కుర్రాడు కొత్తగా చేరాడా?" అడిగాడు.

"అవును...నెల రోజులైంది. ప్రకాశ్ రావని గ్రాడ్యుయేట్. మొన్ననే సెకండ్ క్లాసులో పాసయ్యాడు. బుద్ధిమంతుడు లెండి" అన్చెప్పి, ప్రకాశాన్ని దగ్గరకు రమ్మన్నట్లుగా పిల్చేడు కొండర్రావు.

ప్రకాశం చటుక్కున కుర్చీలోంచి లేచి అతడి టేబులు దగ్గరికి వెళ్ళి నిల్చు న్నాడు. ఆయనని పరిచయం చేస్తున్నట్లు, "వీరు పర్వతాల్రావుగారని, ఎంప్లాయి మెంటు ఆఫీసరు. చాలా గొప్పవారు. మంచి హెల్పింగ్ నేచరుంది" అన్నాడు.

ప్రకాశం వినయంగా నమస్కారం చేసేడు.

ఆ వ్యక్తి అతడి నమస్కారాన్ని అందుకున్నట్లు తలాడించి "పేర్లు చెప్పండి చాలు.... డిజిగ్నేషన్సెందుకు?" అన్నాడు చిరాకుని నవ్వులో కలుపుతూ.

ప్రకాశం మెల్లిగా వెనక్కొచ్చి తన సీట్లో కూర్చున్నాడు.అక్కడ వాళ్ళిద్దరూ కబుర్లలో పడ్డారు. కాస్సేపటికి కొండర్రావు కూడా ఏదో మిషపైన తప్పుకున్నాడు.

పర్వతాల్రావు ఒక్కడే కూర్చుని పట్టిస్తున్నాడు.

అటువైపుగా వచ్చినపుడు నగేష్ ప్రకాశం చెవిలోరహస్యం చెబుతున్నట్లుగా, "ఆయనెవరో తెల్సా...మీలాంటివాళ్ళం దరికీ దేవుడు. ఎంప్లాయ్‌మెంటు ఆఫీసరు. ఇక్కడ ఖాతా వుంది. దాదాపు ప్రతి రోజూ వస్తాడు. చూడటానికలావున్నాడు

గానీ చాలా మంచివాడు. నాకే డిగ్రీ వుండివుంటే ఈపాటికి ఉద్యోగం సంపాదించేవాడిని. ప్చ్ ... ఏం లాభం" అంటూ గొణిగాడు.

ప్రకాశానికేదో ఆశ తళుక్కున మెరిసింది.

పర్వతాలరావు లేచేసరికి పదకొండు గంటలయింది. మత్తుగా వెడుతూ కూడా ఒక్క క్షణం తన వంక తేరిపార చూడటం ప్రకాశం గమనించేడు.



ఆ మర్నాడు కూడా మార్కండేయులి జాడ లేదు. రిజల్ట్సు రాగానే వస్తానన్నవాడు ఎందువల్ల రాలేదో అర్థం కాకుండా వుంది. రాసిన ఉత్తరానికి జవాబు లేదు. అతడి గురించి తనకి సమాచారం అందివ్వగల మనిషి ఆ ఇంటి ఓనరు. ఆయనదీ అదే వూరు. అక్కడ కాస్తో కూస్తో ఆస్తి వుండటంచేత రెండు మూడు నెలలకోసారి ఆ ఊరు వెళ్ళొస్తుంటాడు. అంచేత ఆయనేదేనా విశేషాలు చెబుతాడని ప్రకాశం ఓ ఉదయమే ఆయన ఇంటికి వెళ్ళాడు.

లోగడ మార్కండేయులున్న గదిలోకి ఎవరో కొత్త దంపతులు దిగినట్లున్నారు. మొగుడు సైకిలెక్కి ఆఫీసుకి వెడుతుంటే అతడు సందు మలుపు తిరిగే దాకా చూస్తూ నిల్చుంది ఆవిడ.

ప్రకాశం వెళ్ళి ఓనరు వాటా తలుపు తట్టాడు. ఆయన భార్య తలుపు తీసి- స్నానం చేస్తున్నారు, కూర్చోమంది. ప్రకాశం లోపలికెళ్ళి కూర్చుని, దినపత్రికని చేతిలోకి తీసుకొన్నాడు.

పది నిమిషాల్లో ఆయనొచ్చాడు. లుంగీ కట్టుకుని, టవలుని పైన కప్పుకుని వచ్చి, "నువ్వటోయ్...ఎవరో అనుకున్నాను" అన్నారు పక్కనే వున్న కుర్చీలో కూర్చుంటూ.

"మా రిజల్ట్సు వచ్చాయండి. నాకు సెకండ్ క్లాసొచ్చింది. మార్కండేయులికి ఫస్ట్ క్లాసొచ్చింది"

"అవునవును...విన్నాను. ఏమిటో 'బ త క ని పిల్లాడు బారెడని'..." విచారంగా అన్నారు.

అంత సంతోషకరమైన వార్త పనిగట్టుకొచ్చి చెబుతుంటే అలా విచారంగా, దిగులుగా ఆయనుండటం చూసి ప్రకాశానికి బాధనిపించింది. ముసలాడికి మనస్సు బాగాలేదేమోననుకున్నాడు. అతనలా అనుకుంటుండగానే, ఆయన తిరిగి మళ్ళీ అన్నారు-

"ఏమిటోనోయ్...వెధవ బతుకు. ఏ క్షణానికి ఏం జరుగుతుందో తెలీదుగదా"

దాంతో ప్రకాశానికర్థమైంది. పాపం ఆయన తాలూకు అప్పెవరో పోయుంటారు. తను వేళగానివేళ వచ్చాడు. రెండు ఊరడింపు మాటలు మాట్లాడి తప్పుకోవటం బెటరు.

"పాపం చాలా బాధపడుతున్నారు... ఏమైందీ?"

"ఇంకా ఏం కావాలోయ్. జరిగింది చాలదూ? తీసుకుపోవాలంటే ఆ దేవుడికి అతడే దొరికాడా? మాలాంటి ముసలాళ్ళని పట్టుకుపోకూడదూ?"

"ఎవరండీ...ఎవరిగురించి మీరనేది?" ప్రకాశం గుండెలు ఫైరింజను గంటల్లా కొట్టుకోసాగాయి.

"అంతే...నీకింకా తెలీదా?"

"ఏమిటి?"

"అదే...మార్కండేయులు గురించి"

"ఏమైంది...చెప్పండి మార్కండేయులికేమైంది?" కుర్చీలోంచి లేచి నిలబడి ఆత్రంగా అడిగాడు.

"మార్కండేయులు మరింక లేడోయ్.. చనిపోయాడు"

ఆ తర్వాత కొద్దిక్షణాలు ఏమైందీ ప్రకాశానికి తెలీదు.. తనకి స్పృహ తప్పిందో, లేక సృష్టి ఆగిందో తెలీదు. ఆకాశం ఫెళఫెళామంటూ కిందపడిందో, భూమి వికృతంగా శబ్దంచేస్తూ విచ్చుకుందో కూడా తెలీదు. ప్రళయఘోష పెడుతూ సముద్రగర్భంలో అలలన్నీ కడుపులో దాచుకున్న తల్లిలాంటి సాగరాన్ని వదిలి భూతలాన్ని ముట్టు పెట్టడానికి వచ్చేస్తున్నాయో కూడా తెలీదు. ఏదో జరిగింది – ఏమిటేమిటో జరిగిపోతోంది. కాని విచిత్రం! అదేమిటో తెలీదు.

ప్రకాశం తేరుకుని కళ్ళు విప్పేసరికి ఆ యజమాని ఆత్రంగా తన మొహంలో మొహం పెట్టి చూస్తున్నాడు. ఆయనకొద్దిదూరంలో మంచినీళ్ల గ్లాసుతో ఆయన భార్య.

"కంగారు పెట్టేసేవోయ్! ఇండ ... ముందు కాసిని నీళ్లుతాగు" భార్య చేతిలోని గ్లాసుని ప్రకాశానికి బట్వాడాచేశాడు.

ప్రకాశం పిచ్చిపిచ్చిగా ఆయనవంక చూసి–"మీరు చెప్పింది నిజమేనా! నిజం కాదని చెప్పండి" బతిమాలుతున్నట్లుగా అన్నాడు.

"అన్నీ చెబుతాగాని, ముందు నీళ్ళు కాస్త తాగు"

ప్రకాశం వెర్రిగా ఆ గ్లాసులో నీరు గొంతుకలో వంపుకున్నాడు. ఆ పైన చెప్పమన్నట్లుగా ఆయన వైపు చూసేడు.

"నిజాన్ని అబద్ధమని సరిపుచ్చుకుంటే లభించేది తాత్కాలిక ఉపశాంతేగాని, మరేదీ కాదు. గుండె దిటవుపర్చుకుని, నిజాన్ని ధైర్యంగా ఎదుర్కోవాలి. మార్కండేయులు నిజంగానేచనిపోయాడు"

ఆ కొద్దిక్షణాల్లోనే ప్రకాశం మొదటి షాక్‌నించి తేరుకున్నాడు. ఆ కర్కశమైన నిజాన్ని జీర్ణంచేసుకున్నాడు. తన మంచి చెడు, కష్టం సుఖం కనుక్కుని, భుజంతట్టి "నీకేం ఫర్వాలేదు...నేనున్నా" అన్న ఆత్మీయుడు, ధైర్యం చెప్పిన మిత్రుడు- మార్కండేయులు ఇక తనకి కనిపించనంత దూరంగా వెళ్ళిపోయాడు. ఆ దుర్వార్తతో రాజీపడ్డాడు గాని,ఆక్రోశిస్తున్న మనస్సుని ఆపలేకపోతున్నాడు. కళ్ళ వెంట నీళ్ళు ధారలుగా కారుతున్నాయ్.

"ఎలా జరిగింది ... వెళ్ళేటప్పుడు బాగానేవున్నాడే"

ప్రకాశం అడిగిన ప్రశ్న విన్నాక, ఆ యజమానికి ధైర్యం వచ్చింది. ఊపిరి పీల్చుకుని చెప్పనారంభించేడు...

"ఇక్కడినించి వెళ్ళాక కొన్నాళ్ళు జ్వరం వచ్చిందట. అదేదో మామూలు జ్వరం అన్చెప్పి అక్కడే వైద్యం చేయించారట. కాని అతడికి కామెర్ల వ్యాధిని ఎవ్వరూ గుర్తించలేకపోయారు. తీరా తెల్సుకుని ఇక్కడికి తెచ్చేసరికి ఆలస్యం అయిపోయింది"

"ఈ వూరు తెచ్చారా? అయ్యో... ఒక్కమాట చెప్పుంటే ఎంత బాగుండేది" బాధగా అన్నాడు.

"నిజమే...కాని నీ అడ్రస్సు వాళ్ళ నాన్నకి తెలీదు. కాస్సేపటికి పోతాడనగా నిన్ను పిలిపించమన్నాట్ట. నిన్ను చూడాల నుంది అన్నాట్ట. సరిగ్గా సమయానికి నేనూ వూళ్ళో లేను. వాళ్ళ నాన్నేమో కాస్సేపు ఆసుపత్రి వాకిట్లోనే నిల్చుని, తర్వాత వెళ్ళి, నువ్వు వూళ్ళో లేవని చెప్పాట్ట. తర్వాత కాస్సేపటికి ప్రాణం పోనేపోయింది"

ఆయన చెబుతున్న ప్రతిమాట ప్రకాశానికి తన గుండెల్లో పెట్రోలుపోసి అగ్గిపుల్ల గీసినట్లుగావుంది.ఆ బాధని భరించటం తన శక్తికి మించిన పనిలా అనిపించింది. వెక్కి వెక్కి ఏడ్వనారంభించేడు.

ఆయన కాస్సేపు ఏడుస్తున్న అతనిని ఓదార్చే ప్రయత్నం చెయ్యలేదు. మనస్సులోని బాధని కడిగేసేవి కన్నీళ్ళని ఆయనకితెలుసు.కాస్సేపాగిమొదలెట్టాడు-

"వూరుకోవోయ్! ఏంచేస్తాం చెప్పు. మన చేతుల్లో వుందా ఏవిటి? అంతా ఏదో ఒకనాడు పోవాల్సినవాళ్లమే .... వెనకా ముందూ...అంతే!" ఇలాంటి వేదాంతం పలుకులు ఆయన చెబుతుండగా, గడప కవతలగా నిల్చుని అంతా చూస్తున్న ఆయన భార్యేమో, "ఎన్ని చెబితే అతడి బాధని తీసెయ్యగలం. వాళ్ళ స్నేహం అలాంటిది" అంది.

ప్రకాశం అక్కణ్నించి లేచేడు. కళ్ళు ఎర్రబడ్డాయి. కన్నీళ్ళు కారుతూనే వున్నాయ్. ఇప్పటివరకు జరిగిందంతా ఒక్కసారి కల అయితే ఎంత బాగుండు. తను వులిక్కిపడి లేచి చూసి అంతా అబద్ధం అనిపిస్తే ఎంత బాగుండు.

కాని అతడికి తెలుసు...అది కలకాదు-నిజం...నిజం....పచ్చి నిజం.

ఇంటికెలా చేరేడో అతడికే తెలీదు. వచ్చీరాగానే పెద్దగా ఏడుస్తూ అక్కడున్న మంచంపై వాలిపోయాడు.

అతడి ఏడుపు చూడగానే వంటగదిలోవున్న కామాక్షమ్మగారు వులిక్కిపడింది. పోయిన కొడుకుని తల్చుకుని ఏడుస్తున్న వసుంధర ఏడుపు మానేసి తమ్ముడి వంక భయంగా చూసింది.

"ఏమైందిరా ప్రకాశం....ఏవిట్రా?" కామాక్షమ్మగారు హడలుకుంటూ వచ్చి కొడుకు పక్కనే కూలబడుతూ అడిగింది.

ప్రకాశం పొర్లుకొస్తున్న ఏడుపుని దిగమింగుకుంటూ "అమ్మా...మార్కండేయులు చనిపోయాడే" చెప్పాడు.

"అయ్యయ్యో..ఎప్పుడ్రా నాయనా?" అందావిడ భయంగా.

"ఇరవై రోజులైందిట"

అంతలో వసుంధర అర్థంకాక, "మార్కండేయులెవరే?" అనడిగింది.

"ప్రకాశం స్నేహితుడులే" అని కొడుకుతో, "వూరుకో నాయనా...వాడి పిచ్చి సన్నాసి. దేనికీ తట్టుకోలేడు" అంది అతడి జుట్టుని నిమురుస్తూ.

కాస్సేపటికి ఆవిడ వంటగదిలోకి వెళ్ళింది. వసుంధర తన మంచంపైన పడుకుంది.

కాస్సేపటికి ప్రకాశం కళ్లు తుడుచుకుని లేచి కూర్చున్నాడు.

నెమ్మదిగా రోడ్డు పైకి వచ్చాడు. కాసేపు వీధుల వెంట పిచ్చివాడిలా తిరిగేడు. పిచ్చిపిచ్చిగా తిరిగేడు. ఆ పూట అన్నం తిన్లేదు. తల్లి అన్ని విధాల చెప్పినా తినబుద్ధి కాలేదు. అలాగే నీరసంగా పడున్నాడు.

సాయంత్రం అయింది.

లేచి డ్యూటీకి వెళ్ళేడు. కనీసం అక్కడున్నా మనశ్శాంతి లభిస్తుందన్న

ఆశతో వెళ్లేడు. వెళ్ళటం అయితే వెళ్ళాడుగాని పనిమీద ధ్యాస లేదు. అలాగే కూర్చుండిపోవాలనిపిస్తోంది.

అతడి పరిస్థితిని గమనించిన ఒకే ఒక వ్యక్తి నగేష్ - "ఏవిటలా వున్నావ్? ఆరోగ్యం బాగాలేదా?" అనడిగాడు.

తన బాధని అడిగినవాళ్ళకి, అడగని వాళ్ళకి చెప్పి తగ్గించుకోవాలన్న తపన...

"నా క్లాస్‌మేట్ మార్కండేయులని... నా బెస్ట్ ఫ్రెండ్ పోయాట్ట"

"సారీ...అలాగా. నిన్ను చూడగానే అనుకున్నాను ఏదో జరిగిందని. పోనీ సెలవు పుచ్చుకోలేకపోయావా?" అన్నాడు.

ప్రకాశం బదులివ్వలేదు.

బార్‌లోకి జనం మెల్లిమెల్లిగా జట్లు జట్లుగా వస్తున్నారు. సందడి పెరుగు తోంది. నగేష్ అన్నాడు..."సరే - ఒక పన్చేయి. ఇవ్వాళ్టికి నీ డ్యూటీ కూడా నేచేస్తాగాని, నువ్వెళ్ళి ఆ కౌంటర్లో



"కూర్చో" అంటూ చెయ్యిపట్టి లేపాడు.

ప్రకాశం అలాగే వెళ్ళి కౌంటర్లో కూర్చున్నాడు.

సందడి బాగా పెరిగి గందరగోళంగా, గొడవగావుంది. బేరర్లు హడావుడిగా అటు ఇటు పరిగెత్తుతున్నారు.

ప్రకాశం తలని రెండు చేతులతో పట్టుకుకూర్చున్నాడు. తలంతా బరువుగా, భారంగా వున్నట్లనిపించింది. అసలు ఇంటికే వెళ్ళి విశ్రాంతి తీసుకోవటం మంచిదేమోనని అనుకుంటుండగా ఒక బేరరు ఒక గ్లాసు తెచ్చి ప్రకాశం ముందు వుంచేడు. దాన్నిండా నిమ్మరసం రంగులో ద్రవం...

ప్రకాశం ఆశ్చర్యంగా ఆ గ్లాసు వంక, తెచ్చిన బేరరు వంక మార్చిమార్చి చూసి "ఏవిటిది?" అనడిగాడు.

"నగేష్ సాబ్ మీకిమ్మన్నారు. నిమ్మకాయ నీళ్ళట" అన్నాడా వ్యక్తి. అనేసి ఎందుకో సన్నగా నవ్వేడు.

ప్రకాశానికి ఆలోచించే ఓపికలేక ఆ గ్లాసునెత్తి రెండు గుటకలు వెంట వెంటనే తాగేడు. కాస్త చేదుగా, వెగటుగా అన్పించినా, అదేవిటో బావుంది కూడా అన్పించింది. గ్లాసెత్తి మరో గుటక వేసాడు.

రాత్రి తొమ్మిది దాటితే వచ్చేవాళ్ళ సంఖ్య తగ్గిపోయి, బిల్లు చేసి వెళ్ళే వారి సంఖ్య ఎక్కువగా వుంటుంది. అందుచేత గొడవ, గోల తగ్గాలంటే తొమ్మిది దాటాలి.

అప్పుడు తొమ్మిదిన్నరయింది. వాతావరణం సద్దుమణిగి కాస్త వూపిరి పీల్చుకునేలా వుంది. నగేష్ బిల్లు రాస్తూనే ఓ కంట ప్రకాశాన్ని గమనిస్తున్నాడు.

అతణ్ణి ఆరోజు చూడగానే ఎంతగా బాధపడుతున్నాడో నగేష్‌కిట్టే అర్థమైంది. అందుకే బేరర్ని పిల్చి జిన్ ఒక పెగ్గు లిమ్కాలో కలిపి ఇమ్మని చెప్పాడు. అతనుద్దేశం ప్రకాశానికి తాగుడు అలవాటుచెయ్యాలని కాదు. ఆ బాధలోంచి తాత్కాలికమే అయినా, వుపశాంతినివ్వాలని మాత్రమే.

ప్రకాశం గ్లాసుని ఖాళీ చేసేడు.

విచిత్రంగా ఇందాకటికన్నా ఏదో శక్తి వచ్చినట్లు, నరాల్లో బలం వచ్చినట్లు అన్పించింది. తాగిన ఆ నిమ్మరసం, నిమ్మకు నీరెత్తినట్లు అలాగే కూర్చుని ఇంకో గ్లాసు తాగితే ఎలా వుంటుందన్న ఆలోచనవరకు తీసుకెళ్ళింది.

"ఇంకో గ్లాసు నిమ్మరసం పట్రా" అన్నాడు బేరర్ని పిల్చి.

ఆ బేరరు విచిత్రంగా చూస్తూ – "నగేష్‌సాబ్... ఇంకో గ్లాసు కావాలట" అన్నాడు.

నగేష్ లేచి ప్రకాశం దగ్గరగావచ్చేడు.

"ప్రకాశం ... ఎ లా వుం ది?" అనడిగాడు.

"ఏమిటెలా వుంది? ఆ నిమ్మరసమా.. చాలా బావుంది. అందుకే ఇంకో గ్లాసు తెమ్మన్నాను...అంతే!"

నగేష్ ప్రకాశాన్ని పరిశీలనగా రెండు క్షణాలు చూసి, బేరర్‌తో రహస్యంగా 'స్మాల్ పెగ్' అన్నాడు.

ఆ బేరర్ నవ్వుతూ తలూపి పక్కకి వెళ్ళాడు.

* * *

ఆ రాత్రికి ఇంటికి చేరటానికి పది అయింది. కాళ్ళు తేలిపోతున్నాయి. కళ్ళు వాలిపోతున్నాయి. క్షణక్షణానికి మత్తు ఎక్కువైపోతున్నట్లుగా వుంది. ఉదయం నించి ఏం తినకపోవటంచేత కడుపులో

మంటగా వున్నట్లనిపించింది. ఎక్కడైనా హాయిగా పడుకుందామనిపిస్తోంది. తనలో తానుగా పెద్దగా వాగెయ్యాలనిపిస్తోంది.

సుబ్రమణ్యంగారు భోజనం పూర్తిచేసి వాలుకుర్చీలో కూర్చున్నారు. ఆయనకి కాస్తంత దూరంలో భార్య, కూతురు కూర్చున్నారు. ఆయన గీతా సారాంశాన్ని కూతురికి వివరంగా చెబుతున్నారు... కూతురికి బాధనించి ఉపశమనానికి అది ఒక్కటే మార్గం అనాయన అభిప్రాయం.

"అంచేత మనిషి పోయాడని బాధ పడటం అనవసరం. ఎక్కణ్నుంచి వచ్చాడు..ఎక్కడికి పోయాడు...ఏమో.. అన్నీ నేనే అన్నాడు శ్రీకృష్ణుడు. పుట్టించేది నేనే - చంపేది నేనే అని కూడా అన్నాడు. జీవితం రైలు ప్రయాణం లాంటిది. ఎవరి స్టేషను వచ్చినపుడు వాళ్ళు దిగిపోతారు. రైలు మాత్రం పోతూనే వుంటుంది''

సరిగ్గా అదే సమయానికి ప్రకాశం లోపలికొచ్చాడు. ఓపిక లేనట్టు వాళ్ల పక్కనే చతికిలపడ్డాడు.. అసలా విధంగా చొరవగా కూర్చున్నప్పుడే తండ్రికి అనుమానం వేసింది. సహజంగా ప్రకాశం అలా చెయ్యడు.

కాని అది గుర్తించని కామాక్షమ్మగారు, "నిజమే...కాకపోతే పాపం ఆ మార్కండేయులు నిక్షేపంలాంటి పిల్లాడు. పోవటమేమిటి చెప్పండి" అంది.

ఆ మాట విని ప్రకాశం ఆవేశంగా అన్నాడు,"వాడుపోలేదమ్మా! ఇక్కడ... ఇక్కడే వున్నాడు" అన్నాడు గుండెల పైన చేత్తో కొట్టుకుంటూ.

అదిగో సరిగ్గా అప్పుడే ఆయనకి అనుమానం మరింత బలపడింది.

"ఏమిట్రా ... ఏమిటా వాలకం?" అన్నారు కొడుకునుద్దేశించి.

"ఏవుంది ... ఏమీలేదు. మార్కండేయులు పోలేదు. మధుగాడూ పోలేదు. అంతా వొట్టిది. వాళ్ళిద్దరూ బతికే వున్నారు. కళ్లకి కనిపించరు...అంతే!" అన్నాడు.

కామాక్షమ్మగారు కొడుకు వాలకాన్ని చూసి విస్తుపోయి, ఆపైన భర్త వంక చూసింది భయంగా. సుబ్రమణ్యంగారికి మాత్రం నిర్ధారణయిపోయింది .... అనుకున్నంతా అయింది.

"ఏమిట్రా ప్రకాశం ... ఏమిటలా వున్నావ్...ఎక్కణ్నుంచి రాక?" అంది తల్లి.

ప్రకాశం జవాబిచ్చేలోపునే సుబ్రమణ్యంగారు, "ఇంకెక్కణ్నుంచి ... ఉద్యోగంనించి. సుబ్బరంగా పట్టించి మరీ వచ్చాడు" అన్నారు.

కామాక్షమ్మగారికి భయం వేసింది. కొడుకువంక పరీక్షగా చూసింది.అవును.. అతడు రోజూలా లేడు. ఏదో ఆవేశంలో వున్నాడు. అందరి వంక కళ్లార్పకుండా చూస్తున్నాడు.

"అన్నం తింటావా?"అందావిడమళ్లీ.

"లేసుకెళ్లి పడుకోబెట్టు. ఇహ ప్రతి రోజూ ఇంతేనే. వాడు రాగానే మంచం వేసి పడుకోబెడుతుండు. ఎంత ధైర్యం లేకపోతే తాగి...''

"ఛ ఛ...నే తాగలేదమ్మా.... రెండు గ్లాసులు నిమ్మరసం తాగానంతే. నీ మీద ఒట్టు" అమాయకంగా అన్నాడు.

దాంతో సుబ్రమణ్యంగారికి కోపం చుర్రుమంది.

"సిగ్గులేదూ ... అబద్ధాలాడటానికి. ఆనాడు నేను ఇలా జరుగుతుంది ఆ వెధవ వుద్యోగం మానెయ్యమంటే.. పెద్ద లెక్చర్లు

దంచేడు. బార్స్‌లో పన్చేసేవాళ్లు తాగుబోతులు, దేవాలయంలో వుండేవాళ్లంతా పుణ్యాత్ములానివాగేడు...ఇపుడేమైంది?"

"అది కాదండీ... వాడలాంటివాడు కాదు. ఆ నిమ్మరసం తాగటంచేత పైత్యం ప్రకోపించి...''

"ఛ... ఎందుకే అలా అన్చెప్పి సమాధానపర్చుకుంటే ఏవిటి లాభం? వాడు తెచ్చే ఆ రెండొందలకి ఆశపడ్డావ్ గాని... ఎలా తగులబడిపోతాడో అర్థంకాలేదు"

"ఛ..వూరుకోండి.చిన్న వెధవ..ఏదో తెలీక బాధకొద్దీ చేసుంటాడు. ప్రకాశం అలాంటివాడు కాదు. ఆ నమ్మకం నాకుంది"

"ఏవైనాచావండి. ఇద్దరూ కట్టకట్టుకుని గంగలో దూకండి. నాకెందుకొచ్చింది'' అన్నారాయన.

మొగుడితో మాట్లాడి తలతిప్పి చూస్తే ప్రకాశం అక్కడ లేడు.

అప్పటికే లోపలికివెళ్ళి పడుకున్నాడు.

* * *

ఆ రాత్రి ప్రకాశం ఆదమరచి నిద్రపోయాడు. ఆ నిద్రలో ఏవేవో కలలు. మార్కండేయులు నవ్వుతూ కనిపించేడు. ''రేయ్ ప్రకాశం! నా గురించి ఎందుకురా బాధపడతావ్. అయినా ఫూల్, నేనెక్కడికి పోయాన్రా? నీతోనే వుంటాను. నీకేం భయం లేదు...సరేనా"

మళ్ళీ కాస్సేపు మధుగాడు వచ్చీరాని మాటలతో 'పెకాశం' అంటూ పిల్చినట్టు, వాళ్ళిద్దర్నీ వెతుక్కుంటూ ఎక్కడికెక్కడికో, ఏవేవో లోకాల్లో విహరిస్తున్నట్లు ...

నిద్ర లేచేసరికి ఎనిమిదియింది.

ఇంట్లో అందరూ తను లేవటం కోసం ఎదురుచూస్తున్నట్లు తలోవైపు కూర్చుని ఉన్నారు.

రాత్రి జరిగిన విషయాలు లీలగా గుర్తుకొస్తున్నాయ్.

ముందర గదిలో తల్లి తండ్రి ఏదో విషయం గురించి ఘర్షణ పడుతున్నారు. ప్రకాశం మొహం కడిగి లోనికొచ్చే సరికి, వసుంధర కాఫీ గ్లాసునందించింది. తమ్ముడి వంక విచిత్రంగా, ఆశ్చర్యంగా చూసింది.

ప్రకాశం ఆమె చూపుల్నుంచి తప్పుకోటానికన్నట్టు కాఫీ గ్లాసుతో మధ్య గదిలోకొచ్చేడు. అపుడు విన్పించాయి మాటలు-

''ఇక వాడా ఉద్యోగం చెయ్యటం ఎంతమాత్రం మంచిది కాదు. మనసు పాడైనప్పుడల్లా మందు బిగిస్తే ఏమవుతాడో ఆలోచించు'' అంటున్నాడు తండ్రి.

"చిన్నతనం. వాడికి తెలీదు. నేను చెబుతానుగా....మీరెళ్ళండి" అంటోంది తల్లి.

"ఏం చిన్నతనం ... పెళ్ళిచేసుంటే ఇద్దరు పిల్లలు పుట్టుండేవాళ్ళు. అయినా ఏం చెబుతావో నీ ఇష్టం. వాడు మాత్రం అక్కడ పన్చెయ్యడం కుదర్దు. కాదంటే వెళ్ళమను. వెళ్ళి వొంటరిగా బతకమను. నాకేం అభ్యంతరం లేదు"

తర్వాత తండ్రి బయటకెళ్ళిపోయినట్టు చెప్పుల శబ్దం.

ప్రకాశం అంతా విన్నాడు. కాస్సేపటికి కామాక్షమ్మగారు లోనికొచ్చింది.

కాఫీ తాగుతున్న కొడుకు వంక పరిశీలనగా చూసింది. ఆపైన మెల్లిగా,

"అదికాదురా! రాత్రి..." అని ఏదో అడగబోయింది.

ప్రకాశం మధ్యలోనే అందుకున్నాడు.

''అంతా విన్నానమ్మా! సరే..అక్కడ ఉద్యోగం చేస్తేనే పాడైపోతానని కమా

ఆయనంటున్నారు. అలాగే మానేస్తా. కాని ఒక విషయం - పాడైపోవాలనుకున్న వాడిని ఎవ్వరూ ఆపలేరు. దేశంలో తాగే వాళ్ళందరూ అక్కడ పస్పే సేవాళ్ళే కాదు''

''అంటే ... ఇంకా ముందుకూడా తాగుతానంటున్నావా?''

"అది కాదు నా వుద్దేశం. అసలు రాత్రి నేతాగనేలేదు. నిమ్మరసం అన్చెప్పి అక్కడివాళ్ళిచ్చారు....తాగేను. పాపం, పుణ్యం వాళ్ళకే తెలియాలి''

కామాక్షమ్మగారు నొచ్చుకుంటున్నట్లుగా అంది-

''ఏమో నాయనా...ఏం చెప్పినా నీ మంచికే చెబుతాం. నువ్వూ పెద్ద పిల్లవాడి వయ్యావ్. ఇహ నీ ఇష్టం'' అనేసి లోనికెళ్ళిపోయింది.

ప్రకాశం అప్పుడే ఒక నిర్ణయానికి వచ్చేడు.

ఆ సాయంత్రం కాస్త ముందుగానే యూనివర్సల్ బార్కెళ్ళాడు. నగేష్ అప్పుడే వచ్చాడు. ప్రకాశాన్ని చూడగానే నవ్వుతూ, ''ఎలా వుంది రాత్రి...బాగా నిద్రపట్టిందా?'' అనడిగాడు.

ప్రకాశం కాస్త సీరియస్గానే,''నిన్ను మంచి స్నేహితుడిగా నమ్మేను. కాని రాత్రి నన్ను మభ్యపెట్టి తాగించావ్''

"ఏమైంది...గొడవగాని చేసేవా?''

''నేనేం గొడవ చెయ్యలేదు ... కాని ఇంట్లోవాళ్ళు పసిగట్టి నానా మాటలూ అన్నారు. తప్పు చేసినట్లు తలొంచుకు నిలబడాల్సొచ్చింది''

''సారీ ప్రకాశం! నీ మనస్సు బాగో లేదంటే నేనే పొరపగా కాస్త కలిపి ఇమ్మని చెప్పాను. క్షమించు''

''ఫర్వాలేదు నగేష్...కాని నాకంతా విచిత్రంగా అన్పిస్తోంది. జీవితం ఎటు పోతోందో, ఇన్ని మలుపులెందుకు తిరుగు తోందో అర్ధంకాకుండా వుంది. అనుకోకుండా ఇక్కడ పన్లోచేరటం, మీ అందరి పరిచయం, మా ఫ్రెండ్ పోవటం, నే తెలీకుండా తాగటం, అవి ఇంట్లో పసి గట్టడం, ఫలితంగా ఉద్యోగం మానెయ్యాల్సిరావటం..."

"ఏవిటీ..వుద్యోగం మానేస్తున్నావా?''

"అవును ... అలాగని మా అమ్మకి మాటిచ్చేను"

నగేష్కి గుండెల్లో బాధ కలుక్కు మంది.

''ప్రకాశం! కావాలంటే నేవచ్చి మీ నాన్నగారికి జరిగింది చెప్పి క్షమాపణలు కోరుకుంటాను. కాని వుద్యోగం మానకు" ప్రాధేయపడుతున్నట్లుగా అన్నాడు.

"నిజానికి నే మానకపోయినా వాళ్ళేం చెయ్యలేరు. కాని వాళ్ళ పోషణలో, పాలనలో వున్నంతకాలం వాళ్ళు చెప్పినట్లు వినటం నైతికబాధ్యత... కాదంటావా"

నగేష్ బదులివ్వలేదు.

"కొండరావుగారొస్తే చెప్పు...గుడ్ బై" అంటూ చెయ్యినందుకుని మృదువుగా నొక్కి వెనక్కు తిరిగాడు.

నగేష్ కాసేపు గిల్టీగా అతడెళ్ళిన వైపేచూసి బరువుగా నిట్టూర్పు వదిలేడు.

అక్కడుద్యోగం మానేక కాలం గడపటం మరీ కష్టమనిపించింది. వెంటాడే ఆలోచనల్లు కుదురుగా ఒకచోట నిలో నివ్వేవికావు. రెండుమూడ్రోజులకి కాలేజీ కెళ్ళి మార్కులలిస్టు తెచ్చుకున్నాడు.

తనతో పాసయినవాళ్ళంతా పైచదువు లకి అప్లైచేస్తుంటే అతడు మాత్రం ఆ మార్కులకాగితాలు పుచ్చుకుని ఎంప్లాయి మెంటు ఆఫీసుకెళ్ళాడు.

చతుర ... 53

అది అయిదారు గదుల పాత భవనం. ముందు విశాలమైన ఆవరణ. వరండాలో చెక్కబల్లలు, గదులకి నీలంరంగు కర్టెన్లు.

ప్రకాశం లోనికడుగు పెట్టేసరికి కొన్ని వందలమంది కుర్రాళ్ళు అక్కడున్న కిటికీపక్కన పెద్ద లైనుగా నిల్చున్నారు. వాళ్ళందరి చేతుల్లోను ఫైళ్లు, వాళ్ళలో ఏదో అర్థంకాని ఆశ.

ప్రకాశం వాళ్ళందర్నీ చూసేక నీళ్ళు కారిపోయేడు. వాళ్ళలో కొంతమంది చెప్పారు – తాము తెల్లవారకముందునించి అక్కడ నిల్చునట్టు. అది విని మరింతగా నిరుత్సాహపడి, భయపడ్డాడు.

తిరిగి వెళ్ళిపోదాం అనుకుంటుండగా ఆ బోర్డు కన్పించింది. "పర్వతాలరావు, ఎంప్లాయిమెంటు ఆఫీసరు" అని.

కాస్తలోకాస్త మళ్ళీ ఆశ. అందులో కొండల్రావు, నగేష్ ఆఫీసర్ని చాలా మంచివాడుగాను, వుదారబుద్ధి గలవాడుగాను చెప్పిన మాటలు గుర్తుకొచ్చి మరింత ఆశని కల్పించాయి.

ఒకసారి పర్వతాల్రావుని కల్సుకోవటం చాలా మంచిదనిపించి అతడి రూమువైపుగా వెళ్ళేడు.

అక్కడ గది బయట స్టూలుపై నెమ్మదిగా బీడీతాగుతున్న బిళ్ళబంట్రోతు ప్రకాశం వంక ఏం కావాలన్నట్టుగా చూసేడు.

"పర్వతాల్రావుగార్ని కలవాలి"

"ఏమిటిపని?"

ప్రకాశం ఏం చెప్పాలాని రెండు క్షణాలు ఆలోచించి 'పర్సనల్' అన్నాడు.

"మీ పేరు, పని, కాగితంపైన రాసివ్వండి... తీసికెళ్ళిస్తాను" అన్నాడు.

ప్రభుత్వ కార్యాలయాల్లో తనలాంటి సామాన్యుడికి ఆమాత్రం మర్యాద లభించటం గొప్ప విశేషమేననుకుంటూ, చిన్న కాగితాన్ని జేబులోంచి తీసి, దాని పైన "ప్రకాశరావు–ఫ్రమ్ యూనివర్సల్ బార్ అండ్ రెస్టారెంటు" అని ఇంగ్లీషులో రాసి అతడి చేతికిచ్చేడు.

ఆ కాగితం పట్టుకుని అతడు లోనికెళ్ళి, అయిదు నిముషాలకి తిరిగొచ్చి 'వెళ్ళండి' అంటూ కర్టెన్ని పక్కకి తొలగించి పట్టుకున్నాడు.

ప్రకాశం లోనికెళ్ళాడు. విష్ చెయ్యబోయి ఆగిపోయాడు.

పర్వతాల్రావు మొహం కందగడ్డలా వుంది. కళ్ళు ఎర్రగా మండుతున్నాయి.

తాను రాసిన కాగితం ముక్కని అలానే పట్టుకుని – "ఇలా రాసి పంపించటంలో నీ వుద్దేశమేమిటి?" అని అడిగాడు కోపంతో బుసలుకొడుతూ.

"నేనెవరో వెంటనే గుర్తుకొస్తుందన్న వుద్దేశంతో..."

"అంటే అక్కడ పన్చెయ్యటంచేత గొప్పవాడిననుకుంటున్నావా? ఈ కాగితం ముక్క ఇంకెవరి చేతిలోనైనా పడితే నా పరువేం కాను? నా వీక్‌నెస్‌ని ఎత్తి చూపించి పన్లుచేయించుకుందామనా?" రెచ్చిపోతున్నాడు ఆఫీసరు పర్వతాల్రావు.

"తప్పయితే క్షమించండి. నేనలా ఆలోచించలేదు"

"అవును ఆలోచించరు. అసలే రోజులు ఏం బాగాలేవు. ఇంకెప్పుడూ పిచ్చి పిచ్చి రాతలు రాయమాకు" అనేసి విసుగ్గా అక్కడున్న ఫైలుని ముందుకు లాక్కున్నాడు.

ప్రకాశానికి పౌరుషం ముంచుకొచ్చింది.

అతగాడు నిత్యం పబ్లిగ్గా తాగితే లేని తప్పు, కాగితంపై తను ఆ చిన్న వాక్యం

రాస్తే ఎక్కణ్నుంచి వచ్చిందో అర్థం కాలేదు.

తిరిగి వెళ్ళబోయాడు.

"ఆగు" అని ఆతడనటంతో వెనక్కి తిరిగి చూసేడు.

"ఇక్కడికి రావటం, వెళ్లిపోవటం అంతా నీ ఇష్టమేనా?"

"అంటే వెళ్ళటానిక్కూడా పర్మిషన్ కావాలా?" అతడి మాటలో ఇందాక లేని నిర్లక్ష్యం ధ్వనించింది.

అది గ్రహించి పర్వతాల్రావు చిన్నగా నవ్వాడు. "ఇలావచ్చి కూర్చో" అన్నాడు.

ప్రకాశం వెళ్లి అక్కడున్న కుర్చీలో కూర్చున్నాడు.

"అసలింతకీ ఏం పనిమీదొచ్చావ్?"

అతడి వాలకం చూసి మాట విన్నాక ప్రకాశానికి చెప్పాలన్న వుత్సాహం సన్నగిల్లింది. "ఇంకనవసరం. నేవచ్చిన పని కాదని తెల్సిపోయింది"

పర్వతాల్రావు మళ్లీ సన్నగా నవ్వి బజర్ నొక్కాడు. ప్యూన్ వచ్చాక రెండు టీలు తెమ్మని చెప్పి-

"అఫ్‌కోర్స్..నువ్వేం పనిమీదొచ్చావో ఊహించగలను. బయట చూసేవుగా ... ఎన్ని వందలమంది పడిగాపులు కాస్తున్నారో? ఇంకా రిజిష్టర్సులో కొన్ని లక్షల మందున్నారు. అదీ పరిస్థితి. అయినా నీకుద్యోగం వుందిగా?"

"అదీ మానేశాను"

"ఎందువల్ల?"

"కొన్ని వ్యక్తిగత కారణాలవల్ల"

అంతలో ప్యూన్ టీ తెచ్చి చెరొక కప్పుని అందించేడు.

"ప్రస్తుతం నీకు నేను సహాయం చేసే స్థితిలో లేను. అసలు వేకెన్సీలే లేవు. ఒకటీ అరా వున్నా సీనియారిటీ ప్రకారం పంపమని ఆర్డర్స్. అంచేత సారీ ... ఎక్కడైనా ప్రవేటుగా చూసుకోవటం మంచిది"

ప్రకాశం రెండు గుక్కల్లో టీని తాగేసి, లేచి నిల్చున్నాడు.

"హైదరాబాద్‌లో నా ఫ్రెండ్ ఈమధ్యనే కంపెనీ ఒకటి పర్చేజ్ చేసేడు. అక్కడేవైనా వున్నాయేమో చూద్దాం" అని ముందున్న ఫైలుని పరిశీలించటం మొదలుపెట్టేడు.

ప్రకాశం విష్ చేసి బయటి కొచ్చేశాడు.

ఆ మర్నాడు మధ్యాహ్నం పర్వతాల్రావు ఆఫీసుకి వెళ్ళేసరికి, రికమండేషన్ లెటరు రాసి రెడీగా వుంచాడు. అది ప్రకాశానికిస్తూ- "ఫోన్లో దొరకటంలేదని వుత్తరం రాశాను. అన్ని విషయాలు విపులంగా రాశాను. వాడు నా మాట కాదనడు. అంచేత నువ్వు వెంటనే హైదరాబాదెళ్ళి అతణ్ని కలు. తప్పకుండా పనవుతుంది ... గుడ్‌లక్" అంటూ చెయ్యందించాడు.

ప్రకాశం ఇంటిదారి పట్టాడు.

* * *

పర్వతాల్రావు సిఫార్సు వుత్తరమైతే ఇచ్చాడుగాని, వెళ్ళటానికి చార్జీలెవరిస్తారు? ఇంటి పరిస్థితి మామూలే. అయినా తల్లికి చెప్పాడు. విని ఆవిడ బాధపడింది. అమ్మటానికి, తాకట్టుపెట్టటానికి కూడా విలువైనవి ఏమీలేవు. అంచేత ఆవిడ బాధపడటం తప్పించి ఏమీ చెయ్యలేకపోయింది.

ఏం చెయ్యాలో తెలీక ప్రకాశం తెగ పచార్లు చేస్తుండగా, అక్కయ్య వసుంధర అతణ్ని పిల్చి, రహస్యంగా "నా దగ్గరొక నూరురూపాయలున్నాయ్. కావాలంటే తీసుకో అమ్మక్కూడా

చెప్పలేదు, అడుగుతుందని. అంతగా అయితే వెళ్ళేటప్పుడిద్దువుగాని" అంది.

అంతకన్నా గత్యంతరం లేకపోవటం చేత అక్కగారి వద్ద చాటుగా పుచ్చుకుని ఆ రాత్రికే రాజధాని బస్సెక్కాడు.

తీరా వెళ్ళబోయే ముందు - ఇంకో సమస్య ఎదురైంది - అక్కడికెళ్ళి ఎక్కడుండాలి అని. మళ్ళీ చర్చలు, తర్జన భర్జనలు— చివరికి కామాక్షమ్మగారు గుర్తుచేసుకు చెప్పింది.

"అన్నట్టు... అక్కడ మా పింతల్లి కొడుకున్నాడ్రా. వెళ్ళి ఫలానా అన్చెప్పు. నెత్తిన పెట్టుకుంటాడు" అంది.

ప్రకాశాని కనిపించింది... 'నెత్తిన పెట్టుకోనక్కర్లేదు. బయటకు నెట్టెయ్యకుండా ఇంటి వసారాలోనైనా వుండనిస్తే చాలు' అని.

కామాక్షమ్మగారు పాత ఉత్తరాలన్నీ వెతికి, ఆర్నెల్లక్రితం అతడు ఒక్కగానొక్క కూతురి పెళ్ళికి పంపిన శుభలేఖని కొడుకు చేతిలో వుంచింది.

ప్రకాశం పదిలంగా అడ్రసుని రాసుకునికొండంత ఆశతో బస్సెక్కాడు.

* * *

రాజధాని నగరంలో దిగేసరికి తెల వారింది. కాస్సేపు అక్కడే నిల్చుని వింతగా చూశాడు.

అడ్రసు కాగితాన్ని బయటికి తీసి చూసేడు. కె. భానుమూర్తి, హిమాయత్ నగర్, బస్సుస్టాపు పక్కన. ఇంటి నెంబరు కూడా వేసుంది.

రిక్షా పిలిచాడు.

బస్సుల మధ్యనించి, ఆటోలతో పోటీ పడి, సైకిలిస్టులని ఓడిస్తూ బాణంలా, ఊపిరి పరిగెత్తిస్తున్నాడు రిక్షావాలా.

ప్రాణాలు గుప్పిట్లో పెట్టుకూర్చున్నాడు ప్రకాశం.

అయితే అయిదు నిమిషాల్లో హిమాయత్ నగర్ సెంటర్లో దింపేడు. బతుకుజీవుడాని,నాల్రూపాయలువాడికి ఇచ్చి, అడ్రస్సు కాగితాన్ని పుచ్చుకుని నడక ప్రారంభించేడు.

అతికష్టంమ్మీద ఇల్లు దొరికింది.

అది రెండంతస్తుల పాత కొంప. ఉండటం రోడ్డుపైకే వుందిగాని, మెట్లు మాత్రం కాస్త సందులోపలగా వున్నాయి. పైన నాలుగు, కింద నాలుగు పోర్షన్స్ ఆసుపత్రి గదుల్లాగా వరుసగా వున్నాయి. గాలి, వెలుతురు ఏమాత్రం కన్పించలేదు. ఇంట్లోకెళ్ళి తలుపు గడియపెడితే, పాత కాలం భోషాణంలో కూర్చుని మూత పెట్టుకున్నట్లుగా వుంటుందేమో!

ప్రకాశం నెంబరు సరిచూసుకుని, ఒక పోర్షన్ తలుపు తట్టేడు.

యాభైలో పడుతున్న ఒక వ్యక్తి వచ్చి తలుపు తీసేడు.

"ఎవరు కావాలండీ?" అనడిగాడు సౌమ్యంగా.

"భానుమూర్తిగారంటే మీరేనా?"

"అవును... మీరెవరు?"

"నా పేరు ప్రకాశరావు. కామాక్షమ్మ గారబ్బాయిని"

"ఏ కామాక్షమ్మ?"

"వెంకటగిరి నర్సయ్యగారి రెండో అమ్మాయి" ప్రకాశం పెద్దల పేర్లన్నీ బట్టీపట్టే వచ్చాడు. ఒకవేళ తను 'ఏ నర్సయ్య' అనడిగితే నర్సయ్యగారి తండ్రి, తాతల పేర్లు తయారుగా వుంచుకున్నాడు. కాని అదృష్టం కొద్దీ అతడలా అడగలేదు. ఇక గుర్తుపట్టకపోతే బావుండదన్నట్టుగా...

"ఆ కామాక్షమ్మ కొడుకువా...లోపలికి

రా" అంటూ తలుపు పూర్తిగా తెరిచేడు ప్రకాశం లోపలికెళ్ళి సంచి పక్కనపెట్టి, కుర్చీలో కూర్చున్నాడు.

"అంతా బావున్నారా?" అనడిగి ఆ, ప్రశ్నకి సమాధానం ఆశించనివాడిలా లోపలి గదిలోకి వుద్దేశించి "వరాలూ... వరాలూ" అంటూ పిల్చేడు కాస్త పెద్దగా.

తల్లి అతడి పెళ్ళాం పేరు వరలక్ష్మి అని తెలిపి ఉండకపోతే ఆ పిలుపు విని ప్రకాశం పనిమనిషినో, ప్రియురాలినో పిలుస్తున్నాడేమో అనుకునుండేవాడు.

ఆ పిలుపునందుకుని పిడిరాయిలా వున్న నలభై ఏళ్ళ ఆడమనిషి గదిలో కొచ్చింది. వస్తూనే, "ఏవిటా కేకలు..అర్థం పర్థం లేకుండా" అని విసుక్కుంది.

తర్వాత ప్రకాశాన్ని, పక్కనున్న సంచినిచూసి పరిస్థితినాకళింపు చేసుకుంది.

అంతలో భానుమూర్తి అన్నాడు.

"ఇతడు కామాక్షమ్మ కొడుకు"

"ఏ కామాక్షమ్మ?"



"అదే .... వెంకటగిరి నర్సయ్యగారి అమ్మాయి"

"నర్సయ్యగారెవరు?"

"అదేనోయ్... అచ్యుతవల్లి అక్క కొడుకు"

"అచ్యుతవల్లా...ఆవిడెవరండీ బాబు? సరే...ఇంతకీ ఏవిటి?"

"అబ్బే... ఏంలేదు. పూరికినే చెబుదామని" నీళ్ళు నమిలాడు.

"సర్లెండి...బెడ్ కాఫీ పెట్టమంటే బంధుత్వాలు తిరగేస్తున్నారా" అని విసవిసా వెళ్ళిపోయింది.

ప్రకాశానికి ఆ ఇంట్లో భానుమూర్తిగారి పరిస్థితేమిటో అర్థమైపోయింది.

బావుండదని ఆయనే మళ్ళీ అడిగాడు, "ఏవిటీ....పనిమీదొచ్చావా?"

"ఇక్కడ వుద్యోగ ప్రయత్నాలు చేసుకుందామని" నసిగాడు.

అదేవిటో ఆ మాట వినగానే ఆయన మొహంలో ఏదో బాధ, భయం స్పష్టంగా కన్పించాయ్.

"ఎన్నాళ్ళని ప్రయత్నాలు చేస్తావ్?"

"ఇక్కడ సనత్‌నగర్లో ఓ కంపెనీ వుందిట. తెల్సినవాళ్ళు పుత్తరం ఇచ్చారు. దానికోసం వచ్చాను. పనైతే ఇవ్వాళ రాత్రికే వెళ్ళిపోతా" కావాలనే ఆ మాటని కూడా జతచేసేడు.

అది విన్నాక ఆయన మొహంలో పెద్ద రిలీఫ్.

"సనత్‌నగర్లోనా... మనింటిముందే బస్సాగుతుంది. నూటతొంబయవ నంబరు. కాఫీ టిఫిను పక్కనున్న తాజ్‌మహల్లో బావుంటాయిగానీ, భోజనం మాత్రం పక్కడపల్లిలో బావుంటుంది"

అవన్నీ ఎందుకు చెబుతున్నాడో అర్థమైంది. అతడిని చూస్తే జాలేసింది ప్రకాశానికి. నగరాల్లో వుండేవాళ్ళు ఎంత కృత్రిమంగా, యంత్రాల్లాగా, ప్రతిదానికి లెక్కలు కట్టుకుంటూ బతుకుతారో అర్థమైంది.

అతికష్టంమీద మొహం కడిగి, స్నానం చేసి బజార్లోపడ్డాడు. ప్రాణం హాయిగా అన్పించింది. పక్కనున్న హోటల్లో టిఫిను, కాఫీ పూర్తిచేసి వచ్చి బస్సు స్టాపులో నిల్చునాడు.

కొద్దిసేపటికి భానుమూర్తిగారు చెప్పిన నూటతొంభై నెంబరుగల బస్సు వచ్చింది గాని, అందులో కనీసం నూట తొంభై మంది దాకా వున్నారు.

బస్సు ఒకేఒక క్షణం ఆగింది. అందులోంచి ఒక పల్లెటూరాయన అందర్నీ బూతులు తిడుతూ దిగేడు. ఆయనెక్కడో దిగాల్సి వుందిట. కాని ప్రజలు తప్పుకోక దిగనివ్వలేదు... అదీ సంగతి. ఆయన బస్సు దిగి వెనక్కి పోవటానికి ఆటో పిల్చేడు.

ఈ హడావుడిలో ప్రకాశం నేర్పుగా లోనికి జొరబడ్డాడు.

ప్రయాణం కష్టం అనిపించింది కాని దిగాక ఆ కంపెని తేలిగ్గానే దొరికింది. పెద్ద ఖాళీస్థలంలో నాలుగైదు పెద్ద షెడ్లు, వాటికాస్త దూరంలో పెద్ద కాంక్రీటు భవంతి, కొత్తగా రంగువెయ్యటంచేత అందంగా వుంది. చుట్టూ ప్రహరీ, పెద్ద గేటు– దాని ముందు ఘూర్ఖా.

"క్యాహోనా?" విసుగ్గా అడిగేడు.

"మంగపతిరావ్ సాబ్" అన్నాడు వేడిగా.

ప్రకాశం హిందీలో మంచి మాక్కూడా తెచ్చుకునేవాడు.

"మంగపతిరావ్ సాబ్ హోనా?" అని రెట్టించడిగాడు.

అవునన్నట్లు తలాడించేడు ప్రకాశం.

అతడు "సీదా జావ్" అన్నాడు.

ప్రకాశం అతడు చెప్పినట్లు సీదా సాదాగానే వెళ్ళి పెద్ద కాంక్రీటు భవనం ముందు తేలేడు. మళ్ళీ అక్కడ వాకబు చేసి ఆయన ఛేంబర్ని కనిపెట్టేడు.

ఆ ఛేంబరు ముందు ఇంకో బంట్రోతు. వాడితో మళ్ళీ వచ్చీరాని హిందీలో సంభాషణ. తదనంతరం కాగితంపై పేర్లు గోత్రాలు రాసి అతనికిచ్చేడు.

కాస్సేపటికి ఆ బంట్రోతు వెళ్ళమన్నాడు లోపలికి.

ప్రకాశం బిక్కుబిక్కుమంటూ లోపలికి అడుగు పెట్టేడు.

గది చాలా విశాలంగా ఉంది. కాళ్ళకింద మెత్తటి తివాచీ,కిటికీలకి అందమైన కర్టెన్లు, గోడలకి ఆయిలు పెయింట్స్, గదికి మధ్యన మంచమంత టేబులు,దానికి వెనుక రివాల్వింగ్ కుర్చీ, పక్కన ఎయిర్ కూలర్.

లోపలికొచ్చి వింతగా చూస్తున్న అతడిని చూసి "యస్... వాట్డూయూ వాంట్" అన్నాడాయన.

ప్రకాశం బెరుగ్గా పర్వతాల్రావు రాసిచ్చిన వుత్తరాన్ని అతడికందించాడు.

ఆయనా వుత్తరాన్ని దీక్షగా చదివి "అలా కూర్చో" అన్నాడు.

ప్రకాశం కూర్చున్నాడు.

"మా పర్వతం పంపించాడు.. బాగానే వుంది. కాని ప్రస్తుతం ఏమీ ఖాళీల్లేవుగా" అన్నాడాయన.

ప్రకాశానికి చల్లటి నీళ్ళు నెత్తిన దిమ్మరించినట్లయింది.

"ఒక క్యాషియర్ పోస్టుంది. కానీ దానికి సెక్యూరిటీగా మూడువేలు కట్టాలి"

ప్రకాశం ఏం మాట్లాడకుండా ఆయన వంకే చూస్తున్నాడు.

"మూడువేలు కట్టగలిగితే ఆ వుద్యోగం నీకొచ్చేటట్టు చెయ్యగలను"

"అంత డబ్బు మేం కట్టలేం సార్... మేం చాలా బీదవాళ్ళం"

"అవునవును..పర్వతంఅన్నీ రాసేడు. కాని కంపెనీ రూల్సు ప్రకారం ఆ డబ్బు కట్టి తీరాలి. ఓ పన్చెయ్యి"

ఏమిటన్నట్టుగా చూసేడు.

"నీ అడ్రస్సు ఇస్తూ, అప్లికేషను రాసిచ్చి వెళ్ళు. ఎప్పుడన్నా వేకెన్సీ వచ్చినపుడు గుర్తుపెట్టుకుని కబురంపిస్తాను"

ప్రకాశం అలాగే కూర్చున్నాడు. కొన్ని క్షణాల తర్వాత ఆయన మళ్ళీ తలెత్తి,"మా పర్వతాన్ని అడిగానని చెప్పు. యు కెన్ గో" అనేసి పన్లోపడ్డాడు.

ప్రకాశం తప్పక లేచి గదిలోంచి బయటికొచ్చేడు.

నిరాశ, నిస్పృహ చోటుచేసుకున్నాయ్. పర్వతాల్రావు మాటలని బట్టి తప్పక పనవుతుందన్న కొండంతాశతో వచ్చేడు. పని కాకపోగా అనవసరంగా వంద రూపాయలు ఖర్చు.

వరండా దిగి బయటికి రాబోతుండగా రివ్వున ఒక నల్లరంగు ఎంబాసిడర్ వచ్చి అక్కడ పోర్టికోలో ఆగింది. అందులోంచి ముగ్గురు వ్యక్తులు దిగేరు. వాళ్ళలో చివరగా దిగిన ఆ వ్యక్తిని చూడగానే ప్రకాశానికి పోయిన ప్రాణం తిరిగొచ్చినట్లనిపించింది. వరాలిచ్చే దేవుడు వెతుక్కుంటూ వచ్చాడనిపించింది.

ఆ వ్యక్తి గూడా ప్రకాశాన్ని గుర్తించినట్టు లోపలికెళ్ళకుండా అక్కడే నిలుచున్నాడు.

అతడు చనిపోయిన మార్కండేయులి తండ్రి...

అలా అతని జీవితం ఓ మలుపు తిరిగింది.

ఇన్నేళ్ళలోనూ ఆ ప్రకాశం ఈనాటి ప్రకాశరావుగా ఎదిగేడు.




ప్రకాశరావు నిద్ర లేచేసరికి తొమ్మిదయింది. అందులో విచిత్రం ఏమీలేదు. కాని విచిత్రమల్లా ఇందిర కూడా స్తబ్దుగా అలాగే కూర్చుంది. ఆ సమయానికి ఆమె పనిలో బిజీగా ఉండాల్సింది మరి!

వంటింట్లో కూరలో కారం, ఉప్పు పడేసి అక్కణ్నించి బాత్రూంలోకి పరిగెత్తి పిల్లలకి రెండు చెంబుల నీళ్ళు గుమ్మరించి స్నానం పూర్తి చేయించాలి. అక్కణ్నించి, చీపురు తీసుకుని ఇళ్ళు శుభ్రంచెయ్యాలి. అంతలో ఏదో గుర్తుకొచ్చినట్టు మళ్ళీ వంట గదిలోకెళ్ళి కూర దింపేసి, భర్త కాఫీని వెచ్చచెయ్యాలి. అంతలో గడియారం గంటలుకొట్టి కాలాన్ని గుర్తుచేస్తుంది. "అమ్మో... టైమైంది" అంటూ చీర భుజానవేసుకుని బాత్రూంలోకెడుతూ,

అప్పుడే లేచి కాఫీ కోసం ఎదురు చూసే భర్తతో-"ఏవండోయ్...కాఫీ స్టౌ మీదుంది. కాస్త ఇలా వచ్చి తీసుకు వెళ్లండి. నేస్నానానికెడుతున్నా" అంటూ పరుగెత్తాలి.

కాని ఇదేమిటి విచిత్రం...

ఎక్కడి సామాన్లు అక్కడేవున్నాయి. ఇల్లు శుభ్రం చెయ్యలేదు. వంట ప్రయత్నం చేసినట్టు కూడా లేదు. తను స్నానం చెయ్యలేదు. తల దువ్వుకోలేదు.

పరుగుపందెం వెయ్యాల్సిన ఆ సమయంలో తనకేం పట్టనట్టు కూర్చున్న భార్యని చూశాక ప్రకాశానికి విచిత్రమే అనిపించింది.

"ఇవ్వాళ ఆఫీసుకి సెలవా ?" అని అడిగాడు అర్థంకానట్లు.

"లేదు"

"ఓహో... సెలవుగాని పెట్టేవా ?"

"అదీ లేదు"

ఆమె వాలకం అర్థంకాలేదు. అలా ముభావంగా, స్తబ్దుగా కూర్చోటంలోని అంతర్యమేమిటో కూడా అర్థం కాలేదు.

"ఆఫీసుకెళ్ళవా?"

"వెళ్ళాలనిపించటంలేదు"

ప్రకాశం సంభాషణని అక్కడితో ఆపేసుంటే చాలా బేషగ్గా వుండేది. కాని-

"వెళ్ళకపోతే ఎలాగోయ్! అందులో ఇవ్వాళ జీతాలిచ్చే రోజుకూడాను" అన్నాడు.

అప్పుడు...ఆ మాట విన్నాక ఆమెలో చలనం వచ్చింది.

"నాకు జీతాలెప్పుడిస్తారో, ఎంతొస్తుందో తప్ప ఇంకేం గుర్తుండవ్ మీకు"

"ఇప్పుడు నేనేం అన్నానని... జీతాలిచ్చేరోజని చెప్పటం కూడా తప్పేనా?"

"అబ్బే ... తప్పు కాదు. అసలు తప్పంతా నాది. ఆడపిల్లగా పుట్టడం ఒక తప్పు.... సభ్యత, సంస్కారం నేర్చుకోకపోవటం రెండో తప్పు. అవి పుష్కలంగా వున్న మీకు భార్యగా రావటం అన్నిటికన్నా పెద్ద తప్పు"

ప్రకాశానికి అర్థమైంది. వాతావరణం

చాలా కల్లోలంగా వుంది. తుఫాను వచ్చే ముందు హెచ్చరికలు... మొదట్లోనే జాగ్రత్తపడటం ఉత్తమం.

అలా అనుకుని పద్ధతి మార్చేడు.

ఆమె పక్కనే కూర్చుని, మెత్తటి ఆమె భుజాలని గట్టిగా పొదివి పట్టుకుంటూ "ఏమిటీ ... అంత కాకమీదున్నావ్?" అన్నాడు.

ఇందిర మొహంలో మంచి కళుంది. గుండ్రని కళ్లు,ఒంటిరాయి ముక్కుపుడక, ఒత్తు అయిన జుట్టు, ఇద్దరు పిల్లలు పుట్టినా పోని బిగువు, పేటికి తోడు అలంకరించుకునే విధానం - అందమనే పదానికి అర్థం లేదనేవాళ్ళకి, ఆమెని చూస్తే అర్థమవుతుంది... అందమంటే ఏమిటో

దగ్గరికి తీసుకోబోతున్న భర్త ప్రయత్నాన్ని వారిస్తున్నట్లు దూరంగా జరిగింది.

"రాత్రి మళ్ళీ తాగొచ్చారుకదూ?" అంది కళ్ళలోకి సూటిగా చూస్తూ.

అప్పుడు తెల్సింది ఆమెలోని మార్పుకు కారణమేమిటో-

"అదా ... రాత్రి చెప్పాను గా. ఫ్రెండ్‌కి పెళ్ళయితేను..." తేలిగ్గా అన్నాడు.

"అదేమిటి... రాత్రి ఫ్రెండ్ ప్రమోషన్ వచ్చిందుకన్నారు?"

ప్రకాశం కళ్లలో ఒక్కక్షణకాలం తత్తరపాటు; దొరికిపోయానన్న భావం.... కాని దాన్ని దాచుకునే ప్రయత్నంలో "కారణం ఏదైతేనేం..." ఇంకేదో అనబోయాడు. కాని ఇందిర వెంటనే అందుకుంది- "తాగి రావటానికి..."

ఇలా అయితే ఎక్కడ తేల్తామో తెలీదని చెప్పి కాస్త బింకంగా...

"నిజమే! తాగొచ్చాను... అది నీకు తెల్సు. నే చెప్పే కారణాలు నిజం కావనీ తెల్సు ... అన్నీ తెల్సి ఎందుకీ గొడవ పొద్దున్నే..."

ఇందిర మొహం గంభీరంగా మారింది. "నిజమే ... రోజూ మీరు తాగిరావటం, నే గొడవ చెయ్యటం నాకూ అసహ్యంగానే వుంది. అందుకే ఇవ్వాళ మీతో మాట్లాడాలని ఆఫీసుకి సెలవు కూడా పెట్టేశాను"

ప్రకాశం లేచి నిల్చున్నాడు. "ఆఫీసుకి వెళ్ళకపోతే నీకు ఫర్వాలేదుగాని, నాకు కుదర్దు. అందులో కాషియర్ని. ఇవ్వాళ పేడే కూడాను. చచ్చేటంత పనుంటుంది" అంటూ దొడ్లోకి వెళ్ళిపోబోయాడు.

కాని ఇందిర అడ్డుగా నిల్చుని ఆ ప్రయత్నాన్ని వారించింది.

"నాకివ్వాళ మీ నుంచి హామీ కావాలి. వాగ్దానం కావాలి. మళ్ళీ తాగనని మాటివ్వాలి" అంది.

"సరే...అలాగే. తాగన్లే ...తప్పుకో"

"ప్రతిరోజు చెప్పేమాట కాదు. నా పైని, పిల్లలపైని ఒట్టేసి మీరే చెప్పండి"

"ఏది మంచో ఏది చెడుదో తెల్సుకోలేనంత అసమర్థుడు కాడు నీ మొగుడు. నీకన్నా ఎక్కువ జీవితాన్ని చూసేను. రెట్టింపు అనుభవాల్ని సంపాదించాను"

"అవును...నిజమే. అదే ఆశ్చర్యం అన్పిస్తుంది అప్పుడప్పుడు. అంతటి కష్టాలు, బాధలు అంత "స్ట్రగులనుభవించిన మీరుఎందుకిలా పాడైపోతున్నారో అర్థంకాకుండా వుంది."

ప్రకాశం భార్యవంక సూటిగా, వాడిగా చూస్తూ-

"పాడైపోతున్నానని నేననుకోవటం లేదు. అది అర్థం చెప్పుకోవటంలోవుంది"

"ఆత్మవంచన చేసుకోవటం నాకు తెలీదు. రోజూ తాగుడు, వూరంతా

అప్పులు, పేకాట ఇంకా అవి పాడైపోవటం కాదంటే ఏం చెప్పేది"

"అపాపు...దండకం పొద్దున్నే" అని టవలు తీసుకుని బాత్‌రూమ్‌వేపు వెళ్ళబోయాడు.

"అంతేలెండి.... ఏమన్నా అంటే దండకాలు, అష్టోత్తరాలు అంటారు. అసలు నిన్న వాడొచ్చినపుడు మీరు వుండి వుండాల్సింది"

వెళ్ళబోతున్నవాడల్లా ఒక్క క్షణం ఆగి "ఎవడు వాడు?" అనడిగాడు.

"ఎవడో సర్దార్జీ. ఇంతలావున, అంత పొడుగు వున్నాడు. ఎర్రగా చెక్కు తీసిన కందముక్కలా, యముడిలా వున్నాడు. అప్పుడు వుండాల్సింది మీరు"

ప్రకాశం భయంగా రెండడుగులు ఆమె దగ్గరగా వచ్చి ఆత్రంగా—

"ఏమన్నాడు...గొడవగానిచేసేవా?" అనడిగాడు.

"లేదు. కుశలం అడిగి వెళ్ళాడు" వ్యంగ్యంగా బదులిచ్చింది.

ప్రకాశానికి చిర్రెత్తుకొచ్చింది, "తమాషా లాపి త్వరగా చెప్పు. అయినా వెధవ ఇల్లెలా తెల్సుకున్నాడో?"

"మీ పేరు సందు సందునా అడిగాడు. చెప్పకుండా వుంటారా...సందులో అందరి కళ్ళు వాడిపైన, మనింటిపైనాను"

"ఇంతకీ ఏమన్నాడు?"

"వాడికి మూడు వేలివ్వాలిటగా. రెండు నెల్నించి వడ్డీగూడా ఇవ్వటం లేదట.. అంతేత చెప్పమన్నాడు. లేకపోతే మర్యాద కాదన్నాడు"

ప్రకాశం బాత్‌రూముకెళ్ళిపోయాడు. ఇందిరలాగే కూర్చుండిపోయింది. ఆమెలో ఏవేవో భయాలు, అనుమానాలు, అపోహలు.

కాస్సేపట్లో ప్రకాశం తిరిగొచ్చాడు. అతడిలో ఇందాకలేని భయం, బెరుకు. వస్తూనే– ''మళ్ళీ వస్తానన్నాడా?'' అని అడిగాడు భార్యని.

"రాక మానాడా.డబ్బిచ్చేవరకువస్తూనే వుంటాడు. అయినా అంతప్పు ఎందుకు చేసేరు? కనీసం నాకు చెప్పనన్నా లేదు"

ప్రకాశం ఆమె మాటల్ని పట్టించుకోలేదు.

"ఇంకా ఇలాంటివెన్నున్నాయ్. అసలు ఇదంతా ఎలా జరిగింది చెప్పండి?''

ప్రకాశానికి కోపం చర్రుమంది.

''అబ్బ...ఇందిరా! నా మనసు బాగో లేదు. దయచేసి విసిగించకు''

''ఇష్టరం సంపాయిందుకుంటున్నాం. హాయిగా, సంతోషంగా, దర్జాగా బత కాల్సిందిపోయి ఎందుకొచ్చిన అవస్థలండీ? అసలు నా గురించి, పిల్లల్ని గురించి ఆలోచిస్తున్నారా''

ప్రకాశం పెద్దగాఅరిచేడు-''ఆపుతావా లేదా? వెధవ మెలోడ్రామా నువ్వూను''

ఇందిరకి బాధ పతాకస్థాయికి చేరింది. దుఃఖం పొంగుకొచ్చింది.

సన్నగా ఏడుస్తూ, పమిటతో కళ్ళు తుడుచుకోనారంభించింది.

అది చూసిన ప్రకాశం "ఛీఛీ..పొద్దున్నే పాడుగోల'' అనుకుంటూ పాంటు, షర్టు వేసుకుని బజార్లోకెళ్ళిపోయాడు.

ఇందిర ఒంటరిగా అలాగే పడుకుని కాసేపు ఏడ్చింది. ఎలాంటి సంసారం ఎలా తయారయిందా అని ఆశ్చర్యం, బాధ ముంచుకువచ్చేయి.

పెళ్ళినాటికి తను వుద్యోగస్తురాలు కాదు. డిగ్రీ పూర్తికాగానే పెళ్ళిచేసేశారు. అప్పుడు ప్రకాశంకి జీతంగూడా చాలా తక్కువ. కాని ఆరోజులు ఎంత హాయిగా

సరదాగా వుండేవి. సంసారం ఎంత తూచినట్లుగా సాగేది! ఫస్టుతారీఖు రాగానే జీతంతెచ్చి భార్య చేతిలో వుంచేవాడు. ఆ ఒక్కరోజు భార్యా, పిల్లల్ని హోటలికి తీసుకెళ్ళేవాడు ఆ రాత్రి ఇద్దరూ కూర్చుని ఇంటిబడ్జెట్ ని తయారుచేసేవాళ్లు. ఆ నెల అంతా లెక్కప్రకారం, అనుకున్నట్లుగా జరిగిపోవాలి. అదేవిటో...అలాగే జరిగేది. బాధనిపించేదికాదు సరికదా .... అదోక రకమైన తృప్తిగా, గొప్పగా అనిపించేది.

ఇందిరకి వుద్యోగం పట్ల పెద్ద వుత్సాహం వుండేదికాదు. కాని ప్రకాశ రావ్ ఆమెని ప్రోత్సహించి అన్నిటికీ అప్లై చేయించేవాడు. ఎన్నో పరీక్షలు రాసింది. ఎన్నెన్నో ఇంటర్వ్యూలకెళ్ళింది. చివరికి విసుగుపుట్టింది. "ఇక నే పరీక్షలు రాయ సండీ..వెధవ వుద్యోగాలు" అంటూ విసుక్కుంటే, ప్రకాశం ఆమెకి అర్థమయ్యేలా బుజ్జగించి చెప్పి వుత్సాహపరిచే వాడు.

ఎట్టకేలకు ఇందిరకి ఇన్సూరెన్స్ కంపెనీలో వుద్యోగం వచ్చింది. ఆరోజు ప్రకాశం ఎంతో సంబరపడిపోయేడు.

ఏవి? ఆ రోజులేవి? ఆ ప్రకాశం ఏడి? ఆ వెచ్చటి ఆప్యాయతలు, అనురాగాలేవి? ఏమైపోయినాయ్? ఏ గాల్లో, ఏ గంగలో కల్సిపోయినాయ్??

తను సంపాదించటంవల్ల, ప్రకాశం క్రమంగా 'ఇక నాకేం బాధ్యత లేవు' అన్నట్టు విచ్చలవిడిగా ప్రవర్తిస్తూ, వ్యసనాలకి దాసుడై పతనమైపోతాడని తెలిసుంటే ఇందిర అసలు వుద్యోగస్తురాలై వుండేదే కాదు.

అపుడు వుద్యోగం చేస్తానని సమ్మతించటానిక్కారణం పెరిగే సంసారపు ఖర్చుతోపాటు ఓ చిన్న ఇల్లు కట్టుకోవాలనే కల!

కాని, ఇపుడు వుద్యోగంచేసి తీరాలి అనుకోవటానిక్కారణం-ఒక పాక తగలడి పోతుంటే, దాన్ని వదిలి పక్కనున్న మరో పాకని నీళ్ళతో తడిపే ముందు చూపు జాగ్రత్త.

అపుడుద్యోగం ఇంకాస్త మంచి తిండి గాను, బట్టలుగాను, నగలుగాను, రేపటి స్వగృహంగాను కన్పిస్తే - ఇపుడు అదే వుద్యోగం తనకి, పిల్లలకి చుట్టూ అల్లుకున్న ముళ్ళకంచెలా కన్పిస్తోంది.

మనుషుల ప్రవర్తనబట్టి ఎదుటివారి అంచనాలు, ఆలోచనా ధోరణులు మారుతుంటాయ్.

మొదట్లో భర్త ఆలస్యంగా రావటం గురించి ఇందిర పెద్దగా పట్టించుకోలేదు. అతడికోసం ఆశగా ఎదురుచూసేదిగాని, భయంతోను, బాధతోను కాదు. కాల క్రమేణా అతడు ఆలస్యంగా రావటమే కాకుండా, విచిత్రమైన వాసనలు, పిచ్చి మాటలు, తన వొళ్ళు తనకే తెలీని స్థితిలో వచ్చేవాడు. ఒక్కోసారి కాళ్ళకి చెప్పులు లేకుండా, బట్టలమీద కిళ్ళీ మరకలతో వచ్చేవాడు. ఆ స్థితిలో అతడేం చేస్తాడో, ఏం మాట్లాడతాడో, ఎలా ప్రవర్తిస్తాడో అర్థంకాని సంగతిగా ఉండేది.

అప్పట్నుంచే ఇందిరకి భయం పట్టుకుంది. జరగకూడనిది జరిగిపోతున్నట్లు విలవిల్లాడసాగింది. అతనికోసం రాత్రిళ్ల చూసే ఎదురుచూపులు ఆశంతోగాని, వెచ్చటి అనుభవాలకోసం గాని కాదు. చిక్కటి, నల్లటి భయంతో అన్నట్లు తయారైంది. కాస్త ఆలస్యమైతే కంగారు.. ఎక్కడన్నా ... ఏదన్నా ... అవలేదు గదా...?

ఇదేమిటి ఇంతలో జీవితం ఇలా మారి

పోయింది? ప్రకాశం ఇలా ఎలా మారి పోయాడు?? ఇవే ఆలోచన్లు వేధించేవి.

ఇవి చాలదన్నట్లు ఒకరోజు వొళ్ళు తెలీని స్థితిలో అతడన్న చిన్నమాట మరింత అనుమానాలకి, అపోహలకి దారి తీసింది.

ఆ రోజు ప్రకాశం యధావిధిగ, యధాస్థితిలో ఇంటికొచ్చాడు.

అప్పటికే రాత్రి పదయింది. పిల్లలు పడుకున్నారు. ఇందిర ఆరోజు తలంటు కుంది. ఇస్త్రీ తెల్లచీర కట్టుకుంది. గుప్పెడు మల్లెపూలు పెట్టుకుంది. ప్రకాశం కోసం ఎదురుచూస్తూ కూర్చుంది. చిన్న చిన్న గొడవలు, చికాకులు, కోపాలు, అలకలు లేకుండా ఆరోజు, ఆ రాత్రి, తనందాన్ని, అలంకరణని, వయసుని, వేడిని అన్నిటినీ.. ఏదీ మిగల్చకుండా, ఏదీ దాచకుండా వొలిచి అతడి ముందుంచాలని ఆశగా ఎదురుచూస్తూ కూర్చుంది.

ఉదయం అతడు ఆఫీసుకెడుతుంటేనే గుర్తుచేసింది- "ఇవాళ మన మ్యారేజిడే... గుర్తుందా?" అని.

"ఇవ్వాళ పేడేగదా. నే ఆఫీసుకెళ్ళి తీరాలి'' అని అతను అన్నప్పుడు ఏమీ అనిపించలేదు. "సాయంత్రం త్వరగా రండి" అని మాత్రం అంది.

ప్రకాశం తలూపి వెళ్ళాడు. ఆ వెళ్ళిన వాడు రాత్రి పదిన్నర కొచ్చేడు. ఆలస్యంగా వచ్చాడని కాదు ఆమె బాధ... తాగొచ్చాడని. చొక్కా అంతా చిన్నపిల్ల వాడిలా మరకలు చేసుకున్నాడని కాదు... తను ఎదురెళ్ళి తూలిపోతూ రిక్షా దిగిన అతడిని రెక్క పుచ్చుకుని లోనికి తీసుకు రావాల్సొచ్చిందని! పైగా భార్య భుజం చుట్టూ చేతులువేసి లోనికొచ్చాక- "ఇవాళ ప్రసూన ఫోన్చేసింది. మై స్వీట్ హార్ట్" అంటూ పక్కనున్నది భార్యని మరచి పోయినవాడిలా మమైకం చెందాడు.

అదీ ఆమె బాధకి కారణం.

అంతే!

భర్తనించి విడిపించుకుని దూరంగా నిలబడింది. పెళ్ళిరోజన్న ఉత్సాహంపోయి కోపం, బాధ చోటుచేసుకున్నాయి.

"ఎవరండీ ఆ ప్రసూన?'' అనడిగింది.

అది విని ప్రకాశం నవ్వుతున్నాడు. ''అబ్బే..ఎవరూలేరు.ఊరికెనే అన్నాను" అన్నాడు.

ఇందిర అంత తేలిగ్గా నమ్మే రకంకాదు. అప్పటికి ఊరుకుంది.

ఆ మర్నాడు ఆదివారం—

ప్రకాశం లేచి కాఫీ తాగి, పేపరు చూస్తున్నాడు. పిల్లలు వీధిలో ఆడు తున్నారు.

ఇందిర భర్త పక్కనే చేరింది. చాలా సాధారణంగా, అతి మామూలు ధోరణిలో అడిగింది ''ఎవరండీ ఆ ప్రసూన?''అని.

అనుకోకుండా, అకస్మాత్తుగా అలా అడిగేసరికి బిత్తరపోయి తేరుకోటానికి రెండు క్షణాలు పట్టింది అతడికి.

ఆ రెండు క్షణాల్లోనే మళ్ళీ అంది - "మీరు ప్రేమించి, పెళ్ళి చేసుకుందా మనుకున్న ప్రసూనేనా?"

"ఎవరన్నారు?"

"ఎవరేమిటి మీరే రాత్రి 'మై స్వీట్ హార్ట్' అంటూ..."

ప్రకాశానికి అలా అన్నట్టు గుర్తులేదు. అలా అని ఆమె చెప్పేది అబద్ధమని అన టానికూడా మనసొప్పలేదు. అంచేత పేపరు మాటున మొహాన్ని దాచేడు.

''ఏమండీ...నేనంటే నిజంగా మీకిష్ట మేనా?''

"ఏమిటా అనుమానాలు ఇద్దరు పిల్లలు

పుట్టేక అర్థంలేకుండా" విసుగ్గాఅన్నాడు.
''కాదండీ...ఇప్పుడిప్పుడే విషయాలు లీలగా అర్థమవుతున్నాయ్. ఇంతకీ నన్ను ఎవరిబలవంతంమైనన్నా చేసుకున్నారా?"

"ఇందిరా!నన్ను అర్థంలేని ప్రశ్నలతో విసిగించక...వెళ్ళి పన్నూసుకో''

"రాత్రినించి నాకు అదోలా వుందండీ! ఆ ప్రసూనెవరో, ఆ కథేమిటో విపులంగా చెబితేనేగాని నాకు ఏ పనీ చెయ్యబుద్ధికాదు"

"రాత్రేదో వాగేసుండచ్చు. ఆ మాటలు పట్టించుకోక"

''పర్లేదండీ.. ప్రేమించటం తప్పుకాదు. పరిస్థితుల ప్రాబల్యంవల్ల ఇంకోళ్లని చేసుకోవటం తప్పుకాదు. కాని తప్పల్లా కట్టుకున్నదాన్ని పరాయిదానిలా చూడటం''

భార్య మాటల ధోరణి చూసేక ప్రకాశానికి కాస్త ధైర్యం వచ్చింది.

"సరే....అలాగే చెబుతానుగాని వెళ్ళి పన్నూసుకో"

కాని ఇందిర కదల్లేదు– ''ఒక్క



విషయం ఆలోచించండి. నేనే మీ పక్కన పడుకుని పరాయిమొగాడి పేరు పలవరిస్తే మీకెలా వుంటుంది?"

"ఇందిరా ... చాలా అసందర్భంగా, అసహ్యంగా మాట్లాడుతున్నావ్"

"అవునండీ...సరిగ్గా రాత్రి అదే జరిగింది"

"సరిసరి...చెబుతానన్నానుగా"

"ఎప్పుడు?"

ప్రకాశం రెండు క్షణాలు ఆలోచన చేసి "రాత్రికి...సరేనా" అన్నాడు.

ఇందిర అప్పుడుగాని లేచి లోపలికెళ్ళ లేదు.

ఆ రాత్రికి ప్రకాశం తొమ్మిదింటికే ఇంటికి తిరిగొచ్చాడు. భోజనం అయ్యేక భార్యని ఎదురుగా కూర్చోమని సిగరెట్టు ముట్టించి – "ఉదయం ప్రసూన ఎవరని కదూ అడిగావ్?" అంటూ సవివరంగా ప్రసూన సంగతి వివరించేందుకు పూనుకున్నాడు–ఓసారి గతం అంతా మనసులోనే నెమరువేసుకోసాగాడు.

* * *

ప్రకాశం ఉద్యోగంలో చేరిన మొదట్లో మరో ముగ్గురితోకల్సి ఓ చిన్న గదిలో వుండేవాడు. అక్కడి వాతావరణం, రూమ్మేట్సు ప్రవర్తన నచ్చక మంచి గది కోసం సెలవురోజుల్లో వేటాడుతుండేవాడు.

అలా అన్వేషిస్తూ ఓసారి పోస్టాఫీసులో కెళ్ళాడు. అక్కడ బాగా రష్‌గా వుంది. జనం రెండు మూడు పెద్ద లైన్లుగా నిల్చున్నారు. ఆ లైన్లో నిల్చుని కవరు కొని రాసేసరికి పోస్టాఫీసు మూసేవేళవుతుంది. తర్వాత చూద్దాం లెమ్మని వెనక్కి తిరిగి వచ్చేస్తుండగా, పక్కన లైన్లో ఏదో గొడవజరుగుతున్నట్లనిపించిఆగిపోయేడు.

"నే యాభైరూపాయల కాగితం ఇచ్చేనండి ... అలా మాట్లాడతారేమిటి?" అంటోంది ఆ అమ్మాయి.

"ఎక్కడిచ్చావమ్మా! అబద్ధం ఆడాల్సిన అవసరం నాకేవిటి?" అంటున్నాడా కౌంటర్లో వ్యక్తి.

"అంటే నేనబద్ధం ఆడుతున్నాననా మీరనేది?"

"అలా అని నేనన్లేదే?"

"మరి..."

"చూడమ్మా... మీకేమైనా కంప్లైట్సుంటే సూపరింటెండెంటుని కలవండి. పక్కకి తప్పుకోండి. వెనకాల చాలా మందున్నారు"

ఆ పిల్లకి అహం దెబ్బతింది. రోషంగా చూసింది.

అక్కడున్నవాళ్ళందరూ ఆమెవైపు వివిధ రకాలుగా చూసేరు.

ప్రకాశం కూడా ఆమెని పరిశీలనగా చూసేడు.

ఆమెకి పద్దెనిమిది సంవత్సరాలుంటాయి. ఎర్రగా, సన్నగా మందార మొగ్గలావుంది. చిన్న మొహం, పెద్ద కళ్ళు, సూదంటురాయి ముక్కు, లేతపెదాలు... వేటికవే అందంగా వున్నాయి. పట్టుపరికిణీ, నైలాన్ ఓణీ, ఎర్రబ్లౌజు, ఒక చేతికి ఒక జత బంగారు గాజులు, రెండో చేతికి రిస్టు వాచీ, మెళ్ళో సన్నని జిగినీ గొలుసు... ఆమె అందాన్ని మరింతగా పెంచాయ్.

ప్రకాశం అలాగే చూస్తూ నిల్చున్నాడు.

ఆ పిల్ల అలా రెండు క్షణాలు నిల్చుని తన వంకే చూస్తున్న అందరి చూపుల్ని తప్పించుకుంటూ, సూపరింటెండెంటు వైపుగా కోపంగా వెళ్ళింది.

అయన ఆమె చెప్పిందంతా విని– "చూడమ్మా...ఇచ్చానని నువ్వంటున్నావ్

లేదని అతడంటున్నాడు. పొరపాటు ఎవరికైనా జరగొచ్చు. అంచేత నువ్వు సాయంత్రం వస్తే లెక్కలు చూసి, కాష్ వెరిఫై చేసి ఎక్కువుంటే ఇచ్చేస్తాం" అన్నారు.

"నిజమేనండీ! కాని పోస్టలార్డర్స్ పంపటానికివ్వాళే ఆఖరిరోజు....ఎలా?"

"అలా అయితే మీరు వేరే డబ్బుకట్టి పోస్టలార్డర్ తీసుకోండి. అంతకన్నా వేరే మార్గం లేదు"

ఆమె ఇంకేం మాట్లాడకుండా బయటి కొచ్చేసింది. ఇంకా జనం అంతా ఆమె వైపే చూస్తున్నారు.

ప్రకాశం కూడా బయటకొచ్చాడు.

ఆమెని కలుసుకుని– "ఎక్స్క్యూజ్ మీ" అనటంతో–

ఆమె ఆగి అతడి వైపు అనుమానంగా చూసింది.

"అక్కడ జరిగిన గొడవంతా చూసేను. విషయం అర్థమైంది. యాభై రూపాయలు నేనిస్తా. మీకభ్యంతరం లేకుంటే పోస్టలార్డర్ కొనండి" అన్నాడు.

ఆమె ప్రకాశాన్ని పరీక్షగా చూసింది. మనిషి చూస్తే బుద్ధిమంతుడిలాగా, చదువుకున్నవాడిలాగా వున్నాడే గాని కొంటె కోణంగిలా లేడు. కాని ఎందుకింత ఆసక్తి చూపిస్తున్నాడు. ఈ సహాయం వెనక ఏదైనా కుట్రగానుందా...

"అసలు మీరెవరు–మీకేవిటి ఇంట్రస్టు?"

ప్రసూన పిరికిదేం కాదు. మొదట్నించి నగరాల్లో వుండటంచేత కాస్త చొరవ ఎక్కువ.

"ఇంట్రస్టు ఏమీలేదు. నేనూ ఇపుడు మీకు జరిగిన అవమానాల్లాంటివి చాలా పడి చూసేను. ఆ దెబ్బ తిన్నవాడి మనస్సెలా వుంటుందో నాకు తెల్సు .... అంతే మరేం లేదు"

ఆ క్షణంలో ఆ పిల్లకి ప్రకాశం చెబుతున్న మాటలపై గురి, నమ్మకం ఏర్పడ్డాయి. అయినా ఇంకాస్త బింకంగా "థాంక్స్. కానీ..." నసిగింది.

ప్రకాశం చొరవగా "చూడండీ... డబ్బుకన్నా టైం విలువైంది. ఇవ్వాళ లాస్ట్ డేట్ అంటుంటే విన్నాను. అందుకే చెబుతున్నాను. ఇక మీ ఇష్టం" అని ఆమె వంక చూసేడు.

ఆమె చిరునవ్వు నవ్వింది.

ప్రకాశానికి ధైర్యం వచ్చింది. జేబులోంచి యాభై కాగితం తీసి ఆమెకిచ్చాడు. ఆమె దాన్నందుకుని, "మీరూ రండి.పోస్టాఫీసులో అది కొనేసి, మా ఇంటికెడదాం. డబ్బులిచ్చేస్తా" అంది.

ఇద్దరూ వెళ్ళి పోస్టలార్డర్ కొని, పూర్తిచేసి, పోస్టులో పడేసి, నడక ప్రారంభించేరు.

నడుస్తుండగానే ప్రకాశం పేరు, వూరు, వుద్యోగం అన్నీ విషయాలూ అడిగింది.

అన్నీ చెప్పి, "ఇంతకీ మీ పేరు చెప్పారు కాదు" అన్నాడు.

చెప్పింది.

ఇద్దరూ ఒకరి వివరాలొకరు వాకబు చేసుకుంటూనే ప్రసూన ఇంటిని సమీపించేరు.

అది పూర్వకాలం పెంకుటిల్లు. ఇంటి ముందు పెద్ద రేకు తలుపు, దానికి నడుమ చిన్న ద్వారం.దాంట్లోంచి లోపలికెడితేచాలా ఖాళీ స్థలం వృథాగా పడుంది. అక్కడక్కడ ఏవేవో చెట్లు వున్నాయి. కాని అమర్చినట్లు లేకపోవటంతో చూడటానికి చిన్న సైజు అడవిలా వున్నాయి.

లోపలికెళ్ళగానే ప్రకాశాన్ని కూర్చో

మన్నెప్పి ప్రసూన లోపలికెళ్ళింది. కొద్దిసేపటికి ఒక ముసలాయన బయటికొచ్చేడు. వయసు డెభ్భైదాకా వుండొచ్చు. చేతిలో పెద్ద పురాణ గ్రంథం, కళ్ళకి జోడు, మొహంలో విసుగు.

బయటికొచ్చి ప్రకాశాన్ని పరీక్షగా చూసి–

''మా పిల్లకి హెల్ప్ చేశావుటగా... సంతోషం. ఆడపిల్లల్ని ఒంటరిగా పంపాలంటే భయంగా వుంటోంది. మా అబ్బాయి ఈమధ్యనే ట్రాన్స్ఫరయి అహమ్మదాబాదెళ్ళాడు. దీనికి చదువు పాడవుతుందనిచెప్పి, వున్నాగా నేను ఏ పనీ పాటా లేకుండా, అందుకని చూసుకోమని చెప్పెళ్ళాడు. నాకా ఓపికలేదు. బయటకి కాలు పెట్టాలంటే నీరసం, కాళ్ల నొప్పులు'' ఆయనలా ధారాళంగా నీరసం గురించి చెబుతుండగానే ప్రసూన కాఫీ గ్లాసుతో వచ్చింది.

ముసలాయన తనపంక కళ్ళద్దాల్లోంచి గుచ్చి గుచ్చి చూడటం గమనించి ప్రకాశానికి ఇబ్బందిగా అనిపించి రెండు గుక్కల్లో కాఫీ తాగి లేచి నిల్చున్నాడు.

ప్రసూన చేతిలో పట్టుకున్న యాభై కాగితాన్ని అతడికందించి ''థాంక్స్ ఫర్ ది టైమ్లీ హెల్ప్' అంది సన్నగా నవ్వుతూ.

ప్రకాశానికి నిజానికి ఇంకాసేపు కూర్చుని కబుర్లు చెప్పాలనివున్నా ఆ ముసలాయన చూపులకి భయపడి లేచాడు–

"వస్తానండి తాతగారూ" అన్నాడు.

తాతగారు తలూపేరేగాని అంగుళం కూడా కదల్లేదు. కనీసం ప్రయత్నమన్నా చెయ్యలేదు.

ప్రసూన అతడితోపాటు రెండడుగులు వేసి, ''సాయంత్రం మళ్లీ ఆ పోస్టాఫీసుకెళ్లాలిగామోను'' అంది.

ఆ మాట తనకి చెబుతోందో లేక తనలోతాను అనుకుంటున్నదో అతనికప్పుడు అర్థంకాలేదు.

కాని రోడ్డుపైకొచ్చి నడుస్తున్నప్పుడు తిరిగి ఆలోచిస్తే ఆ మాట తనకోసమే చెప్పంటుందని గట్టిగా అన్పించింది.

అవును...ప్రసూనని మళ్ళీ కలవాలి. అదీ ఈరోజే–సాయంత్రం.

సరిగ్గా నాలుగున్నరకే పోస్టాఫీసు వద్దకొచ్చాడు. జనం అంతగా లేరు. ప్రశాంతంగా ఉంది.

ప్రకాశం బయటవున్న పోస్ట్ డబ్బా వెనగ్గా నిల్చున్నాడు.

నీరెండ మొహంపైబడి చికాకు పుట్టిస్తోంది. సాయంత్రం ట్రాఫిక్కుతో రోడ్లు సందడిగా కనిపిస్తున్నాయ్.

అలా ఎండలో నిల్చోడం అతడికి బాధగా అనిపించటంలేదు సరికదా సంతోషంగా, వుత్సాహంగా, థ్రిల్లుగా వుంది. వుండివుండి ప్రసూనవచ్చే వైపుగా ఆశగా చూస్తున్నాడు.

సరిగ్గా నాలుగూ ముప్పావు...

ఆశగా ఎదురుచూస్తున్న అతడికి వస్తున్న వ్యక్తిని చూసేక నిరుత్సాహంతోపాటు కాస్తభయంగా అనిపించింది.

దూరాన్నుంచి ప్రసూన తాతగారు రోడ్డువారగా నడుస్తూ, అటువైపుగా నడుస్తున్నారు.

ప్రసూన రాదా? తను రాకుండా తాతగార్ని తరిమిందా? మరి అలా ఎందుకన్నది??

ప్రకాశంలో ఆత్రత–

కాని మళ్ళీ వెంటనే సమాధానం చెప్పుకున్నాడు.

కాని ఆమె ఆవిధంగా చెయ్యదు.

ముసలాడిని ఏ బజారుకో పంపించి, ఆయన వెనగ్గా వస్తుంది.

అలా అనుకుని ప్రకాశం ఆ ఉత్తరాల డబ్బా వెనక్కి మరింత నక్కేడు-ఆయన కంట పడటం ఇష్టం లేక.

కాని ఆయన చాలా ఘటికుడిలా ఉన్నాడు. సరాసరి ఉత్తరాల డబ్బా వెనగ్గా నిల్చున్న ప్రకాశం దగ్గరకే వచ్చాడు. వచ్చి "ఏవిటోయ్..అప్పట్నించి ఇక్కడేవున్నావా ? ఏవిటి సంగతి?" అనడిగారు.

ప్రసూన రాకపోవటం ఒక షాకు. ఈ ముసలాడి దృష్టిలో పడటం పెద్ద షాకు. ఏం చెప్పాలో తెలీని అసహ్యమైన పరిస్థితి.

"అబ్బే...లేదండీ. మా ఫ్రెండ్ వస్తా నంటేను" అంటూ నీళ్లు నమిలాడు.

"అదా సంగతి. పోస్టాఫీసుకెళ్ళి డబ్బులు పట్టమ్మని పంపించింది. అక్కడికీ చెప్పా 'నావల్ల కాదమ్మా, నడప లేను... నువ్వే వెళ్ళి తెచ్చుకో' అన్చెప్పి. ఊహూ...వింటేనా మహా మొండిది. ఛస్తే అక్కడున్నవాళ్ళ వెధవ మొహాలు చూడనంది. తప్పదని బయల్దేర వచ్చా" అంటూ అతడి మొహంలో వచ్చిన మార్పుల్ని వింతగా గమనిస్తున్నారు.

ప్రకాశానికి బాధ వేసింది. ఆమె మైన కాస్త కోపం కూడా వచ్చింది. ఫూలయినట్లు చిన్నతనంగా అనిపించింది. అక్కణ్నించి వెళ్ళిపోవాలనిపించింది.కాని ముసలాయనకి ఎక్కడ అనుమానం వస్తుందోనని, అలాగే పిచ్చి చూపులు చూస్తూ నిల్చున్నాడు.

తాతగారు లోనికెళ్ళి అక్కడి సూపరింటెండెంటుతో మాట్లాడి పది నిమిషాల తర్వాత వెళ్ళిపోతూ, "వస్తానోయ్!మొత్తానికి మంచి ముండాకొడుకులే. నిజాయితీగా డబ్బులిచ్చేరు. వస్తా...పాపం నీ ఫ్రెండ్ ఇంకా వచ్చినట్టు లేదు" అనుకుంటూ ఇంటిదారి పట్టేరు.

అయిదు నిమిషాలాగి అతడు కూడా పక్కనే వున్న బస్సుస్టాపు వైపుగా కదిలేడు. ప్రసూన గురించి ఆలోచనలకి స్వస్తి చెప్పాడు.

ఆ మర్నాడు ఆమె ఫోన్చెయ్యకుండా వుండివుంటే, ప్రకాశం ఆమెని పూర్తిగా మర్చిపోయేవాడు.

కాని, ఆ మర్నాడు ఆఫీసుకెళ్ళి, కాష్కౌంటర్లో కూర్చున్నాడోలేదో, ఆఫీసు ప్యూనొచ్చి ఫోనొచ్చిందని చెప్పాడు.

నిజానికి ప్రసూనని వూహించనుకూడా లేదు. అంచేత ఎవరై వుంటారబ్బాని ఆలోచిస్తూ ఫోన్ అందుకున్నాడు.

"హలో... ప్రకాశం హియర్"

"నేను" ఆడగొంతు.

"అంటే?"

"చెప్పుకోండి చూద్దాం"

ప్రకాశానికి ఫోన్లో మాట్లాడటమే కొత్త. వాటిల్లో గొంతులు పోల్చగలిగేటంత అనుభవజ్ఞుడు అసలేకాదు. అయినా ఆలోచించాడు.

"ప్రసూనగారా?"

"కరక్ట్... నేనే" గలగలమని నవ్వు. గాజుల రవళి.

నిన్నటి సన్నివేశం, తనకు కల్గిన కోపం మళ్ళీ గుర్తుకొచ్చాయి. అయినా బయటపడిపోతే బాగుండదని తమాయించుకున్నాడు.

"ఏమిటి...ఏం మాట్లాడరేం?" అంది ప్రసూన అవతలినించి.

"ఏం మాట్లాడాలో అర్థంకాకుండా వుంది"

"నిన్న యాభై రూపాయలు పోస్టాఫీసు వాళ్ళిచ్చేసారు"

"అవును. తాతగారు చెప్పారు"

"అంటే...ఆ సమయానికి మీరు అక్కడ వున్నారా?"

"అవును. అయిదింటిపరకు, అక్కడెండలో నిల్చున్నాను"

"దేనికి .... ఎవరికోసం?"

ప్రకాశానికి ఒకే ఒక క్షణం సందిగ్ధం అనిపించింది. నిజం చెప్పెయ్యటమా, లేదాని. నిన్నటి కోపాన్ని ఎలాగైనా వెళ్ళగక్కేస్తేనేగాని, హాయిగా వుండదనిపించింది.

"మీ కోసమే. నే వచ్చేస్తుంటే మీరన్న మాట విని, మళ్లీ వస్తారని అక్కడే నిల్చున్నాను. కాని తాతగార్ని పంపేరు... థాంక్స్" అన్నాడు కసిగా. ఆ మాట అనేశాక హాయిగావుండనిపించింది.

అవతలవైపు రెండు క్షణాల మౌనం. ఆపైన మెల్లిగా అంది–

"చూసేరా. మా తాత ఎన్ని తంటాలు తెచ్చేడో అక్కడ మిమ్మల్ని కల్సి మాట్లాడి కూడా ఇంటికొచ్చి డబ్బులిచ్చాడేగాని విషయం చెప్పలేదు. పైగా అక్కడ ఒక్క పిట్టకూడా లేదని రెండుసార్లు చెప్పాడు"

ప్రకాశానికి ఆమెపైన గౌరవగానే వుంది.

"అసలు నేనే వద్దామని బయల్దేరాను. కాని మా తాతగారు కాదని ఆయనొచ్చాడు. సారీ...ఏం అనుకోవద్దు"

ప్రకాశానికిప్పుడు కోపంపోయి సంతోషంగావుంది.

"అబ్బే ... ఏం పర్వాలేదండి" మొహమాటపడిపోయాడు.

మళ్లీ ప్రసూన అంది–

"ఇంతకీ ఎందుకు ఫోన్చేశానంటే... నిన్న మీకు రూము కావాలన్నారుగా... వెతికాను"

"ఎక్కడ...? అద్దెంత? వసతిగా ఉంటుందా?"

"అవన్నీ ఇపుడు చెప్పం...సస్పెన్స్. రేపు సాయంత్రం సరిగ్గా ఆరుగంటలకి మా ఇంటికొచ్చెయ్యండి"

ఫోన్ పెట్టేసినట్లు శబ్దం.

అక్కణ్నించి తన సీటుపరకు ప్రకాశం భూమ్మీద నడిచి వెళ్ళలేదు. గాల్లో తేల్తూ వెళ్ళాడు. అప్పటికే సంభాషణంతా విన్న కొలీగ్స్ అతడివంక అదోలా చూసేరు. అయినా అతడు అవన్నీ పట్టించుకుని ఆలోచించే స్థితిలో లేడు.

ప్రసూనేమిటి..తనకి గదిచూసి పెట్టటమేమిటి? నిన్న ఏదో మాటవరసకంటే అప్పుడే తెల్లవారేసరికి గదిచూసేసిందంటే తనంటే ఎంత అభిమానం వుండాలి. కట్టుకున్న పెళ్లామో, కన్నతల్లో కూడా అంత ప్రాంప్టుగా చూడరే! అందే ప్రసూన తనని....

ప్రకాశానికి సంతోషంతో రక్తం వుప్పొంగింది. వొళ్ళు వెచ్చబడింది. ఆరోజు, ఆ మర్నాటి పగలు ఎలా గడిచాయో అతడికే తెలీదు.

ఆఫీసునించి పావుగంట ముందే బయల్దేరాడు. బస్సుల కోసం నిల్చుంటే టైముకందుకోలేమని ఆటో పిల్చి ఎక్కి కూర్చున్నాడు.

వాళ్ళింటికి కాస్త దూరంలోనే ఆటో నాపి, డబ్బులిచ్చి పంపించి వేగంగా నడుస్తూ వెడుతుండగా, చటుక్కున ఒక ఆలోచనొచ్చింది.

ముసిలాడు కొంపలో వుంటే? ఎందుకొచ్చావంటే ఏం చెప్పాలి? ప్రసూన ఇంట్లో వుంటే సరే...లేకపోతే?

నడుస్తున్నవాడల్లా ఆ ఆలోచన రావటంతో ఆగాడు.

అసలు తనని ఫూల్ చెయ్యటానికిగాని ఇలా చెయ్యలేదుగదా? ప్రసూనకేమిటవసరం... అలా ఎందుకు చేస్తుంది? దానివల్ల ఆమెకేమిటి ప్రయోజనం? చిన్నతనం చేష్ట కావచ్చుగా.

ప్రకాశం ఎటూ తేల్చుకోలేకపోయాడు. పోనీ తిరిగి తాపీగా వెళ్ళిపోదామంటే, ఎక్కడో మూల చిన్న ఆశ, బలహీనత ఆమెని చూడాలని. ఇంకా రెండడుగులు వేస్తే ఇల్లు. ఎడతెగని ఆలోచన్లు...

చివరికి ఏదో నిర్ణయించుకున్నవాడిలా ఆ రెండడుగులువేసి ఇంటినిసమీపించాడు.

పెద్ద రేకు గేటు వేసుంది. దానికున్న చిన్న తలుపుని నెట్టి లోపలికి అడుగెట్టి తలెత్తి ఇంటివైపు చూశాడు.

అనుకున్నంతా అయింది. ముసలాయన పడక్కుర్చీలో ఎవరికోసమో ఎదురు చూస్తున్నవాడిలా గేటువంక చూస్తూ కూర్చున్నాడు.

ప్రకాశానికి గుండాగినంతపనయింది. వెనక్కి తిరిగి పరిగెత్తి వెళ్ళిపోదామనిపించింది. కాని అప్పటికే ముసలాయన చూశాడు. పారిపోతే తప్పు చేసిన భావం స్ఫురిస్తుంది. ప్రసూన జాడ ఎక్కడా లేదు.

అంతలో ఆ ముసలాయన "ఎవరది?" అన్నాడు - కళ్ళు చిట్లించి చూస్తూ. ప్రకాశం ఒక నిర్ణయానికొచ్చేడు. ఈసారికి ఏదో ఒకటి చెప్పి బయటపడి మళ్ళీ ఎప్పుడన్నా ఆమె ఫోన్ చెయ్యటం లేదా కనపడటం లాంటిది జరిగితే చెడామడా మాటలనెయ్యాలి... అని.

"నేనండీ.... ప్రకాశరావుని" రెండు అడుగులు ముందుకేస్తూ అన్నాడు.

ఆ మాట వినగానే ముసలాయన కుర్చీలోంచి చువ్వలా లేచి రెండడుగులు ముందుకొచ్చేడు.

"నువ్వటోయ్... రారా. నీ గురించే ఎదురుచూస్తున్నా. అయిదున్నరకే వస్తానన్నావుటగా... రాలేదేం?"

ప్రకాశానికి అనుమానం వేసింది- అసలు తనని గుర్తు పట్టాడాని? ఎవరనుకుంటున్నాడోనన్చెప్పి "నేను...ప్రకాశరావునండీ! నిన్న మీ ప్రసూనకి..."

"అంతా తెల్సులేవోయ్... అసలు ముందిలా వచ్చి కూర్చో" అంటూ ఇంకో రెండు మెట్లు దిగి కిందికొచ్చి అతడిని చెయ్యి పట్టుకుని పైకి తీసుకెళ్ళారు.

ప్రకాశానికంతా అయోమయంగా వుంది. పిల్చి రమ్మన్న ప్రసూనేది? నిన్న మొహం మాడ్చుకున్న ముసలాయన ఏవిటిలా ఆనందంతో పేట్రేగిపోతున్నాడు. ఏవీ అర్థం కాకుండావుంది.

ప్రకాశరావుని కుర్చీలో కూర్చోపెట్టి తనూ కూర్చుంటూ-"అమ్మాయ్ప్రసూనా! ప్రసూనా..."- అంటూ పిలిచాడు.

ప్రకాశరావు గుడ్లప్పగించి చూస్తున్నాడు.

లోపల్నించి ప్రసూన వచ్చింది. వచ్చి గుమ్మం దగ్గిరే ఆగింది. "ఏవిటి... పిల్చారా?"

"ప్రకాశం వచ్చాడమ్మా"

"అయితే ఏవిటంటారు?" ఆమె మొహంలో విసుగు.

"కాస్త కాఫీ పట్రా"

ప్రసూన మొహంలో విసుగేమిటి... ఈయనకీ వెర్రి ఆనందమేమిటి? భగవాన్....ఏవిటీ చిద్విలాసం.

ప్రసూన అక్కడే నిల్చుంది.

"అవునోయ్... నిన్న వచ్చావుగదా,

సదానందశాస్త్రి కొడుకునని కనీసం మాట వరసకైనా చెప్పలేదే?''

"సదానంద శాస్త్రి... ఆయనెవరంటే బాబు..." అయోమయంగా అన్నాడు.

"మా పిల్ల అంతా చెప్పిందిలేవోయ్! తండ్రితో ఎంత అభిప్రాయ భేదాలున్నా అలా పేరడిగితే ఎవరనకూడదు... ఎంతైనా తండ్రిగదా"

''ఏమిటండీ మీరనేది?" అని ప్రకాశం అంటుండగా గడపదగ్గర్నించి ప్రసూన,

''చూడండి! మీకు కాఫీలో షుగరెక్కువ వెయ్యాలా?" అనడిగింది.

ప్రకాశం తల తిప్పి ఆమె వైపు చూశాడు.

ప్రసూన కళ్ళతోనే ఏదో చెప్పింది. ఏంచెప్పిందో అర్థంకాలేదు. కాని ఇందులో ఏదో తిరకాసుంది. అంచేత తొందరపడ కూడదని మాత్రం అర్థమైంది.

"శాస్త్రీ, నేను ఎంత గొప్ప స్నేహితులమో నీకు తెలీదు. అయినా నా పేరు మీ నాన్న ఎప్పుడూ చెప్పలేదూ?"

"చెప్పారండీ... చాలా గొప్పగా చెప్పారండి"

"నిన్న నువ్వొచ్చినపుడు నిజం చెప్పొద్దూ...ఎవడో జులాయి వెధవను కున్నా. తీరా నువ్వెళ్ళాక అమ్మాయి తీరుబడిగా చెప్పింది...నువ్వు ఫలానా అని. అప్పట్నించి నీ గురించే ఎదురుచూస్తున్నా నంటే నమ్ము"

అంతలో ప్రసూన కాఫీ గ్లాసు తెచ్చి, తాతగారికిచ్చింది. "అదేవిటమ్మా ... అబ్బాయికియ్యి. ఇపుడు మనకి చాలా కావాల్సినవాడమ్మా ... రాత్రి చెప్పాను కదూ" అన్నారాయన.

మళ్ళీ ఇటుతిరిగి "అవునూ...మీ నాన్న పోయి ఎంత కాలమయిందీ?" అని ప్రశ్నించాడు ప్రకాశాన్ని.

'ఏమో ... తెలీదండి' అనబోయి తమాయించుకుని "పోయి దాదాపు...." అంటూ ఏదో ఆలోచిస్తున్నట్లు మొహం పెట్టేడు.

"మూడేళ్లయి వుంటుంది. ఎందుకంటే రెండేళ్ళక్రితం పొలం అమ్మాలని మీ వూరు వస్తే అప్పటికి శాస్త్రి పోయి ఏడాది అయిందన్నారు"

"అవునండీ''

"అవునూ...నువ్వెన్నోవాడివి?''

''ఎవరికండీ?" అయోమయంగా అడిగాడు.

''ఎవరికండీ ఏవిటోయ్...మీ నాన్న సంగతి చెప్పేసరికి మనసు పాడైనట్లుంది. మీ నాన్నకి నువ్వు ఎన్నో సంతానం అని అడుగుతుంట"

"ఓ.. అదా! నాలుగోవాణ్నండి" శాస్త్రి గారన్నాడుగాబట్టి పిల్లలు దండిగానే వుండుంటారని చీకట్లోకి రాయి విసిరేడు. కాని అది గురి తప్పింది.

"అదేమిటోయ్...వాడికి ముగ్గురేగా మొగపిల్లలు"

ప్రసూన కోపంగా, చిరాగ్గా చూసింది ప్రకాశం వేపు.

"ఆడా మగా కలిపి చెప్పానండి''

"ఆడా...అసలు వాడికి ఆడపిల్లలు లేరనిగదా దిగులుపడేవాడు"

ప్రకాశానికి నిజంగానే దిగులేసింది. ఎలా చెప్పాలో అర్థం కాలేదు.

"తాతయ్యా...శాస్త్రిగారికి మొదట్లో ఆడపిల్ల పుట్టిపోయిందని చెప్పావుగా" మాట అడ్డంవేసింది.

"అవును...పోయింది. అయితే?"

ప్రకాశానికి వూపిరొచ్చింది.

"మా నాన్న అంటూ వుండేవాడండి-

అది పోయినా లెక్క లెక్కేనని. ఎవరన్నా ఆయన్ని పిల్లలెంతమందని అడిగితే నలుగురని చెప్పేవాడు. మమ్మల్నీ అలాగే చెప్పమనేవాడు"

"అదా సంగతి. సరే...నీకు గది కావాలన్నావుటగా. వెనకాల బ్రహ్మాండమైన రెండు గదుల ఇల్లుంది. పైన రేకులనుకో. ఫర్వాలేదంటే వచ్చిచేరిపో. అద్దెగూడా ఇవ్వక్కరలేదు. వూరికే వుండు."

ప్రకాశం సంతోషపడిపోయేడు.

"రేకులకొంపలంటే నాకు చాలా ఇష్టమండీ"

''అసలు ముందు ఇల్లు చూసుకో. నచ్చుతుందో లేదో. పెద్ద ఫామ్లీనుంచి వచ్చినవాడివి'' అని ఆయన కుర్చీలోంచి లేచి ప్రసూనతో, "అమ్మాయ్...నేనలా గుడిదాకా వెళ్ళొస్తాగాని అబ్బాయికి ఆ ఇల్లు చూపించు" అంటూ చెప్పులు తొడుక్కుని గేటుదాటి బయటికెళ్ళిపోయాడు.



ప్రకాశం, ప్రసూనలిద్దరూ ఆయన కనుమరుగయ్యేదాకా అలానే చూస్తూ వుండిపోయారు.

ఆ తర్వాత ప్రకాశం అన్నాడు, "చాలా సాహసం చేశారు"

"ఏవిటి?" అంది వస్తున్న నవ్వుని బలవంతానాపుకుంటూ.

"నన్ను శాస్త్రిగారబ్బాయిలా చెప్పటం"

"మా తాత విచిత్రమైన మనిషి. ఒక మనిషిపైన ఒక అభిప్రాయం ఏర్పడితే దాన్ని మార్చుకోడు. ఆ వ్యక్తి ఎన్ని అరాచకాలుచేసినా క్షమించేస్తాడు. సదానంద శాస్త్రిగారంటేఆయనకి వల్లమాలిన అభిమానం. ఎప్పుడూ ఏదో సందర్భంలో ఆయన గొప్పతనాన్ని గురించి చెబుతూ వుంటారు"

ప్రకాశం విచిత్రంగా మొహం పెట్టి వింటున్నాడు.

"శాస్త్రిగారికి పెళ్ళి కావాల్సిన కొడుకు కూడా వున్నాట్ట. మా నాన్నగారి ప్రాణం తీస్తుంటారు...నన్ను ఆ ఇంటి కోడలుగా చెయ్యమని''

"మీ నాన్నగారేమంటారు?" ఆత్రంగా అడిగాడు.

"అలాగేలెండి..ఆలోచిద్దాం అంటారు. మా తాత మనిద్దర్ని ఇలా వదలివెళ్ళ టానికి కారణం అదే! రేపుశాస్త్రిగారబ్బాయి నాతో అసభ్యంగా ప్రవర్తించాడనిచెప్పినా, ఏదో చిన్నతనం పోనిద్దూ అంటారు. గొప్ప కేరెక్టరు"

ప్రకాశం నిట్టూర్చి—

"ఇంకా నయం. ఆ శాస్త్రిగారు చచ్చిపోయాడు కాబట్టి మనం బతికిపోయాం?"

"అదేం?''

"లేకపోతే మీ తాతయ్యగారు నీ కొడుకు క్షేమంగా వున్నాడని ఉత్తరం రాశాడనుకోండి. ఒక ఫైన్ మార్నింగ్ ఆయన ఈ కొత్త కొడుకుని చూసు కోటానికి వచ్చుండేవాడు. అపుడు మనం చచ్చుండేవాళ్ళం"

ప్రసూన పగలబడి నవ్వింది.

"ఇంతకీ ఇల్లుచూసుకుంటారా?" అని అడిగింది నవ్వాపుకుంటూ

"వద్దులెండి. ఇంటి కోసం వచ్చేవాళ్ళు ఇల్లు చూసుకోవాలి. కాని నే వచ్చేది ఇంటి కోసం కాదుగా"

"మరి..." అర్థంకానట్లు మొహం పెట్టి అడిగింది.

"చెప్పెయ్యమంటారా? తీరా చెప్పాక కోపం వచ్చి మీ తాతగారికి నేనెవరో చెప్పేస్తే బావుండదు"

"మీరు ఏవేవో వూహించు కుంటున్నారు. ఇంత చిన్న పరిచయానికి అంత పెద్దాలోచనల్లు సబబు కాదు'' అంటూ కాఫీ తాగిన గ్లాసు తీసుకుని లోనికెళ్ళిపోయింది.

ప్రకాశానికి అర్థంకానట్లు అయోమయంగా చూస్తుండిపోయేడు.

* * *

పదిరోజులతర్వాత ప్రకాశం రూముని మార్చి రేకుల షెడ్డులో మకాం పెట్టేడు కాని ప్రసూన ఆంతర్యాన్ని అర్థం చేసుకోలేకపోతున్నాడు. కల్లాకపటం లేనట్లుగా కలివిడిగా మాట్లాడుతుంది గాని, ప్రకాశం చనువుగా, చొరవగా ఏదైనా ఒక మాటంటే చివుక్కున లేచి వెళ్ళి పోతుంది. మళ్ళీ కాస్సేపటికి తనకు తానే వచ్చి పలకరిస్తుంది.

ప్రసూన తనని కేవలం స్నేహితుడి లాగానే చూస్తోందా? ఇంకా వేరే ఎటువంటి వుద్దేశం కాదా? తాతగారితో అబద్ధం ఆడి,

గది ఇప్పించటంలో గూడా అదే వుద్దేశమా? మరి తను అప్పుడప్పుడు కష్టంగా ఎందుకు మాట్లాడుతుంది? ఎందుకిలా ప్రవర్తిస్తోంది?

ప్రకాశం కళ్ళకి ప్రసూన పెద్ద పజిల్లా కన్పించింది.

అందువల్లనే ధైర్యం చేసి తన మనసులోని మాటని కూడా చెప్పలేక పోయాడు. తనలో తానే మధనపడ సాగేడు.

రోజులు గడుస్తున్నాయ్.

ప్రకాశం ఆఫీసుకెడుతున్నాడు ... వస్తున్నాడు.

సాయంత్రపూట ప్రసూనో, తాతగారో లేక ఇద్దరూనో అతడితో కబుర్లు చెబుతారు. కాస్సేపటికి వెళ్ళి హోటల్లో భోజనం చేసి వస్తాడు. కాస్సేపు ఏదో పుస్తకం చదువుకుని పడుకుంటాడు. తిరిగి తెల్లవారి మామూలే.

జీవితం బరువుగా, భారంగా, పళ్ళ చక్రంలో బిగించి పరిగెత్తిస్తున్నట్లు భావన. ఇంతటి యాంత్రిక జీవితంలోను, ప్రసూనని చూడటం, ఆమెతో మాట్లాడటం పెద్ద రిలీఫ్. ఇరవైనాలుగు గంటలకాలంలో ఆ కొద్ది నిముషాలే సద్వినియోగం అయినట్లు నమ్మకం.

ఒకరోజు సాయంత్రం ప్రకాశం ఇంటికి చేరేసరికి ఆరు గంటలయింది.

ప్రసూన ఆదుర్దాగా గేట్లోనే ఎదురైంది. "మీకు టెల్గ్రాం" అంటూ అందించింది.

ప్రకాశం దాన్ని విప్పి చదవగానే మొహం వివర్ణం అయింది.

"ఏవిటీ... ఎవరిచ్చారూ?" ప్రసూన ఆదుర్దాగా అడిగింది.

"మా నాన్న. అమ్మకి ఒంట్లో బాగా లేదట. వెంటనే రమ్మని" అక్కడే చతికిలపడి రెండు చేతుల్తో తల పట్టుకుని కూర్చున్నాడు. కళ్ళ వెంట నీళ్ళు ధారల్లా కారుతున్నాయి.

"ఏడు గంటలకి రైలుంది. బయల్దేరండి" అంది ప్రసూన

ప్రకాశం కళ్ళు తుడుచుకుని లేచి నిల్చున్నాడు. తను బయల్దేరమనంగానే చువ్వలా లేచి నిల్చునేసరికి కంగారు పడింది. "వంటయింది... రెండు మెతుకులు తిని వెళ్ళండి"

ఆమె అనునయం, ఆప్యాయతలు హాయిగానే అనిపించినా అసందర్భం అవడంచేత పూర్తి ఆనందాన్ని అనుభవించలేకపోయాడు.




ప్రకాశం వెళ్ళేసరికి అమ్మ పరిస్థితి ఏం బాగాలేదు.

తను కడుపున పడ్డప్పట్నించి మొన్న ఉద్యోగంలో చేరేదాకా ఎన్ని అవస్థలు పడింది ఎన్ని అవమానాలు భరించింది, ఎన్ని త్యాగాలు చేసింది?

అటువంటి అమ్మ మంచంలోంచి మనశ్శాంతి కావాలని అడుగుతుంటే కాదని ఎలా అనగలడు? తనకి నచ్చిన పిల్లని చేసుకుంటేనే ఆవిడకి శాంతి లభిస్తుంది. కాదని మూర్ఖంగా అందర్నీ నొప్పించి వెళ్లగలడు. ఆమాత్రం మానసిక ధైర్యం లేకకాదు. కాని తీరా అక్కడికెళ్లాక

ప్రసూన తనని ప్రేమించలేదంటే? ఆ దృష్టితో చూడలేదంటే??

రెంటికీ చెడ్డవాడు అవడా? ఏం చెయ్యాలి??

అప్పటికే కామాక్షమ్మగారిని ఆసుపత్రిలో చేర్చి పది రోజులైంది. పరిస్థితిలో మార్పులేదు. ఒళ్లు కాస్త నీరు పట్టింది. కొంతకాలం ఆవిడ లేచి తిరగలేదని డాక్టర్లు చెప్పారు. ఇంకా కొన్నాళ్లు అక్కడుండాలని కూడా అన్నారు.డాక్టర్లు చెప్పినట్లు వుంచాలనే అనుకున్నారు.కాని-

ఆ రాత్రే ఆ వూళ్లో అగ్నిప్రమాదానికి దాదాపు రెండువందల గుడిసెలు బూడిదయిపోయినాయి. ఆ ప్రమాదం రాత్రిపూట జరగటంతో దాదాపు అరవై మందికి ఒళ్ళు కాలిపోయింది. వాళ్లల్లో మొగాళ్ళు, ఆడవాళ్లు, పిల్లలు- అందరూ వున్నారు.

వాళ్లందర్నీ ప్రభుత్వ ఆసుపత్రికి చేర్చారు. ఆ వూరి ఆసుపత్రిలో తక్కువ మంచాలున్నాయ్. రోగాలతో పాటు, రోగులతోపాటు ఆసుపత్రి అభివృద్ధి పొందలేదు.

ఆరోజు ఒక్కసారి అరవైమంది వచ్చిపడేసరికి అక్కడ తొక్కిసలాటై పోయింది. అరుపులూ, కేకలూ,ఏడ్పులూ ఒక్కసారిగా అక్కడి వాతావరణం భయంకరంగా తయారైంది.

అయినా సాధారణంగా ప్రభుత్వాసుపత్రిలోని డాక్టర్లు పట్టించుకోరు. కాని ఆరోజుకి ఆ వూళ్లో క్యాంపు చేస్తున్న మంత్రిగారు ఈ వార్త విని గాయాలు తగిలిన వాళ్లని పరామర్శించటానికి, ఫొటోగ్రాఫర్‌తోసహా వస్తున్నారని వార్త.

అది విన్న డాక్టర్లకి వేడిపుట్టింది.

అప్పటికప్పుడు మంచాలపైనున్న పాత రోగులని వరండాల్లోకి చేర్చేరు. కొత్తవాళ్లందర్నీ ఆ మంచాలపై పడుకోపెట్టి ఇస్త్రీ దుప్పట్లు కప్పేరు.

ఆ వుదయం ప్రకాశం ఆసుపత్రికి వెళ్ళేసరికి కామాక్షమ్మగారు వరండాలో పడుకునుంది. శరీరంపై దుప్పటి లేదు. తెల్లటి బ్యాండేజీపై ఈగలు ముసురుతున్నాయ్. కటిక నేలపై పడుకునుంది.

తల్లిని అక్కడ ఆవిధంగా ఆ పరిస్థితిలో చూశాక ప్రకాశానికి ఏడుపాగిందికాదు. పక్కనున్నవాళ్లు జరిగింది చెప్పారు. క్రితం రాత్రి అరవింద తలనొప్పిగా వుందని ఇంట్లోనే పడుకుంది.

గత రాత్రంతా చలిలో, చీకట్లో, ఈగలు, దోమల మధ్య అలా వరండాలో తల్లి పడుందన్న సంగతి ప్రకాశాన్ని బాధించింది.

కామాక్షమ్మగారు కూడా ఇంటికి రావటానికి సుముఖత్వంగా వుండటంచేత ప్రకాశం డాక్టర్ని సంప్రదించేడు.

డాక్టరు మహదానందంగా తీసుకెళ్లమన్నాడు.

కామాక్షమ్మగారు ఇంటికొచ్చింది. ముందుగదిలో ఒక పక్కగా ఆవిడ మంచాన్ని ఏర్పాటుచేశారు.

అరవింద వంటపని చూస్తోంది.

ప్రకాశం ప్రతిరోజు ఆసుపత్రికెళ్ళి తల్లి పరిస్థితిని డాక్టరుకి చెప్పి మందులు తెస్తున్నాడు. సుబ్రమణ్యంగారు తన దినచర్యని యధావిధిగానిర్వర్తించుకుంటున్నారు. ప్రకాశం వచ్చేటప్పుడు వారం రోజుల సెలవు మాత్రమే అప్లై చేశాడు. కాని వచ్చి తల్లి పరిస్థితి చూసి మరో పది రోజులు పొడగిస్తున్నట్లు వుత్తరం రాసి పడేశాడు. ఇంకో నాల్గురోజుల్లో తిరిగి వెళ్ళాలి. ఈసారి తప్పదు.

కామాక్షమ్మ గారు ఇంటికొచ్చిన రెండు రోజులకే నర్సింహారావు భార్యకి వుత్తరం రాశాడు. అందులో తనకి నాల్గురోజుల్నించి జ్వరం వస్తున్నట్లు, చలి జ్వరంగా డాక్టరు చెప్పినట్లు, ప్రస్తుతం ఆఫీసుకి సెలవు పెట్టి ఇంట్లోనే వుంటున్నట్లుగా రాశాడు.

అది చదివి అరవింద ఏడుపు మొద లెట్టింది...వెళ్ళిపోవటానికని ప్రయాణం కట్టింది.

ప్రకాశం ఏం ఫర్వాలేదని ధైర్యం చెప్పాడుగాని, భర్త దగ్గరికి వెడతానంటుంటే కాదని ఎలా అనగలడు?

కాని సుబ్రమణ్యంగారనేశారు.స్వార్థం మనిషిచేత ఎన్ని పన్లు చేయిస్తుందో, ఎంతకు దిగజారుస్తుందో ఆయన్ని చూస్తే అర్థమవుతుంది. భర్త దగ్గరికి వెడతానన్న కూతుర్ని చూసి, విచిత్రంగా ఆయన విసుక్కున్నారు, కోపగించుకున్నారు. 'జలుబు, జ్వరానికి కూడా అంతగా బాధపడతావేమిట'ని మండి పడ్డారు.

వాళ్ళ ప్రవర్తన చూసేక అరవిందకి మరింత పౌరుషం, కోపం పుట్టుకొచ్చాయి. ససేమిరా వెళ్ళిపోవాల్సిందేనని పట్టు పట్టింది.

ప్రకాశం కలుగజేసుకుని అరవిందని బస్సెక్కించాడు.

ఇంట్లో ఆడదిక్కులేదు. వంటా వార్పూ, మంచీ చెడూ తండ్రీ కొడుకులే చూసుకోవాలి. మంచంలోంచి కామాక్షమ్మ గారి ఏడుపు.

ప్రకాశానికంతా అసహనంగా, అశాంతిగా అన్పిస్తోంది.

రేపు తనూ వెళ్ళిపోతే ఎలా? తండ్రి తెల్లవారితే తన పనిమీద తాను వెడతాడు. తల్లి మంచంలో కదలలేనిస్థితిలో ఒక్కర్తే! చూసే దిక్కెవరు? పలకరించే వాళ్ళెవరు??

ఆలోచించినకొద్దీభయంగాఅన్పించింది.

సుబ్రమణ్యంగారు ఆరోజే పెద్ద పిల్లకి పదిరోజులుండేటట్టుగా రమ్మనమనివుత్తరం రాసిపడేశారు.

ఎవరు మాత్రం తమ కాపురాలని, మొగుళ్ళని వదలి దూరంగా చాకిరీచేస్తూ పడుంటారు.

ఈ సమస్యకి శాశ్వతపరిష్కారం... ప్రకాశం పెళ్ళి.

అరవింద వెళ్ళిన మర్నాటి వుదయం ప్రకాశమే వంట చేశాడు. పుట్టి బుద్ధి తెల్సాక ఎప్పుడూ గరిట తిప్పిన అనుభవంలేదు. కాని వూహాజ్ఞానంతో వంట పూర్తిచేశాడు ఆ పూటకి. వంటపని చేత వుదయం డాక్టరు దగ్గరికి వెళ్ళటం కుదరనికారణాన, మధ్యాహ్నం మూడింటికి ఆసుపత్రికెళ్ళి డాక్టరుతో మాట్లాడి, అక్కణ్నించి బజార్లోకెళ్ళి మందులుకొని, ఇంటికి తిరిగొచ్చేసరికి, అతడికి చాలా విచిత్రమైన దృశ్యం కంటపడింది.

ముందు గదిలో తండ్రి, ఆయనకన్నా కాస్త దూరంలో ఇంకో నడివయసు మనిషి... ఇద్దరూ కుర్చీల్లో కూర్చుని, రోగాలని గురించి, డాక్టర్లని గురించి,ఆసుపత్రులని గురించి చాలా సీరియస్‌గా మాట్లాడుకుంటున్నారు.

కాని ప్రకాశాన్ని ఆశ్చర్యపరిచింది- మాట్లాడుకుంటున్న వాళ్లు కాదు... లోపల వంటగదిలో చాలా హుషారుగా, చలాకీగా బొంగరంలా అటూ ఇటూ తిరుగుతూ వంటచేస్తున్న ఆ పిల్లని చూసేక.

ప్రకాశాన్ని చూడగానే తండ్రి "వచ్చావురా... రా" అని పక్కన

కూర్చున్న పెద్దమనిషితో, "ఇదే మా అబ్బాయి.. పేరు ప్రకాశరావు" అని, మళ్ళీ కొడుకువైపు తిరిగి, "వీరు నాగభూషణం గారని, ఈవూళ్ళో అసిస్టెంట్ ఇంజనీరు. నర్సింహారావుకి దూరపు బంధువులు" అన్నారు.

నమస్కారాలు, ప్రతినమస్కారాలు అయ్యేక ప్రకాశం తల్లి మంచం వారగా కూర్చున్నాడు.

నాగభూషణంగారు ప్రకాశం వంక గుచ్చి గుచ్చి చూస్తున్నారు. బహుశా వాళ్ళమ్మాయిని అతడి పక్కన వూహించుకుని, ఎలావుంటుందాని ఆలోచిస్తున్నట్లుగా వున్నాయ్ ఆయన చూపులు.

పలకరింపులు, ప్రశ్నలు, ముక్తసరి సమాధానాలు అయ్యేక ఆయన లేచి నిల్చుని "సరే... నేవస్తానండీ!మీ భోజనాలయ్యేక అమ్మాయిని రిక్షా ఎక్కించండి" అని లోపలవున్న కూతుర్ని, "అమ్మడూ.. అమ్మడూ" అంటూ పిల్చేరు.

ఆ అమ్మడొచ్చి అవతలగది తలుపు వారగా నిల్చుని తలని మాత్రం బయట పెట్టింది.

"చూడమ్మా ... నేవెడుతున్నా! వాళ్ళకి భోజనాలు కూడా వడ్డించి, రిక్షా ఎక్కి వచ్చెయ్. ఏం భయం లేదుగా"

లేదన్నట్లుగా తలూపింది అమ్మడు.

సుబ్రమణ్యంగారు నొచ్చుకుంటున్నట్టు "ఛెకు, మీపిల్లకి శ్రమిచ్చాం. క్షమించాలి. ఏం చెయ్యను చెప్పండి" అన్నారు.

ఆయన "అదేవిటండి బావగారూ ... అలా అంటారు. అది మీ పిల్ల. మీ ఇష్టం. ఆడపిల్లలంతా పెళ్ళయ్యేక అత్తవారిళ్ళకెళతారు. కాని మా అమ్మడు పెళ్ళి కాకుండానే ఎడ్వాన్స్‌గా అత్తవారింటికొచ్చేసింది" అని జోక్‌లా నవ్వేరు.

అప్పుడుగాని అర్థం కాలేదు ప్రకాశానికి-ఆమెవరో.

సుబ్రమణ్యంగారు ఆయనని సాగనంపుతూ చివరగా-"మూడొంతులు రేపు మా పెద్ద పిల్ల రావచ్చు. వస్తే ఏదిగులూ వుండదు" అన్నారు.

అందుకాయన, "దాని గురించి వర్రీ కాకండి. మనలో మనకి పట్టింపులేవిటి? అయినా మా పిల్లకి కూడా మీ ఇంట్లో కాస్త చొరవ, చనువు ఏర్పడతాయిగదాని పంపేను. లేకపోతే నా భార్యే వచ్చుండేది" అనేసి వెళ్ళిపోయారు.

ప్రకాశం అలానే తల్లి పక్కన కూర్చున్నాడు. కామాక్షమ్మగారి మొహం సంతోషంతో వెలిగిపోతోంది. కొడుకు వంక ఆశగా చూస్తోంది.

తండ్రి వెళ్ళిపోయాక ఆ పిల్ల చీపురు తీసుకుని గదులన్నీ వూడ్చేసింది. ఇల్లంతా నీటుగా సర్దింది. ప్రకాశం విప్పిన చొక్కాలని హేంగర్స్‌కి పెట్టి స్టాండులో పెట్టింది. సుబ్రమణ్యంగారి పంచెల్ని, కామాక్షమ్మగారి చీరలని అందంగా మడతలు పెట్టింది.

ప్రకాశం అంతా గమనిస్తూనే వున్నాడు.

మందుసీసా తెచ్చి కామాక్షమ్మగారి గొంతులో వేసి కాసిని నీళ్ళు పోసింది.

పనంతా పూర్తయ్యాక, ఏం చెయ్యాలో తెలీనట్టు వచ్చి తలుపు పక్కగా నిల్చుంది.

ఆ పిల్లని చూస్తుంటే ప్రకాశానికి జాలేసింది. ఆశ్చర్యం వేసింది.

ఆడదానికి ఇది నాది అన్న అభిప్రాయం కలగ్గానే ఎంతటి శ్రద్ధ, ఆప్యాయతలు పుట్టుకొస్తాయ్! రేపు తను ఈ ఇంటికే కోడలుగా రాబోతున్నానన్న విషయం తెలియబట్టే గదా ఆమె కింత శ్రద్ధ.

రేపు ఒకవేళ దానికి భిన్నంగా జరిగితే ఆ పిల్ల ఏం అనుకుంటుంది? ఆ పిల్ల తనకి నచ్చాలని రూలేమిటి? నచ్చుతుందిలే నన్న వీళ్ళ ధీమా ఏమిటి??

అన్నీ ప్రశ్నలే!

ప్రకాశానికి అలా కూర్చోటం ఇబ్బందిగా అనిపించి,లేచి బయటకెళ్ళబోయాడు. వెంటనే తండ్రి అందుకున్నారు-"నీకోసరం కని పెట్టుక్కూర్చోటానికింకా పెళ్ళి కాలేదు. మనం త్వరగా భోజనం ముగిస్తే ఆ పిల్ల వెళ్ళిపోతుంది"

ప్రకాశం బయటికెళ్ళే వుద్దేశాన్ని వాయిదావేశాడు.

కాని లోపల్లోపల బాధగా వుంది. ఎందుకు వీళ్ళంతా ఆమెని తన భార్యగా చిత్రించేస్తున్నారు? తన ఇష్టాయిష్టాలతో పన్లేదా? ఏవిటీ విచిత్ర పరిస్థితి! అసలు తన మనసుని ఆ వైపు మరల్చటానికిదో పథకమా?

ఏదీ అర్థంకాకుండా అయోమయంగా అనిపించింది.

తండ్రీ కొడుకులు భోజనానికి కూర్చున్నారు.

ఆమె వడ్డన చేస్తోంది.

ప్రకాశం వద్దకొచ్చేసరికి బెరుకుగా వున్న పదార్థాన్నంతా అతడి పళ్ళెంలోకి వంపేస్తోంది.

"అబ్బే...వద్దండి..చాలండి" అంటున్నాడతను మొహమాటంగా.

సుబ్రమణ్యంగారికి మహా ఆనందంగా వుంది. గొప్ప థ్రిల్లుగా వుంది. చెప్పనలవి కాని అనుభూతి కల్గుతోంది.

"అందీ గిందీ ఏవిట్రా...నీక్కాబోయే పెళ్ళాం" అన్నారు.

ప్రకాశం సిగ్గుపడ్డాడు. అర్ధాకలితో లేచాడు.

సుబ్రమణ్యంగారు ఆమెతో, "నువ్వు భోంచేసి వెళ్ళమ్మా" అన్నారు.

"వద్దండీ...మావాళ్ళు ఎదురుచూస్తుంటారు" అంది భయంగా.

ఆయన మరి ఆ విషయం గురించి ప్రస్తావించలేదు.

ఆమె ప్రయాణమయింది. ముందు కామాక్షమ్మగారికి చెప్పింది. ఆవిడ ఆ పిల్ల చెయ్యిపుచ్చుకుని,"జాగ్రత్తమ్మా! చీకట్లో ఒక్కదానివి వెళ్ళాలి" అంది ఆప్యాయంగా.

తర్వాత సుబ్రమణ్యంగారికి కూడా చెప్పింది. ప్రకాశం వంక ఒక్కక్షణం అదోలా చూసి, బయటకి అడుగుపెట్టింది.

"వెళ్ళి ఆ పిల్లని రిషా ఎక్కించిరా" అని పురమాయించారు.

ఆయనప్పటికే భార్య మంచంపక్కన సుఖంగా సెటిలయిపోయారు. తప్పదన్నట్లు ప్రకాశం చెప్పులు తొడుక్కుని ఆమెననుసరించాడు.

అప్పుడు చూసేడు ఆమెని పరీక్షగా, ధైర్యంగా.

ఇరవై రెండేళ్లుంటాయి. ఎర్రగా, నాజూగ్గా, అందంగా వుంది. కనుముక్కుతీరు గొప్పగా వుంది. పూర్తిగా వికసించిన యవ్వనంతో పుష్టిగావుంది.

ఇద్దరూ మౌనంగా పక్కపక్కనే నడుస్తున్నారు.

రిషా మాట్లాడాలంటే అడ్రసుకావాలి.

"మీ ఇల్లెక్కడ?"

"గాంధీనగరం"

"గాంధీనగరంలో ఎక్కడ?"

"నీళ్ళ టాంకు పక్కన"

ప్రకాశం రిషా పిలిచి బేరం కుదిర్చాడు. ఇందిర చెంగున ఎక్కి కూర్చుంది.

"వెళ్ళొస్తానండి" అంది అతడివైపు

సూటిగా చూసి నవ్వుతూ.

ప్రకాశం నవ్వక తప్పదు మరి.

ఇంటికి తిరిగొచ్చేసరికి తండ్రి అక్కడే తల్లి మంచం పక్కన పీటం వేసుక్కూర్చున్నాడు. వాళ్ళిద్దరూ కొడుకు పెళ్ళి గురించి చర్చలు జరుపుతున్నారు. పెళ్ళి ఏ స్థాయిలో చెయ్యాలి, ఎ వ రె వ ర్ని పిలవాలి, ఎవరెవరికి బట్టలు పెట్టాలి, ఎంతలో పెట్టాలి, పిల్లకి నగలునట్రా కింద ఎంత వెచ్చించాలి – మొదలైన అంశాల గురించి ప్లాన్స్ వేస్తూ, బడ్జెట్ తయారుచేస్తున్నారు.

ప్రకాశాన్ని చూడగానే వాళ్ళ సంభాషణ ఆగిపోయింది.

ఇద్దరూ అతనివంక అభిప్రాయమేమి టన్నట్లుగా చూసేరు.

వాళ్ళ చూపుల భావం అర్థమైనా అర్థంకానట్లు అక్కడే దూరంగావున్న కుర్చీలో కూర్చున్నాడు. కూర్చుని, "నేను వెళ్ళిపోవాలి" అంటూ ప్రకటించేడు.

"అప్పుడేనా ... వసుంధరొచ్చేదాకా వుండకూడదూ" అన్నాడు తండ్రి.

"సెలవులేదు..వెళ్ళకపోతే బాగుండదు"

వెంటనే కామాక్షమ్మగారందుకుంది.

"వెళ్ళనీండి ... ఉద్యోగానికి ముప్పు వస్తుందేమో"

సుబ్రమణ్యంగారు మరి ఆ విషయం గురించి మాట్లాడకుండా,

"సరే...ఇంతకీ ఆ పిల్ల ఎలావుంది?" అనడిగారు.

ఆ ప్రశ్ననాశిస్తున్న అతడు సమాధానం సిద్ధం చేసి ఉంచుకున్నాడు.

"ఏమో...ఆ విషయం గురించి ఇంకా ఆలోచించలేదు"

తల్లి అతడివైపు ఆశగా చూస్తోంది.

సుబ్రమణ్యంగారే మళ్ళీ అన్నారు–

"ఇపుడాలోచించి చెప్పొచ్చుగా"

ప్రకాశం ఆవేశాన్ని ఆపుకోలేక పోయాడు.

"అసలయినా పెళ్ళి కాకుండానే ఆ పిల్లని తెచ్చి ఇంటి చాకిరీ చేయించటం ఏమాత్రం బాగా లేదు" కటువుగా అన్నాడు.

"ఎందుకని?"

"అదేవిటి ... అలా అడుగుతారు. రేపు అనుకున్నట్టుగా జరక్క పోతే వాళ్ళేం అనుకుంటారు? ఎంత అ స హ్యం గా ఉంటుంది??"

కామాక్షమ్మగారు తండ్రీ కొడుకుల వంక మార్చిమార్చి చూస్తోంది నిస్సహాయంగా.

"ఓహో... అంటే ఆ పిల్లని చేసుకోవాలన్న వుద్దేశం లేదన్నమాట"

"చెప్పానుగా ఇంకా ఏ నిర్ణయం తీసుకోలేదని"

సుబ్రమణ్యంగారికి కోపం చర్రుమంది–

"ఏమిటోయ్...ఇందాకట్నించి చూస్తున్నాను–'నిర్ణయం తీసుకోలేదు.. నిర్ణయం తీసుకోలేదు' అంటావ్. పోనీ నిర్ణయం నువ్వూను. ఇంతకన్నా గొప్ప సంబంధం వస్తుందనా నీ వుద్దేశం?"

"అనవసరంగా ఆవేశపడకండి. సంబంధాల్లో గొప్పా పేదా అంటూ మీ దృష్టిలో వున్నాయేమో కాని నాక్కావాల్సింది వేరే వుంది. నా తూకం రాళ్ళు వేరు"

"నీ త్రాసుని, తూకం రాళ్ళని గంగలో కుక్కి అసలు విషయం చెప్పు. ఆ పిల్లని చేసుకుంటావా లేదా?"

అంతలో కామాక్షమ్మగారు కల్పించుకుంటూ–

"మంచి సంబంధం...పిల్ల లక్షణంగా

ఉంది. సాంప్రదాయకమైన కుటుంబం. ఆయన వెనకాల అండదండగా వుంటాడు. నీ మేలుకోరే మేం చెప్పేది"

"అవేవీ వాడికర్థం కావు. పిల్ల దీపంలా వుంది. చదువుకుంది. కావాల్సినంత కట్నం ఇస్తానంటున్నాడు. ఇంత కన్నా ఏంకావాలట? సినిమాస్టార్ కావాలేమో వెధవకి"

ప్రకాశానికి కోపం ఆగేటట్టులేదు. అక్కడుంటే పరిస్థితి చాలాదూరం పోతుందని లేచి లోనికెళ్ళి మంచం వాల్చుకు పడుకున్నాడు. అక్కడ తండ్రి అంటున్న మాటలు బాణాల్లాగా వినిపిస్తూనే వున్నాయి.

"అప్పుడూ అంతే...ఆ కొండర్రావు దగ్గిర ఉద్యోగం మానెయ్యరా అండే శ్రీరంగనీతులు చెప్పేడు. తర్వాత వాడికే తెలిసొచ్చింది"

"చిన్నతనం...వాడికి తెలీదు" తల్లి సమర్థింపు.



"చిన్నతనం కాదే.... మూర్ఖత్వం. చెప్పినపుడు వినాలి. పెద్దలు చెప్పేది మన మంచికేనని అర్థం చేసుకోవాలి"

తండ్రి మాటలు వినదల్చుకోలేదు. దుప్పటి తీసి మొహం నిండుగా ముసుగు పెట్టాడు. ఆ ముసుగులో గట్టిగా మనసులో అనుకున్నాడు-

'ప్రసూన సంగతి తేలేవరకు పెళ్ళి గురించి ఆలోచించే ప్రసక్తేలేదు' అని.

అనుకున్నట్టుగానే ఆ మర్నాడు ప్రకాశం ప్రయాణం కట్టేడు.

మధ్యాహ్నం పెట్టె సర్దుకుని, ప్రయాణమయి తల్లికి చెప్పాడు-

"వెళ్ళొస్తానమ్మా" అని.

కామాక్షమ్మగారు కళ్ళనిండా నీళ్ళు తెచ్చుకుంది. కొడుకుని తన పక్కనే కూర్చోమంది. ప్రకాశం కూర్చున్నాడు. కదలాలని ప్రయత్నించింది. కాని కదల లేకపోయింది.కొడుకు చేతిని అందుకుని-

"నీ గురించే నా దిగులు. మళ్ళీ నువ్వొచ్చేసరికి నేనుంటానో లేదో.." అంది.

ప్రకాశానికి కళ్ళు చెమర్చినాయ్.

"అవేం మాటలమ్మా... అలా అంటే నాకు బాధగా వుంటుంది"

కామాక్షమ్మగారు బాధగా కళ్ళ మూసుకుంది.

కళ్ళల్లో నీరు చెంపల పక్కలనించి జారి దిండుని తడిపేస్తున్నాయ్.

కాస్సేపటికి కళ్ళు తెరిచింది. బాధపల్ల కళ్ళు ఎర్రగా వున్నాయ్. కొడుకు చేతిని అలాగే పుచ్చుకునుంది.

"రాత్రి నాన్న అలా అన్నారని కోపం పెట్టుకోకు. ఆయన చెప్పే మాటలన్నీ నీ మంచికోసే. మాట కరుగ్గా వుంటుందిగాని,నువ్వంటే ఆయనకి వల్లమాలిన ప్రేమ.

ప్రకాశం ఏం మాట్లాడలేదు.

"ఇంటి పరిస్థితిని చూసి ఆయనలా పెళ్ళిచేసెయ్యాలని తొందరపడుతున్నారు. నువ్వెళ్ళాక నాకుగ్లాసుడు నీళ్ళుకావాలన్నా ఇచ్చే దిక్కులేదు. సరిగ్గా సమయానికి భగవంతుడు పంపినట్లు సంబంధం వచ్చింది. మంచివాళ్ళు, కాస్త సాయంగా వుంటారు.అలా అన్చెప్పి ఆ పిల్ల అనాకారి కాదు. లక్షణంగా వుంది. బాగానే చదువు కుంది కూడా. అన్నీ ఆలోచించే నాన్న నిర్ణయించారు. ఇందాకా వచ్చేక నువ్వు కాదంటే ఆయనకు కోపం రాదూ?"

ప్రకాశం అనునయంగా అన్నాడు-

"సరేమ్మా ... నే వెళ్ళి ఉత్తరం రాస్తాగా"

"బాగా ఆలోచించు. నీ నుంచి నేను ఆశించేది ఏదీలేదు. ఆ పిల్లని చేసుకుంటే నాకంతే చాలు"

"నువు దేన్ని గురించీ బాధపడకమ్మా! ఏది ఎలా జరగాలనుందో అలానే జరుగు తుంది. ఆరోగ్యం జాగ్రత్తగా చూసుకో... వస్తానమ్మా"

లేచి బయల్దేరాడు. నిజానికితల్లి చేతిలో కాస్తోకూస్తో డబ్బుంచాలనిపించింది. కాని తన వద్ద బొటాబొటిగా టిక్కెట్టుకి మాత్రం సరిపోను మిగిలినయ్. అస్వ మనస్కంగానే బయటకొచ్చాడు.

బయట సుబ్రమణ్యంగారు కొడుకు కోసం సిద్ధంగా నిల్చున్నారు.

"వెళ్ళొస్తా" అన్నాడు తండ్రితో మామూలు ధోరణిలో.

"నేను అందాకా వస్తా..పద" అన్నారు ఆయన.

ఇద్దరూ నడుస్తున్నారు. తోవలో ఆయనన్నారు-

"రాత్రి కోపంలో ఏదో వాగేశాను. మనసులో పెట్టుకోకే. ఇంటి పరిస్థితి చూస్తున్నావుగా. అది మంచంలోంచి లేవ లేదు. నేను మాత్రం పస్తు మానుకుని ఎంతసేపని కాపలా కూర్చోను? అలాఅని వెళితే చూసే దిక్కులేదు. అక్కయ్యకి ఉత్తరం రాసి నాల్రోజులైంది. మనిషి రాలేదు. కనీసం ఉత్తరం కూడా రాయలేదు"

తండ్రి చెప్పేవన్నీ నిజమేననిపించింది.

"అందుకే నీ పెళ్లి గురించి నాకింత తొందర. అంతకన్నా మరేంకాదు. నువ్వూ పెద్దవాడివయ్యావు. ఆలోచించు...అమ్మ సంతోషాన్ని, నా కష్టాన్ని, ఇంటి పరిస్థితిని దృష్టిలో వుంచుకుని మరీ ఆలోచించు"

"అలాగే. అమ్మకి చెప్పాను-వారం రోజుల్లో వుత్తరం రాస్తానని"

"అలాగే చెయ్యి. అన్నట్టు ఈ నెల నీకు వీలైతే ఓ వంద ఎక్కువ పంపించు. డబ్బు నీళ్లలా అయిపోతోంది"

"అలాగే. అమ్మని జాగ్రత్తగా చూసుకోండి"

బరువెక్కిన గుండెతో సుబ్రమణ్యం గారు, వేడెక్కిన బుర్రతో ప్రకాశం ఇద్దరూ చెరో వైపు వెళ్లారు.

* * *

ప్రకాశం రైలు దిగి రూముకి చేరేసరికి అప్పుడే తెలతెలవారుతోంది. గేటు తోసుకునిలోనికెళ్తేటప్పుడు ప్రసూన ఇంటి వైపుగా చూసేడు. అంతా చీకటిగావుంది. తలుపులు, కిటికీలు కూడా మూసేసు న్నాయ్. రూము తాళం తీసి సంచి అక్కడ పెట్టి పక్క పరుచుకు పడుకున్నాడు. నిద్ర పట్టింది.

లేచేసరికి ఎనిమిది.

ఆదరా బాదరాగా మొహం కడిగి స్నానం పూర్తిచేసి ఆఫీసుకెళ్లబోతూ వాళ్లింటివైపు చూశాడు.

ఇంటికి తాళం వేసుంది.

ఇంత వుదయాన్నే ప్రసూన ఎక్కడి కెళ్లుంటుంది? అర్థంకాలేదు. ఒకవేళ వాళ్ల తాతయ్య వెంట ఏ గుళ్లోకో వెళ్ళిందేమో! అని సర్దిచెప్పుకున్నాడు. ప్రసూనని పలుకరించకుండా వెళ్లాలంటే మనసొప్ప లేదు. కాస్సేపు ఎదురుచూద్దామనిపించినా ఆఫీసు టైము కావటంచేత వెళ్ళిపోయేడు.

సాయంత్రం ఇంటికి చేరేసరికి ఆరు.

గేటు తీసుకుని లోనికి అడుగు పెడు తూనే ఆ ఇంటివైపుగా చూసేడు.

ఇంటికి తాళం వేసుంది.

అప్పుడు అనుమానం వేసింది. భయం వేసింది. జరుగకూడనిది జరిగినట్లుగా బాధపడ్డాడు.

ఏమైంది? ఎక్కడికెళ్ళింది?? ఎవర్ని అడగాలి?

ఒంట్లో ఓపిక నశించినట్లు నిస్సత్తువుగా అక్కడే వాళ్ళ గడపలోనే కూలబడ్డాడు.

మనసంతా చికాగ్గా, విసుగ్గా, గందర గోళంగా వున్నట్లనిపించింది. ప్రసూన గురించి సమాచారం తెల్సేదాకా తనకి మనశ్శాంతుండదు. కాని ఎవర్నడగాలి? ఏమనడగాలి??

అర్థంకానట్లు తల పట్టుక్కూర్చుని ఆలోచిస్తుండగా ఒక్కసారిగా స్ఫురణ కొచ్చింది. అదే ఇంటికి నాలుగిళ్లవతల ప్రసూన క్లాస్‌మేట్ ఒకామె వుండాలి. తరచు ఆ ఇంటికెళ్తుండేది ఆమెనడిగితే?

ఆ ఆలోచన రావటంతోటే మెరుపు తీగలా లేచి గేటు దాటాడు.

ఆ ఇల్లు రోడ్డుమీదకే వుంది. తలుపు తీసేవుంది. ప్రసూన స్నేహితురాలు

ట్రాన్సిస్టర్ని ఒళ్ళో ఉంచుకుని వివిధ భారతిలో పాటలు వింటోంది.

ప్రకాశం గడపలో అడుగు పెట్టగానే అతన్ని గుర్తుపట్టింది.

"మీపేరు ప్రకాశరావుగదూ!రండి... ఇలా లోపలికి రండి" అంటూ సాదరంగా ఆహ్వానించింది.

ప్రకాశం లోనికెళ్ళి కుర్చీలో కూర్చున్నాడు.

"ప్రసూన వూళ్ళో లేదాండి?" మళ్ళీ అడిగాడు.

"లేదండీ...వాళ్ళ నాన్నగారి వూరు వెళ్ళింది"

"ఎప్పుడొస్తుంది?"

"ఏమో...తెలీదు. మొన్న వారంక్రితం వాళ్ళ తాతయ్యగారు గుళ్ళోకెళ్ళి తిరిగి వస్తుంటే ఆటోవాడు వెనకనించి గుద్దేడు. ఫ్రాక్చరయిందని డాక్టర్లు చెప్పారు. టెలిగ్రాం ఇస్తే వాళ్ళ నాన్నగారొచ్చి తండ్రిని, కూతుర్ని తీసుకెళ్ళారు"

తుపాకీని గుండెకెదురుగా పెట్టి కాల్చి నట్లనిపించింది. మనసులో ఆందోళనా తరంగాలు వువ్వెత్తున లేస్తున్నాయి.

"ఫలానప్పుడు వస్తానని మీకుగాని ఏమైనా చెప్పిందా ?" అతికష్టం పైన అడిగాడు.

"లేదండీ...కంగారు కంగారుగా వెళ్ళి పోయింది. ఆ ముసలాయన్ని ఆసుపత్రిలో చేర్చటం, వాళ్ళ నాన్న రావటం. రెండు రోజులు అసలు కన్పించలేదు. వెళ్ళే ముందు వెడుతున్నానని చెప్పి వెళ్ళింది.... అంతే!"

ప్రకాశం లేచి నిల్చున్నాడు. కదిలి గుమ్మందాటి వెళ్ళబోతూ, "అడ్రస్సుగాని ఇచ్చిందా?" అనడిగాడు.

"సారీ అండీ!అప్పుడు నా బుర్ర పని చెయ్యలేదు. అడగాలన్న ఆలోచనే రాలేదు"

అతడు బయటికొచ్చేసాడు. నడుస్తు న్నాడు. అడుగులు అతికష్టంపైన పడు తున్నాయ్. ఎన్నడూ లేనిది మొదటిసారి జీవితమంటే భయం వేసింది. ఎవరో పని గట్టుకుని పథకం ప్రకారం, తన జీవిత పథంలోంచి తనక్కావాల్సినవాళ్ళందర్నీ లాగేసుకుంటున్నట్లనిపించింది. ఎందుకిలా ప్రతిసారీ ప్రతి విషయంలోనూ తనకి నిరాశా, నిస్పృహలు ఎదురవుతున్నాయ్! ఇది శాపమా? తను శాపగ్రస్తుడా? శేష జీవితమంతా ఇంతేనా? ఈ బాధల్ని, గాయాల్ని స్మరించుకుంటూ బతికినంత కాలం అశాంతితో కుమిలిపోతూ బతక మని మొహాన్న రాసుందా?

తనకు తానే సమాధానపర్చుకుని ధైర్యం చెప్పుకోజూసేడు.

ఎందుకిలా తను బెంబేలు పడిపోతు న్నాడు? రేపు ప్రసూన రావచ్చు. పన్నీటి జల్లులాంటి కబుర్లు చెప్పి వెలుగురేఖలు నింపవచ్చు. తానమభవించిన వేదనంతా విని, నవ్వి 'పిచ్చి ప్రకాశం...నాకోసం అంత బాధపడ్డావా?' అన్చెప్పి వెచ్చటి ఆమె గుండెల్లో తనని దాచుకోవచ్చు. ఇంకేమైనా జరగొచ్చు. మానవ జీవితంలో ఏదీ అసాధ్యం కాదుగదా!

కాని వెంటనే అక్కడ ఇంటిదగ్గర పరిస్థితి, ప్రసూన మరిప్పట్లో వచ్చే అవ కాశం లేదన్న కఠినమైన వాస్తవం భళ్ళునచరిచినట్లు గుర్తొచ్చినాయి.

ప్రసూన వస్తుందన్న గ్యారంటీ ఏమిటి? పెళ్ళికాని పిల్లని ఎందుకు పంపి స్తారు? వచ్చినా తనని ప్రేమిస్తున్నానని చెప్పి తన ఆరాధనని అంగీకరిస్తుందని, గ్యారంటీ ఏమిటి? నిజంగా తనంటే ఇష్ట

పడేదయితే ఏదో ఒక ఏర్పాటు చేసేది గదా! "ప్రకాశం....నిన్ను నేను ప్రేమిస్తున్నాను" అని ఒక్కమాట అనుంటే తను నెలలు, సంవత్సరాలే కాకుండా కొన్ని జీవితకాలాలు వేచియుండేవాడు. ప్రపంచాన్ని ఎదిర్చి నిల్చేవాడు. కాని తనకు ఆ అదృష్టం లేదే!

అక్కడ ఇంటి పరిస్థితి ఎంత అల్లకల్లోలంగా వుంది? మంచంలో కదలలేని స్థితిలో తల్లి, పూట పూట వండి పెట్టడానికి వెర్రిగా అందరివంక చూసే తండ్రి, నీ కోసం..ఇంతచేసిన వాళ్ళకోసం నువ్వేం చేస్తున్నావని నిలేసి ప్రశ్నిస్తున్న నైతిక బాధ్యత...

ప్రకాశం ఇంటిని సమీపించేడు. గది తాళంతీసి, గోడకానుకుని కూర్చున్నాడు. ఆ కళ్ళలో కదలిక లేదు. మనసు బాధ పడే లక్షణాన్ని కోల్పోయినట్లు మొద్దు బారింది. వొళ్ళంతా తిమ్మిరెక్కినట్లు, సూదులు పెట్టి గుచ్చుతున్నట్లుగాను వుంది.

ఎవరో తనముందు నిలబడి చెబుతున్నట్లు, అపస్తున్నట్లు, ఘోష పెడుతున్నట్లు...

"వెర్రివాడా... ఎండమావుల్లాంటి ఆప్యాయతలకోసం ఎంత కాలమిలా వెంటాడి అలసిపోతావ్? చంపెయ్యి. నీలోని మమతలని, ఆప్యాయతలని చంపెయ్యి. అర్థంలేని ఆ ప్రేమదీపాన్ని ఆర్పెయ్యి. నువ్వు కోరుకున్నది,కావాలనుకున్నది నీకు దొరకదు. ప్రాణం అనుకున్న మార్కండేయులు చనిపోయాడు. ప్రాణాత్ప్రాణం అనుకున్న ప్రసూన దూరమైంది. ఇంతకన్నా ఋజువేం కావాలి? ఇప్పటికీ నీ జీవిత గమనం అర్థం కాలేదా?

అక్కడ నీ శ్రేయస్సు కోరినవాళ్ళు చూసిన ఆ పిల్లని చేసుకో. కనీసం కుటుంబంకోసం ఏదో చేశానన్న తృప్తన్నా మిగుల్చుకో. ఆలస్యమైతే ఆ మానసికానందంకూడా మిగలకుండా పోయే ప్రమాదం వుంది.

ప్రకాశం ఏదో నిర్ణయించుకున్న వాడిలా లేచి నిల్చున్నాడు.

గూట్లోంచి కవరు తీసి తండ్రికి రెండే రెండు ముక్కలు రాశాడు.

పిల్ల నచ్చింది. ముహూర్తాలు పెట్టించమని.

ఆ మర్నాడు- ఆ వుత్తరాన్ని పోస్టు డబ్బాలో పడవేస్తున్నపుడు,తన జీవితాన్ని తాకట్టు పెట్టినట్లుగా, ఎవరి సొమ్మో ఇంకెవరికో ఇస్తున్నట్లు, తన ప్రేమ కావ్యానికి తుదిపలుకుపలుకుతున్నట్లు ...

అతడి నిర్ణయాన్ని తీసుకుని ప్రయాణం చేయటానికి ఆ వుత్తరం అతడి వేళ్ళ మధ్యనించి జారి డబ్బాలో పడి మందలాంటి వందల వుత్తరాలమధ్యన కలిసిపోయింది.

ఆవిధంగా ప్రకాశం ఇందిరకు భర్త అయేందుకు ఆమోదం తెలిపేడు.

* * *

ఆ రోజునుంచి ప్రకాశంలో వచ్చిన మార్పు ప్రతివాళ్ళకి కొట్టొచ్చినట్లు కన్పిస్తోంది. ఎవ్వరితోనూ మాట్లాడడు. అలా ముంగిలా కూర్చుంటాడు. క్యాష్ కౌంటరు కటకటాలవెనుక ఆజన్మాంతపు జీవిత ఖైదీలా దీనంగా కూర్చుంటాడు. ఎవరన్నా పేమెంటులకొస్తే యాంత్రికంగా డబ్బులిస్తాడు. అతడిలో వచ్చిన మార్పుని చాలా మందితో పాటు నాగరాజు కూడా గమనించేడు.

నాగరాజు అదే ఆఫీసులో గుమాస్తా. ప్రకాశం ఈడువాడే. అకౌంటు సెక్షన్లో పన్చేస్తాడు. అతడికి ఆశ ఎక్కువ,

అనుభవం ఎక్కువ. ఆత్రం ఆరాటం ఎక్కువ. అన్నీ ఎక్కువే ... ఒక్క డబ్బుతప్ప.

అతడికి ఆఫీసులో స్నేహితులు చాలా తక్కువ. అతడి అలవాట్లు వాలకం చాలా మందికి నచ్చవు. అందుకని నాగరాజు కూడా ఏదైనా పనుంటే తప్ప ఎవరితోనూ మాట్లాడడు. కాని ప్రకాశం ఒక్కడితో కల్పించుకుని మాట్లాడుతుంటాడు. అతడు క్యాషియర్ కాబట్టి ఏదైనా పనిబడుతుందేమోనన్న ముందుచూపు కావచ్చు. లేక ప్రకాశం అతడికి వ్యక్తిగతంగా నచ్చి వుండొచ్చు. గత కొద్దిరోజులుగా సర్వం పోగొట్టుకున్నవాడిలా దీనంగా కూర్చుంటున్న ప్రకాశాన్ని చూసి, ఆరోజు అడిగేశాడు– "ఏవిటి...నాల్రోజుల్నించి పరధ్యానంగా, డల్‌గా వుంటున్నావ్?" అని.

"ఏవిటో ... మనసు బాగుండటం లేదు"

"మనస్సుని అద్దంతో పోలుస్తారు... ఎందుకో తెల్సునా? మనం ఏడిస్తే అదీ ఏడుస్తుంది. నవ్వితే మనతోపాటు అదీ నవ్వుతుంది"

ప్రకాశం మాట్లాడలేదు. మళ్ళీ నాగరాజే అన్నాడు–

"మనస్సుకి జబ్బు చేస్తుంటుంది. అప్పుడు మందులు అవీ వాడాలి. వాడితే అదే నయం అవుతుంది. అబ్బో...చాలా చిట్కాలున్నాయిలే" అని ఎవరో పిలవటంతో వెళ్ళిపోయాడు.

ఆరోజు సాయంత్రం గదికి చేరి, పడుకునున్నాడు. అప్పటికే తండ్రికి ముహూర్తాలు పెట్టించమని వుత్తరం రాసి వారం అయింది. సమాధానం కోసం ఎదురుచూస్తున్నాడు ప్రతిరోజు. పడుకునున్న ప్రకాశం అడుగుల చప్పుడు విని తలెత్తి చూసేడు. మొన్న తను ఎవరింటికయితే ప్రసూన సంగతి కనుక్కోటానికెళ్ళాడో ఆ పిల్ల నిలబడుంది.

ఆమెని చూడంగానే ప్రకాశం కంగారుగా లేచి కూర్చున్నాడు.

"సారీ అండీ...డిస్టర్బ్ చేసానేమో. ప్రసూన వుత్తరం రాసిందండీ" అంది.

ప్రకాశం గుండె ఒక్కక్షణం పన్చెయ్యటం మర్చిపోయినట్లనిపించింది.

"ఎవరికి?"

"నాకేనండీ! అఫ్‌కోర్స్...ఆ కవర్లోనే మీకూ ఓ కాగితం పంపింది. ఇద్దామని వచ్చేను" అంటూ చిన్న మడతపెట్టిన కాగితాన్ని అతడికిచ్చింది.

ప్రకాశం మరమనిషిలా దాన్నందుకున్నాడు.

ఆ పిల్ల మళ్ళీ, "అడ్రస్సు కూడా రాసిందండీ! ఇదిగో అడ్రస్సు కాగితం" అంటూ చిన్న కాగితం ముక్క అందించింది.

దాన్ని కూడా అందుకున్నాడు.

వెంటనే ఆ పిల్ల కంగారుగా "వస్తానండీ" అంటూ వెళ్ళిపోయింది.

ప్రకాశం వణుకుతున్న చేతుల్తో వుత్తరాన్ని విప్పాడు.

"ప్రకాశంగారికి,

మీరు ఊరినించి వచ్చారో లేదోనని సందేహంతో మా ఫ్రెండ్‌కి రాసిన కవర్లోనే మీకూ రాస్తున్నాను...కోపగించకండి.

మీరు ఊరెళ్ళాక మా తాతగారికి పెద్ద యాక్సిడెంటయింది. రెండ్రోజులు ఒక్కదాన్ని బాధపడ్డాను. అప్పుడు మీరు గుర్తొచ్చారు. (అఫ్‌కోర్స్! ఎప్పుడూ గుర్తుంటారు...అది వేరే విషయం) ప్రకాశం గారుంటే ఎంత ధైర్యంగా వుండేది

అనిపించింది.

రెండ్రోజుల తర్వాత మా నాన్న గారొచ్చి మా ఇద్దర్నీ ఇక్కడికి తీసుకొచ్చారు. ప్రస్తుతం మా తాతయ్య కులాసాగానే వున్నారు. ఇక్కడ నాకు మాత్రం ఏం తోచటంలేదు. ఎప్పుడూ ఏవో ఆలోచనలు.

అక్కడున్నపుడు ఎన్నో విషయాలు మీతో చెప్పాలనుండేవి. సహజమైన సిగ్గు, బిడియం అడ్డుపడి గొంతు నొక్కేసినాయ్. ఇపుడు నాపైన నాకే కోపంగా వుంది. ఇప్పట్లో అటువైపు రావటం కుదరదేమో. ఆ విషయం అనుకోటానికే భయంగా వుంది. కాస్త ధైర్యం చెబుతూ వుత్తరం రాస్తారుకదూ. కనీసం వుత్తరాలతోనైనా ధైర్యంగా వుందాం... సరేనా? మీ వుత్తరం కోసం వేయి కళ్లతో ఎదురుచూస్తూ... మీ

ప్రసూన"

కాసేపు అలా కూర్చునే మూగ బాధ ననుభవించి ఏదో నిర్ణయించుకున్న వాడిలా చేతిలోవున్న వుత్తరాన్ని, అప్రసు కాగితాన్ని చిన్న చిన్న ముక్కలుగా చించి లేచి కిటికీలోంచి బయటకి విసిరేసు.




ప్రకాశం గతంలోంచి బయటపడి భార్య వంక సూటిగా చూసేడు.

"ప్రేమించటం తప్పుకాదు. పరిస్థితుల ప్రాబల్యంచేత ఇంకోళ్లని పెళ్లాడటం తప్పుకాదన్నావుగదూ... నిజం. మనిషి తన సమర్థతపైన కొండంత ఆశ పెట్టుకుంటాడు. కాని కొన్ని సమయాల్లో సమర్థత, తెలివితేటలు, డబ్బు, పలుకుబడి ఎన్నున్నా నిస్సహాయంగా నిలబడి చేదాటిపోతున్న పరిస్థితులని వెర్రిగా చూస్తూ అశక్తుడిలా వుండిపోవాల్సి వుంటుంది. దానికి నా జీవితమే వుదాహరణ. బహుశా అటువంటి స్థితి కలిగినప్పుడే మనిషి దేవుడిని నమ్మటం మొదలెడతాడు.

ఇందిర భర్తవంక తేరిపార చూసింది. ఆ చూపులో జాలి, ప్రేమ, అనునయం, ఆప్యాయతలున్నాయని అనుకోటానికి వీల్లేదు. అదో రకమైన సందిగ్ధం. ఎటూ తేల్చి చెప్పుకోలేని గందరగోళం.

ఈయన ఇంకా ఆ ప్రసూనని మర్చిపోలేకుండా వున్నాడా? ఇలా తాగుడుకి బానిస కావటానిక్కారణం ఆమెని పొందలేకపోయానన్న బాధవల్లా? ఆ అశాంతి గుండెల్లో పేరుకుపోయిందా? అందువల్లే ఈవిధంగా ప్రవర్తిస్తున్నాడా? మరయితే తమ దాంపత్యపు తొలిరోజుల్లో ఇలా లేడేం? "ఏమిటాలోచిస్తున్నావ్?" అని ప్రకాశం అనటంతో ఆలోచనల్లు ఆపి సూటిగా అడిగింది- "మీరిలా తాగటానికి ఆమే కారణమా? ఆ బాధని మర్చిపోవటానికే తాగుతున్నారా?"

ప్రకాశం భార్యవంక ఆశ్చర్యంగా చూసేడు. "ఎందుకలాఅనుకుంటున్నావ్?"

"అలాగే అనుకోవాల్సి వుంటుంది. మీ మాటలు, చేతలు చూస్తుంటే"

ప్రకాశం లేచి నిల్చున్నాడు. చాలాసేపు అసర్గళంగా మాట్లాడటంచేత పత్తు జారిపోయినట్టనిపించింది.

"అలా అయితే పెళ్ళినాటికే తాను

బోతునైవుండాల్సింది. కాని అది నిజం కాదు. ప్రసూన కోసంగాని, ఆమెని మర్చిపోవటానిగ్గాని తాగటంలేదు. కాని తాగినపుడు ప్రసూనే కాదు... మార్కండేయులుకూడా గుర్తుకొస్తాడు ఆ కాసేపు. అంతే! ఆ తర్వాత నాకేం గుర్తుండదు"

అనేసి లోపలికి వెళ్లబోయాడు.

"ఇంతకీ ఆ ప్రసూనకి పెళ్ళయిందా?" అని భార్య అడగటంతో ఒక్క క్షణం ఆగి, "ఏమో...నాకూ తెలీదు. ఎప్పుడూ కలవలేదు. ఎక్కడుందో కూడా తెలీదు. చాలా సంవత్సరాల తర్వాత తిరిగి ఆమె గొంతు ఈరోజే ఫోన్లోనే విన్నాను" అనేసి లోపలికెళ్ళిపోయాడు.

ఇందిర చాలా సేపు ఆలోచిస్తూ అలాగే కూర్చుంది.

* * *

భర్త జరిగిందంతా ధైర్యంగా చెప్పినందుకు అతణ్ని మనసులోనే అభినందించినా తెల్సుకున్న నిజాన్ని అంత తేలిగ్గా, ధైర్యంగా జీర్ణం చేసుకోలేకపోయింది ఇందిర. అతడితో ముభావంగానే వుంటోంది. యాంత్రికంగా అతడి అవసరాలు తీర్చటం, అందుకు సరిపడ ముక్తసరిగా మాట్లాడటం.

ప్రకాశం కూడా భార్యలో వచ్చిన మార్పు గమనించినా ఆమెని సమాధానపర్చాలని, అనుమానాల నివృత్తి చెయ్యాలని గాని ప్రయత్నించలేదు.

కారణం - భార్యపట్ల నిర్లక్ష్యం కాదు. ఆలోచించవలసిన, వెంటనే పరిష్కరింపతగ్గవి అయిన కొత్త సమస్యలు ఆఫీసులో వచ్చిపడ్డాయి.

ప్రకాశం పన్చేసున్న ఆఫీసులో ఆడిట్ మొదలయింది. ఎకౌంట్స్ చెకింగ్ ప్రారంభమై రెండ్రోజులైంది. ఇంకో రెండ్రోజులకి అతడు పన్చేస్తున్న కాష్ సెక్షన్ చెకింగ్ చేస్తారు. ఆలోగా తను చేసిన అవకతవకలన్నీ సర్దుబాటు చెయ్యాలి. కాష్‌బుక్కుని సరిచేయాలి. లేనిపక్షంలో వుద్యోగానికే ముప్పు.

అసలంత డబ్బు తను ఎలా వాడుకున్నాడు? ఎందుకు వాడుకున్నాడు? వాడుకునేటప్పుడు వుద్యోగం పోతుందని తెలీదా?- ఇవన్నీ అప్రస్తుతాలు అతడి దృష్టిలో.

ఆఫీసు డబ్బు వాడుకుంటే ఏదో ఒక రోజు వుద్యోగానికి వుద్వాసన తప్పదని ఎవరికి తెలీదు ? అలాగే ఆ విషయం అతడికీ తెల్సుకాని ఆరోజు, ఆ క్షణంలో ఎందుకంత తన మనస్సు రెపరెపలాడింది? అరచేతిలో స్వర్గంచూపించిన ఆ నాగరాజుకి ఏయే అలవాట్లున్నాయో తనకి తెల్సు. తాగుడు, రేసులు మొదలైనవన్నీ వున్నాయని అనుభవపూర్వకంగా తెల్సుకున్నాడు. నిజానికి నెలకి ఇరవై రోజులు ప్రకాశానికి తాగించేది అతడే. అంత డబ్బు ఎక్కణ్నించి వస్తుందని అడిగితే ఏవేవో చెబుతాడు. వెనకాల ఆస్తివుందంటాడు. కాని ఎన్ని అలవాట్లున్నా, అప్పులున్నా, బాధలున్నా నవ్వుతూ, ధైర్యంగా కన్పించటం అతడి ప్రత్యేకత. అలాంటివాడు ఆరోజు అలా నిరుత్సాహంగా, స్తబ్దుగా వుండటం కాస్త ఆశ్చర్యమనిపించింది.

"నిజంగా మనకదృష్టంలేదోయ్. బాగుపడే యోగంలేదు" అన్నాడు.

"ఎందుకని?"

"కాకపోతే ఏమిటి చెప్పు. ఇన్నేళ్ళగా రేసులకెడ్తున్నానా ... ఇవ్వాళ వచ్చిన అవకాశం ఇంతవరకురాలేదు. ఇంక రాదు కూడా. డబ్బుల్లేకపోగాని వేలు సంపాదిం

చాల్సిన పరిస్థితి"

ప్రకాశం మామూలు ధోరణిలో తేలిగ్గా నవ్వేసాడు.

అది చూసి నాగరాజు అందుకున్నాడు-

"అలా తేలిగ్గా నవ్వేయ్యకు. అసలయినా నిన్ను నమ్మించాలని కాదు నా వుద్దేశం" జీవితంలో పైకొచ్చినవాడి కన్నా, పతనమైనవాడికే ఎక్కువ అనుభవ ముంటుంది. ఎవరెవరితో ఎలామాట్లాడాలో, ఎలాంటి మనిషికి ఏవిధంగా కబుర్ల చెప్పాలో నాగరాజుకి అనుభవంతో వచ్చిన విద్య. ప్రకాశంలాంటివాడు ముఖాముఖిగా అడిగితే ధైర్యం చెయ్యడని తెల్సు.

నాగరాజు నిష్ఠూరంగా అన్న మాటకి ప్రకాశం చిన్నగా నవ్వాడు.

"ఇంతకీ ఏమిటీ... అంత విచిత్ర పరిస్థితి?" అనడిగాడు.

నాగరాజు అక్కడే అలాగే నిల్చుని, "ఏం చెప్పమంటావ్...భాగ్యలక్ష్మి అనే గుర్రం ఇవ్వాళ గెలుస్తుందన్న ఇన్ఫర్మేషనొచ్చింది.



ఎవ్వరికీ తెలీదు. పెద్ద సీక్రెట్. రెండు వేలు బుక్కీస్‌పైన ఆడితేరెట్టింపు... ఫోర్ థవుజండ్స్. జస్ట్ఇన్ఎ మేటర్ ఆఫ్ ఫ్యూ మినిట్స్. ప్చ్...మనకా యోగంలేదు" నీరసంగా అంటూ ప్రకాశం వంక చూశాడు.

ఆమాట వినగానే ప్రకాశంమొహంలో ఖచ్చితమైన మార్పు కొట్టొచ్చినట్టు కన్పించింది.అది నాగరాజు కనిపెట్టాడు.

ప్రకాశం తనలో కల్గిన ఆశ్చర్యాన్ని సాధ్యమైనంతగా దాచేస్తూ– "అయినా ఆ గుర్రం గెలుస్తుందని గ్యారంటీ ఏమిటి? నీకొచ్చిన ఇన్ఫర్మేషన్ సరైనదని నమ్మకం ఏమిటి??"

అతడు తోవలోకొస్తున్నాడని అర్థమైంది నాగరాజుకి. ఇప్పుడే తను జాగ్రత్తగా ప్లే చేయాలి అనుకుంటూ–

"జీవితంలో కొన్నికొన్ని నమ్మాలోయ్ తప్పదు. భార్యని నమ్మాలి. తల్లిని నమ్మాలి. ఏ బస్సో, రైలో ఎక్కేముందు క్షేమంగా దిగుతామని అనుకుని ఆ విషయాన్ని నమ్మాలి. లేకపోతేమనశ్శాంతి వుండదు. ఫోన్‌చేసి ఇన్ఫర్మేషన్ ఇచ్చిన ఆ జాకీ ఫ్రెండుకి అబద్ధం చెప్పాల్సిన అవసరం ఏముంది?"

అతడి మాటలతో ప్రకాశానికి మరి కాస్త ధైర్యం వచ్చింది.

"నిజమే..కాని డబ్బులేవుగా" అన్నాడు

నాగరాజు కాస్త ముందుకొంగి, రహస్యం చెబుతున్నట్లుగా, మెల్లిగా నీకేమిటోయ్...లక్ష్మీపుత్రుడివి. నువ్వు తల్చుకుంటే డబ్బులక్కొదవా?"

"అంటే?''

"అహ... ఏంలేదు. నీకూ అప్పులున్నాయ్. ఆలోచించు నీదగ్గర ఇంట్రెస్టు డబ్బువుంటే దాంతో ధైర్యం చెయ్యి. నీ అప్పుల బాధలు ఒక్క దెబ్బతో ఎగిరి పోతాయ్"

ఆ కంపెనీ ఫారిన్‌వారి సహకారంతో నెలకొల్పింది కాబట్టి తరచు ఫారినర్స్ వస్తూంటారు. వాళ్ళకి కావాల్సిన ఏర్పాట్లు చెయ్యటానికి క్యాషియర్ దగ్గర కొంత డబ్బుంటుంది. దానికి ప్రతిరోజు ఎకౌంటు ఇవ్వనక్కర్లేదు. నెలకోసారి మాత్రం ఆ నెలలో ఆ డబ్బులోంచి ఎంత ఖర్చయిందో లెక్కచూస్తారు. దాంట్లోంచి వాడితే వెంటనే ఎవ్వరికీ తెలీదు. ఆ విషయం తెల్సు గనుకనే ప్రకాశం అప్పటికే దాంట్లోంచి కొంత డబ్బు– దాదాపు రెండువేలు అడపాదడపా అవసరం వచ్చినప్పుడల్లా వాడేశాడు. ఇపుడు చెకింగ్ జరుగుతోంది కనుక ఆ డబ్బుని దాంట్లో వేసెయ్యాలి.

అసలా విషయం గురించే గత రెండు రోజులుగా దిగులుపడి, మధనపడుతున్నాడు. ఇపుడు నాగరాజు చెబుతున్న మాట విన్నాక, ఆశ తళుక్కుమంది. అతడు చెప్పినట్టుగాఇంట్రెస్టులో మిగిలిన రెండువేలు తీసుకెళ్ళి ఆ భాగ్యలక్ష్మిపై పెడితే? కాస్సేపట్లో తన సమస్య పరిష్కారమైపోతుందిగా?

ప్రకాశం పూర్తిగా దారిలోకొచ్చేశాడని నాగరాజుకి అతడిమొహంలోని కవళికలు బట్టి అర్థమైపోయింది. ఇపుడు కాస్త తొందరచెయ్యాలంతే!

"నీళ్ళు నములుతూ కూర్చుంటే అక్కడ పుణ్యకాలం కాస్తా దాటిపోతుంది. ఆ పైన ఎంత బాధపడినా ప్రయోజనం వుండదు. ఆలోచించక ధైర్యం చెయ్యి. నే వాకిట్లో నిల్చుంటా. వచ్చేట్లయితేపదినిముషాల్లో వచ్చెయ్...లేకపోతే నే వెళ్ళిపోతా"

నాగరాజు మరేం మాట్లాడకుండా

పెద్ద పెద్ద అంగలువేస్తూ బయటికి నడిచి ఆఫీసు ఆవరణని దాటి, బయటకొచ్చి, గేటుకానుకునిల్చుని సిగరెట్టుముట్టించాడు.

అయిదు నిమిషాలయింది. సిగరెట్టు పూర్తి కూడా కాలేదు. ఆఫీసులోంచి ఆత్రంగా, ఆదుర్దాగా వస్తున్న ప్రకాశాన్ని చూసి, గర్వంగా తనలోతాను నవ్వుకున్నాడు.

సిగరెట్టుని అవల పారేసి, అటు వైపుగా వెడుతున్న ఆటోని పిల్చి తానెక్కి కూర్చున్నాడు. కొద్ది క్షణాలకి ప్రకాశం కూడా వచ్చి ఎక్కి కూర్చోగానే "రేస్ కోర్స్" అన్నాడు.

ఆటో కదిలింది....

* * *

మధ్యాహ్నం రెండయింది. తమ తమ అదృష్టాలని పరీక్ష చేసుకోటానికి వచ్చిన వాళ్లతో రేసుకోర్సు సందడిగా, అదో కళగా ఉంది. మొదటి రేసు కొద్దిసేపట్లో జరుగనున్నట్లు ప్రకటింపబడింది. జనం హడావుడిగా కౌంటర్ వైపు పరిగెత్తుతున్నారు.

అదొక పెద్ద హాలు. అక్కడ వరసగా బ్రోకర్లు. వీళ్ళని రేసుల భాషలో బుక్కీస్ అంటారు. వాళ్ళ చుట్టూ విపరీతంగా జనం. పచ్చనోట్లు పిచ్చినోట్లులాగా చేతులు మారుతున్నాయ్.

నాగరాజు, అతడి వెనుక ప్రకాశం ఆ హాల్లోకి ప్రవేశించారు. నాగరాజు త్వరత్వరగా తను మామూలుగా ఆడే బుక్కీ వద్దకెళ్ళి ఏదో అడిగాడు. అతడేదో బదులిచ్చాడు.

"భాగ్యలక్ష్మికి త్రీ టైమ్స్ ఇస్తున్నార్ట. అంటే వెయ్యికి మూడువేలన్నమాట. ఎంతాడతావ్?" అనడిగాడు ప్రకాశాన్ని.

"అది గెలవటం ఖాయమేనా?" అమాయకంగా అడిగాడు.

నాగరాజు నవ్వి, "భాగ్యలక్ష్మిపైన ఎవ్వరూ ఆడటంలేదు...అంటే అదిఖచ్చితంగా గెలుస్తుందన్నమాట" అన్నాడు.

ప్రకాశం జేబులోంచి డబ్బు తీసి నాగరాజుకివ్వబోయేడు—

కాని నాగరాజు తెలివిగా పుచ్చుకోకుండా, "నీ చేత్తో నువ్వే ఇవ్వు.... సెంటిమెంటు" అన్నాడు.

ప్రకాశం తన చేతిలో డబ్బుని అక్కడున్న వ్యక్తికందించి, "భాగ్యలక్ష్మి" అన్నాడు.

ఆ వ్యక్తి డబ్బుని డబ్బాలో పడేసి, చిన్న కాగితంపై ఏదో రాసి చేతికిచ్చాడు.

నాగరాజు, ప్రకాశం ఇద్దరూ గ్యాలరీ వైపుగా వెళ్ళారు. అప్పటికే జనమంతా చేరి ఆత్రంగా ఎదురుచూస్తున్నారు. పరిగెత్తబోయే గుర్రాలు కోష్టులోకొచ్చి నిలుచున్నాయ్ - మొదలుపెట్టబోతున్నట్లుగా గంట మోగింది.

ప్రకాశం భుజం పట్టి అటువైపుగా చూపిస్తూ, "అటువైపునుంచి రెండోది మన గుర్రం. జాగ్రత్తగా చూడు'' అన్నాడు నాగరాజు.

ప్రకాశం తలూపాడేగాని, లోలోపల భయంగా వుంది. ఏమౌతుందోనన్న బెంగగా వుంది.

రేసు మొదలైంది—

ఆరు గుర్రాలు అచ్చు పోటీ గుర్రాల్లాగే పరుగులెత్తుతూ ఆధిక్యత కోసం ప్రయత్నిస్తున్నాయ్.

జనంలో కలకలం మొదలైంది. వెర్రిగా తాము పందెం కాసిన గుర్రం పేరు పెద్దగా అరుస్తున్నారు. చప్పట్లు, ఈలలు...గొడవగా వుంది.

ప్రకాశానికి అక్కడికి రావటం అదే

ప్రథమం. అంచేత కొత్తగా వుంది. విచిత్రంగా, ఆశ్చర్యంగావుంది. అన్నిటికి మించి భయంగా వుంది. నాగరాజు చూపించిన ఆ గుర్రం వంక ఆత్రంగా చూస్తున్నాడు.

నాగరాజు ప్రకాశం భుజంపై చరుస్తూ, "భాగ్యలక్ష్మి గెలుస్తోందోయ్" అన్నాడు.

ప్రకాశానికి ఆనందంతో మాట రాలేదు.

ఆరు గుర్రాల్లో-రెండు సమానంగా, సమవుజ్జీలుగా పరిగెత్తుతున్నాయ్.

జనం అరుస్తూనే వున్నారు—

ఆ రెండు గుర్రాలు అలాగే పోటీపడి పరిగెత్తుతున్నాయ్.

జనం గోల ఎక్కువైంది.

విన్నింగ్ పోస్టు ఇంకా కొద్దిగజాల దూరంలో వుంది.

ప్రకాశం వూపిరి బిగపట్టి, కన్నార్పకుండా చూస్తున్నాడు.

ఒకటి...రెండు...మూడు...

ఒక్కసారిగా జనం అరవటం ఆపి వెనక్కి తిరిగేరు.

"ఏమైంది...గెల్చామా..." ఆదుర్దాగా అడిగాడు ప్రకాశం.

"అక్కడ మైకులోచెబుతారు...పద"

ఇద్దరూ బయటికొచ్చి మైకు వద్ద నిల్చున్నారు.

కొద్ది క్షణాలకి ఆ రెండు గుర్రాలు సమాన స్థాయిలో వచ్చి వుండటంచేత ఫొటో ఫినిష్‌లో నిర్ణయిస్తామని, కొద్ది సేపట్లో ఫలితం చెప్పబడుతుందని ప్రకటించారు.

"ఫొటోఫినిషంటే ఏమిటి? అంటే భాగ్యలక్ష్మి గెల్చినట్టుకాదా?" అమాయకంగా అడిగాడు ప్రకాశం. భయంతో గుండెలు వేగంగా కొట్టుకుంటున్నాయ్. సన్నటి వొణుకు.

"భాగ్యలక్ష్మి తప్పక గెలుస్తుంది... కంగారుపడక రెండు గుర్రాల్లో ఏది ముందుగా విన్నింగ్ పోస్టుని క్రాస్ చేసిందో కంటితో చూసి చెప్పలేనపుడు, అక్కడ తీసిన ఫొటోని సూక్ష్మంగా పరిశీలించి నిర్ణయిస్తారు. దాన్ని ఫొటో ఫినిష్ అంటారు"

అని చెబుతూనే టీస్టాల్ వైపుగా దారి తీసాడు.

ప్రకాశానికిప్పుడు భయం ఎక్కువైంది. అనవసరంగా, అర్థరహితంగా ధైర్యం చేసానేమోననిపించింది.

ఇద్దరూ టీలు తాగి తిరిగి మైకువద్ద కొచ్చారు.

జనమంతా ఆత్రంగా నిల్చున్నారు.

కొద్దిసేపట్లో ఫలితం చెప్పబడింది- డోంట్ బిలీవ్ మీ అనే గుర్రం గెల్చింది. భాగ్యలక్ష్మి ఓడిపోయింది.

అది విన్న నాగరాజు కాస్సేపు ప్రకాశం వైపు చూడలేకపోయాడు. కొద్ది క్షణాల తర్వాత చూస్తే ప్రకాశం అక్కడ లేడు.

నాగరాజు కంగారుగాచుట్టూచూసేడు. దూరంగా సిమెంటు బల్లపై కూర్చుని మొహాన్ని మోకాళ్ళ మధ్యన దాచుకున్నాడు.

నాగరాజు ఆదుర్దాగా అక్కడికెళ్ళి, అతడి భుజంపై చెయ్యివేశాడు.

ప్రకాశం తలెత్తి అతడివంక దీనంగా చూసాడు.

కళ్ళు ఎర్రగా వున్నాయ్. మొహమంతా నల్లగా... కళ్ళవెంట నీళ్ళు జలజలా...

"ఛ...వూరుకోవోయ్! ఆడపిల్లలా"

అప్పటికే జనం అతడివైపు, ఓదారు

స్తున్న నాగరాజు వైపు వింతగా చూస్తున్నారు. అందరూ నవ్వేటప్పుడు ఏడ్చే వాడిని, అందరూ ఏడుస్తున్నపుడు నవ్వే వాడిని విచిత్రంగా చూస్తారు జనం.

అలవాటు కొంత ముదిరాక డబ్బు పోయినా అదేమిటో సంతోషంగానే వుంటుంది. కాని ప్రకాశం ఆ బాపతుకాదు. కనుక బాధపడుతున్నాడు.

నాగరాజుకిబ్బందిగా అన్పించింది. అందరి చూపులూ శూలాల్లా గుచ్చుకుంటున్నట్లనిపించింది. అంచేత ఫ్రెండుని ఎలాగైనా అక్కణ్నించి బయటకు తీసుకెళ్ళటం శ్రేయస్కరమని భావించి ప్రకాశాన్ని చెయ్యిపట్టి లేప దీసాడు. అతి కష్టంపైన నడిపిస్తూ-

"సారీ ప్రకాశం...ఇలా బాధపడతావని తెల్సుంటే అసలు చెప్పకసేపోదును. గాంబ్లింగ్ ఎప్పుడూ ఇలాగే వుంటుంది. ఒక్కోసారి వస్తాయ్,మరో సారిపోతాయ్. బాలన్సుడుగా వుండాలిగాని, ఇలా బాధ పడకూడదు"

ప్రకాశం ఏం మాట్లాడలేదు. కళ్లు తుడుచుకున్నాడు.

సమస్యని చిటికలో పరిష్కరించుకోవచ్చని వస్తే, అది రెట్టింపు సమస్యయి కూర్చుంది...ఇపుడేం చెయ్యాలి? చెకింగ్ మొదలయ్యే లోపున నాలుగు వేలరు పాయలు ఎలాకట్టాలి...ఎక్కణ్నించి తేవాలి...? ఇదే ఆలోచన.

నాగరాజు ప్రకాశాన్ని బయటికి తీసుకొచ్చి పక్కనేవున్న బార్ వైపుగా తీసుకెళ్ళాడు.

డ్రింక్ ఆర్డర్ చేసాడు. ప్రకాశం తల పట్టుకూర్చున్నాడు.

నాగరాజుకి అతణ్ని చూస్తే జాలేసింది. స్కూలుకెళ్ళటానికి మారాంచేసే పిల్లవాడిలా అమాయకంగా వున్నాడు.

డ్రింక్ రెండు గుక్కలు తాగేక నాగరాజు అడిగాడు- "ప్రకాశం... జరిగినదానికి బాధపడుతున్నావా?" అని.

"బాధకన్నా భయంగావుంది. అందులో చెకింగ్ కూడా జరుగుతోంది. నాలుగు వేలు ఎలా కట్టేది?"

"అంటే...ఇపుడునాల్గువేలు ఆడేవా?" ఆశ్చర్యంగా అడిగాడు.

"లేదు. ఇప్పుడు రెండు వేలు పోయాయి"

"ఓహో... అంటే అంతకుమునుపు నువ్వువాడుకున్నవి రెండు వేలు, ఇప్పుడు తెచ్చినవి... వెరసి నాలుగువేలు. అంతేగా?"

అవునన్నట్లు తలూపేడు ప్రకాశం.

నాగరాజుకి ధైర్యం వచ్చింది. ఇందాకటి గిల్టు కాస్త తగ్గినట్టనిపించింది. అంచేత ధైర్యంగా మాట్లాడటం మొదలు పెట్టాడు.

"అంటే సమస్య కొత్తదికాదు. కాకపోతే అంకె మారింది... అంతేగా? దాని గురించి ఇంతలా డీలా అయిపోవటం బాగాలేదు"

ప్రకాశం గ్లాసు ఖాళీ చేసేడు.

"నీకేం...అలాగే అంటావ్. నాలుగు వేలు ఎలాతెచ్చేది ఎక్కణ్నించి తెచ్చేది?"

"రెండువేలు ఎక్కడ్నించి తెచ్చేవాడివి? సరే... ఓ పన్చెయ్యి. నావల్లనువ్వు నష్టపోయావుగనక రెండు వేలు అప్పు తెచ్చి నీకిస్తాను. ఆపై రెండు వేలు నువ్వు చూసుకో"

ప్రకాశానికి తాగిన ద్రవం నరాల్లోకెక్కింది. ఇందాకటికన్నా బాధ తగ్గినట్లనిపించింది.

"నాలుగువేలు తీసుకుంటాను...

ఎక్కడన్నా ఇప్పించు"

నాగరాజు పెద్దగా నవ్వేడు. తిరిగి రెండు గ్లాసులు ద్రవంతో నింపి గ్లాసుని ప్రకాశానికందించాడు.

"ఇప్పిస్తాను...కాని వుట్టినే ఇవ్వరు"

"వడ్డీ కడదాం"

తాగినపుడు ఏకవచనం పలకడు. అంతా బహువచనంలోనే నడుస్తుంది సంభాషణ.

"వడ్డీ ఎలాగూ కట్టాలి. అదికాదు నేననేది... ఏదైనా వస్తువు– బంగారంది పెడితేగాని ఇవ్వరు"

"బంగారపు వస్తువా?"

"ఏం... లేవా?"

ప్రకాశం వెంటనే మాట్లాడలేదు. గ్లాసెత్తి గుటక వేసాడు.

నాగరాజు అతడివంక అలానే చూస్తున్నాడు.

"వున్నాయ్! కానీ మాయావిడ ఒప్పుకోదు" అన్నాడు చివరికి.

నాగరాజు పెద్ద జోక్ విన్నట్లుగా నవ్వేడు.

"మీ ఆవిడకాదు... ఏ ఆవిడా ఒప్పుకోదు" అన్నాడు.

"మరెలా?" ఆసక్తిగా అడిగాడు.

"అది నే చెప్పకూడదు. అసహ్యంగా వుంటుంది. నువ్వన్నట్లు రేపు చెకింగ్‌లో ఈ విషయం బయటపడి ఆఫీసులో పరువు పోగొట్టుకునేదానికన్నా ఇంట్లో భార్య ముందర పరువుపోయినా ఫర్వాలేదు"

ప్రకాశం నిజమేనన్నట్లు తలూపేడు.

నాగరాజు మళ్ళీ అన్నాడు–

"కొంతమంది పెళ్ళాలు బతిమాలితే ఇస్తారు. ఇంకొంతమంది బెదిరిస్తే ఇస్తారు. చాలామంది ఏం చేసినా ఇలాంటి పనులు చేసే మనలాంటివాళ్ళకి ఛస్తే ఏదీఇవ్వరు. అపుడు ఇంకో మార్గం వెతకాలి. అదే ఏటో నే చెబితే అసహ్యంగా వుంటుంది. బావుండదు?"

ప్రకాశానికి అప్పటికి ఏంచెయ్యాలో అర్థమైంది. సమస్యని పరిష్కరించటానికి తోవ కనిపించింది... అదే చాలు!

"సరే...రేపు ఎలాగైనా డబ్బుఏర్పాటు చేయించాలి సుమా" అన్నాడు వాలిపోతున్న కళ్ళని పైకి లేపుతూ.

సరేనన్నట్లు తలూపాడు నాగరాజు.

ఇద్దరూ బయటికొచ్చి కాస్త దూరం నడిచి విడిపోయారు.

* * *

ప్రకాశం ఇంటికి చేరేసరికి బాగా పొద్దుపోయింది. నిజానికి కావాలనే ఆలస్యం చేసాడు. చాలాసేపు రోడ్లవెంట తిరిగాడు. ఆరోజున ఎందువల్లనో తాగింది పది రూపాయల ద్రవమైతే కొట్టింది వంద రూపాయల కిక్కులా అన్పించింది. అడుగులు తడబడుతున్నట్లనిపించింది. అందువల్ల కాస్త స్థిమితం చిక్కేదాకా రోడ్లపైన, పార్కులోనూ కాలక్షేపం చేసాడు.

పార్కులో కూర్చున్నపుడు కైపెక్కిన బుర్రతో నిషాలోచన చేసాడు.

ఇందిరకి పెళ్ళినాడు పెట్టిన రెండు పేటల చంద్రహారం వుంది. మొన్న మొన్నటివరకు అది ఎప్పుడూ మెళ్ళోనే వుండేది. కాని ఈమధ్యన పట్టపగలే రోడ్లపైన తెంపుకుపోవటాలు ఎక్కువయ్యేక భయంతో తీసి బీరువాలో వుంచుతోంది.

ఆ చంద్రహారాన్ని తాకట్టుపెట్టి డబ్బు తెచ్చిఆఫీసులో కట్టాలని నిర్ణయించేసాడు. కాని ఇంకా ఇతమిద్ధంగా తేలనిది, అది

ఆమెకి చెప్పి చెయ్యటమా, లేక చెప్పకుండా చెయ్యటమా అన్నది.

ఒకవేళ అనునయంగా, ప్రేమగా తన సమస్యని చెప్పి ఆ గొలుసు కావాలని అడిగితే ఇస్తుందా...?

ఇవ్వదు సరికదా ఏడ్చి పెడబొబ్బలు పెట్టి, యక్షప్రశ్నలు వేసి విసిగిస్తుంది. ఇంతప్పు ఎందుకైందని నిలదీసి అడుగుతుంది. సవ్యంగా సక్రమంగాఅయితే పనికాదు.

అంచేత అపసవ్యంగా, అక్రమంగానే పని పూర్తిచెయ్యాలి.

ప్రకాశం పని ఎలా పూర్తి చెయ్యాలో ప్లాను గూడా ఆలోచించేడు.

ఇంటికి ఆలస్యంగా వెళ్ళాలి. అప్పటికి ఇందిర నిద్రపోతుంది. భోజనం ప్రమేయం లేకుండా పక్క వేసుకుని పడుకోవాలి. సుమారు ఒక గంట తర్వాత లేచి ఇందిర గాఢ నిద్రలో వుందో లేదో పరీక్షగా చూడాలి. ఆపైన గూట్లోవున్న బీరువా తాళాలు తీసుకునీ చప్పుడు కాకుండా బీరువా తియ్యాలి. లాకర్ని ఓపెన్‌చేసి దాంట్లోని చంద్రహారాన్ని తన ప్యాంటు జేబులోకి మార్చుకోవాలి. తిరిగి బీరువా తాళంవేసి...

అసలు గొలుసు మాయమైందని తెల్సుకోటానికే ఆమెకు నాలుగైదు రోజులు పడుతుంది. ఈలోగా తనేచెప్పెయ్యటమా లేక ఆమె అడిగినపుడు సర్దిచెప్పటమా అనేది తీరుబడిగా నిర్ణయించాల్సిన విషయం.

ప్లాను సిద్ధంచేసుకుని ప్రకాశం లేచి ఇంటిదారి పట్టేడు. అనుకున్నవిధంగానే ఆలస్యంగా ఇల్లు చేరాడు. కాని భార్య ఇంకా మెలుకునుండటం చూసి ఆశ్చర్యపోయాడు.

భర్తని చూడంగానే అతడి పరిస్థితి ఆమెకర్థమైపోయింది.

గత కొద్దిరోజులుగా అతడు తాగొస్తే అంతగా బాధనిపించటం లేదు. ఎవరో పిల్లని ప్రేమించి, దాంట్లో విఫలుడయ్యి, ఆమెని మర్చిపోలేక, ఆ బాధని తుడిచేసుకోవాలని తాగుతున్నాడని తెల్సుకుని అతడిపట్ల ఏభావమూ కనపరచటం లేదు. తాను ఏకాకి అయినట్టు, తనకెవరి ఆదరణ, ఆప్యాయతలు లేనట్లు అన్పించి, దాంట్లోంచిపుట్టుకొచ్చే నిస్పృహ, నిరాశా- ఏ భావాలు లేని జడస్థితి.

అతడివంక ఒకక్షణం చూసి,మౌనంగా లోనకెళ్ళి తన మంచంపైన, పిల్లలిద్దరి పక్కన పడుకుంది.

ప్రకాశం లోనికొచ్చి ప్యాంటు, షర్టు విడిచి లుంగీ కట్టుకున్నాడు.

తాగిన మత్తు కాస్త తగ్గినట్లుగా అన్పించింది. భార్య భోంచేస్తారాని అడగకపోవటం కూడా శుభసూచకంగా అన్పించింది.

వీధి తలుపు గడియపెట్టి అక్కడే వున్న వాలు కుర్చీలో కూర్చున్నాడు. కాస్సేపటికి తెలీకుండానే నిద్ర పట్టింది..

ప్రకాశం ఉలిక్కిపడి లేచాడు...

ప్రకృతి ప్రశాంతంగా వుంది.. సృష్టి నిద్రాదేవి వొడిలో సుషుప్తిగా పడుకుంది. ఎంతసేపు అలా వాలు కుర్చీలో నిద్రపోయాడో అతడికే తెలీదు. గంట... రెండు గంటలా... ఏమో.

అతడు లేచి శబ్దం చెయ్యకుండా, భార్య పడుకున్న గదిలోకెళ్ళాడు. ఇందిర పిల్ల దానిపైన చెయ్యివేసి నిద్రపోతోంది. ఒక్కక్షణం ఆమెవంక దీక్షగా, పరీక్షగా చూసేడు. అక్కణ్నించి కదలబోతుంటే తను తప్పు చేస్తున్నాడేమోననిపించింది.

కాని ఆ భావాన్ని అక్కడికక్కడే చంపేసాడు.

మెల్లిగా కదిలి బీరువా దగ్గరకొచ్చేడు. పక్కనేవున్న గూట్లోంచి దాని తాళాలు తీసేడు. బీరువాని తెరవబోతూ తిరిగి భార్యవంక చూసేడు. ఇందిర అలాగే పడుకునుంది.

మెల్లిగా బీరువా తలుపు తీసి, లాకర్ని కూడా తీసేడు. దాంట్లోంచి చిన్న ప్లాస్టిక్ డబ్బాని బయటికి తీసి, మూత తెరిచాడు.

అందులో రెండు పేటల చంద్రహారం ఆ అస్పష్టపు కాంతిలో స్పష్టంగా మెరుస్తోంది. దాన్ని మెల్లిగా చేతుల్లోకి తీసుకుని ఆ ప్లాస్టిక్ డబ్బాని తిరిగి అక్కడుంచేడు. లాకర్ని తిరిగి లాక్ చేసి అతి మెల్లిగా బీరువా తలుపుల్ని మూస్తూ భార్య పడుకున్న మంచం వైపుగా చూసేడు.

గుండె ఝల్లుమంది.

ఇందిర అక్కడ లేదు. అనుమానంగా, భయంగా వెనక్కి తిరిగేడు.

ఇందిర అతడి వెనకాలే నిల్చునుంది. నడుంపైని చేతులుంచుకుని అతడివైపుగా తీక్షణంగా చూస్తోంది.

ఆమెని చూసాక అతడిలో మొట్టమొదట కల్గినభావం భయం. దేహంలోని నెత్తురంతా ఉడిగిపోయింది. వళ్ళంతా చెమటలు, చలిజ్వరం రోగిలా వణుకు—నిలదీసి అడిగితే ఏంచెప్పాలన్న ఆలోచన్లు, నరాల్లో సత్తువలేనట్లు చేతిలోని గొలుసు చప్పున జారి కిందపడింది.

ఇందిర ఆ గొలుసువంక, భర్తవంక మార్చిమార్చి చూసింది. ఆపైన వొంగి దాన్ని తీసుకుని, తిరిగి అతడి చేతిలో కుక్కింది.

ఆపైన వెళ్ళి మళ్ళీ మంచంపై పడుకుని పిల్లపైని చెయ్యివేసుకుని నిద్రపోతున్నట్లు కళ్ళు మూసుకుంది.

అంతా కొద్దిక్షణాల్లో జరిగిపోయింది.

ప్రకాశానికంతా అయోమయంగా అన్పించింది. అసలు పడుకునున్న ఆమె ఎప్పుడు, ఎలా వచ్చిందోకూడా అర్థం కాకుండావుంది. పైగా అంతా కళ్ళతో చూసేక ఆమె ఏం మాట్లాడకుండా వెళ్ళిపోవటం భరించలేనిబాధగా అన్పించింది. అంతకన్నా తిట్టినా, పోట్లాడినా, అసహ్యించుకున్నా ఆనందంగా వుండేది. కాని ఆమె మౌనంతో శిక్షించింది.

మౌనంలో అంతటి బాధపెట్టే గుణం వుందని అప్పుడే అర్థమైంది. అసలు భార్యని లేపి జరిగిందంతా సవిస్తరంగా విపులంగా చెప్పి బరువు తీర్చుకోవాలనుకున్నాడు.

కాని మరుక్షణం ఎందుకో కూడదనిపించింది. అసలు మాట్లాడే ఓపికే లేదనిపించింది.

మెల్లిగా కదలి, పక్కగదిలోకెళ్ళి చేతిలో గొలుసుని ప్యాంటు జేబులోకి, శరీరాన్ని పడక్కుర్చీలోకి చేరవేసేడు.

ఆ తర్వాత అతడికి మరేం తెలీదు.

* * *

ఆ మర్నాడు అతడు నిద్రలేచేసరికి బారెడు పొద్దెక్కింది. అలాగే కొద్దిక్షణాలు మంచంలో కూచ్చుని రాత్రి జరిగినసంగతుల్ని పునశ్చరణ చేసుకున్నాడు. విషయాలన్నీ గుర్తుకొచ్చేసరికి, మార్నింగ్ ఫ్రెష్‌నెస్ మాయమయ్యి, మనసు వికలంగా అన్పించింది. వొళ్ళు నెప్పులుగాను, కళ్ళు మంటలు, తల దిమ్ముగా వున్నట్లనిపించింది.

కాస్సేపటికి కుర్చీలోంచి లేచి బ్రష్

పేస్టుతో దొడ్లోకెళ్ళిపోయి, అలాగే మంచంపై దీనంగా కూర్చున్న భార్యకేసి చూసేడు.

ఇల్లంతా చిందరవందరగా వుంది. ఎక్కడి వస్తువులక్కడే వున్నాయ్. పిల్లలిద్దరూ స్కూలుకెళ్ళే ప్రయత్నం లేనట్లు తల్లికి చెరోవైపు భయంభయంగా కూర్చున్నారు. ఇందిర నిశ్చలంగా కూర్చునుంది. జుట్టంతా రేగిపోయి చిందరవందరగావుంది. కళ్ళు ఎర్రగా వాచినట్లున్నాయ్...బహుశా తెల్లవార్లు నిద్రమాని ఏడ్చివుండాలి.

ప్రకాశం దొడ్లో మొహం కడుగుతూ ఆలోచించేడు. విషయం మొత్తం చెప్పేసి బరువుదించేసుకుంటే ఎలా వుంటుందని ఆలోచించేడు. ఒకవేళ చెప్పేస్తే అగొలుసు పట్టుకెళ్ళటానికి వల్లకాదని అడ్డగిస్తే? ఆఫీసులో డబ్బు కట్టేందుకు ఇంతకన్నా వేరేమార్గం లేదుకదా? అంచేత ప్రస్తుతానికి మౌనంగా వెళ్ళిపోయి, సాయంత్రం



వచ్చేక ఆమెని కూర్చోపెట్టి అంతా చెప్పేస్తే సరిపోతుంది. అప్పుడు ఆమె ఏమన్నా తనకి దిగులుండదు.

ఆవిధంగా ఆలోచించి ప్రకాశం చకచకా తనపన్లు పూర్తిచేసుకున్నాడు. పిల్లలిద్దరూ తండ్రివంక విచిత్రంగా చూస్తున్నారు.

స్నానం పూర్తిచేసి ప్యాంటు, షర్ట వేసుకున్నాడు. అపుడు ఒకాలోచన వొచ్చింది-ఒకవేళ ఇందిర జేబులోని గొలుసుని తీసేసిందాని. వెంటనే జేబులోకి చెయ్యిపోనిచ్చి చూసేడు.ఆ గొలుసు జేబులోనే వుంది.

గొలుసు జేబులో లేకుండావుంటే ఎంత రిలీఫ్‌గా వుండేది అన్పించింది ఒక్కక్షణం.

ఇందిర, పిల్లలు అలాగే కూర్చుని వున్నారు.

తన పన్లన్నీ పూర్తయ్యాక, అక్కడి నిశ్శబ్దాన్ని భరించలేనట్లు, మెల్లిగా గడప దాటి వీధిలోకొచ్చి, ఆపైన చకచకా అడుగులేస్తూ వెళ్ళాడు, నాగరాజు ఇంటి వైపుగా.

* * *

సాయంత్రం ఆఫీసయ్యాక-

ప్రకాశం ఇంటికి బయల్దేరాడు. కాని వెనకనుంచి నాగరాజు "ఏం బ్రదర్! పన్చేయించుకున్నావ్..గొంతుతడపవా?" అనడిగాడు నవ్వుతూ.

ఆరోజు త్వరగా ఇంటికెళ్ళాలని, తాగకుండా బుద్ధిమంతుడిలా వెళ్ళాలని వుదయమే అనుకున్నాడు. భార్యతో ముచ్చటగా కష్టం, సుఖం చెప్పుకుని, పిల్లలతో ఆడుకుని, సర్దాగా ముచ్చట్లాడుకుంటూ భోజనం చేసి...

కాని నాగరాజు ఉదయం చాలా హెల్ప్ చేసేడు. ప్రకాశం వెళ్ళగానే విసుక్కోకుండా బట్టలేసుకుని ఇద్దరూ కలిసి అతడికి తెలిసిన మార్వాడీ వాడింటి కెళ్ళారు. ఆ సేటు సాయంత్రం రమ్మన్నాడు కాని నాగరాజు అతడితో వాదించి అరగంటలో పని పూర్తిచేయించి నాలుగు వేలు ఇప్పించాడు. ఆ డబ్బులు పుచ్చుకుని ఆఫీసుకొచ్చేసరికి కాస్త ఆలస్యమైనా మనస్సు తేలిగ్గా, హాయిగా వున్నట్లనిపించింది.

అంత సహాయం చేసిన అతడు గొంతు తడపమని అడుగుతుంటే కాదని వెళ్ళిపోతే ఏమనుకుంటాడు? కాని తాగి ఇంటికెడితే ఇందిర ఏమనుకుంటుంది??

రెండువైపులా రెండు క్షణాలాలోచించి నాగరాజుతో, "సారీ బ్రదర్! ఇవ్వాళ అర్జంటు పనివుంది.రేపు నీ గొంతు తడుపుతా" అనేసి అతడి సమాధానం కోసం ఎదురు చూడకుండా, రిక్షా పిల్చి ఎక్కి కూర్చున్నాడు. దారిలో ఒకాలోచన వొచ్చింది.మల్లెపూలు తీసుకెడితే? ఇందిరకి మల్లెపూలంటే మహాప్రీతి. పెళ్ళయిన కొత్తలో ప్రతిరోజూ పూలు తెమ్మని అడిగేది. ఒక్కోరోజు మర్చిపోతే దగ్గరకు రానని మారాం చేసేది.

ప్రకాశం రిక్షానాపించి ఒక రూపాయి పూలు పొట్లం కట్టించేడు.ఆ పక్కనేవున్న స్వీటు హోంలో పిల్లల కోసం రెండు పొట్లాల మిక్స్చర్ తీసుకున్నాడు.

తిరిగి రిక్షా కదిలింది.

ఇల్లు దగ్గరవుతున్నకొద్దీ ఆందోళనగా అనిపించింది.

భార్య ఏమంటుందోనన్న బెంగ ఒక పక్కనలాగే వుంది.

రిక్షాని ఇంటికి కాస్త దూరంలో ఆపించి, గబగబా ఆత్రంగా ఇంటికి సమీ

పించేడు. తలెత్తి ఇంటివైపు చూసి గోడని ఢీకొన్నవాడిలా హతాశుడయ్యి నిల్చుండి పోయేడు.

ఇంటికి తాళం వేసుంది!

ఎక్కడికెళ్లుంటుంది? మార్కెట్టు కెళ్ళిందా? ఇంకా ఆఫీసు నుంచి రాలేదా? అయితే పిల్లలేరి?

అక్కడికి రెండిళ్ళ వతలున్న రవణమ్మకి తెల్సుండాలి- అనుకున్నాడు.

రవణమ్మ టీచరు. ఇందిరకి, ఆమెకి మంచి స్నేహముంది. భార్య ఎప్పుడన్నా పనుండి ఎక్కడికైనా వెళ్ళాల్సివస్తే ఇంటి తాళంచెవి ఆవిడకిచ్చి వెళుతుంటుంది.

ప్రకాశం రవణమ్మ ఇంటివైపుగా వెళ్ళేడు.

అతడెళ్ళేసరికి ఆమె ముగ్గురు సల్లుర పిల్లలకి ట్యూషన్ చెబుతోంది. ప్రకాశాన్ని చూసి ఆమె లోనికెళ్ళి తాళం తెచ్చి అతడి కిచ్చింది.

అతడు దాన్ని అందుకుంటూ "ఎక్కడి కెళ్ళిందో తెలుసా?" అడిగాడు.

"తెలీదండీ! ఉదయమే వెళ్ళిందిమరి" అనేసి చాలా అర్జెంటు పనున్నదానిలా లోనికెళ్ళిపోయింది.

ప్రకాశం భారంగా ఇంటికొచ్చి తాళం లేసి లోనికెళ్ళాడు.

ఇల్లంతా ఉదయం ఎలా వుందో అలాగే చిందరవందరంగా వుంది.

సామాన్లు ఎక్కడివక్కడే పడు న్నాయ్. అక్కణ్నించి వంట గదిలో కెళ్ళాడు. వంట చేసిన సూచన్లు ముచ్చుకి కూడా కనిపించలేదు.

అప్పుడే మొదటిసారిగా భయం అని పించింది.

మధ్య గదిలోకొచ్చి పరీక్షగాచూసేడు. ఇందిర చీరెలు,పిల్లల, బట్టలుండే స్టాండు ఖాళీగా బోసిగా వుంది.

అంటే బట్టలు కూడా తీసుకెళ్ళిందన్న మాట.

ముందుగదిలోకొచ్చి కుర్చీలో కూర్చో బోతుండగా చూసేడు - అక్కడున్న టీపాయి పైన కాగితం మడతపెట్టి వుంది. దానిపైన అల్మారా తాళాలు.

ప్రకాశం ఆత్రంగా కాగితాన్ని చేతుల్లోకి తీసుకుని చదివాడు.

"ఏవండీ....

ఒక ఇంట్లో బతుకుతూ మనసులోని మాటలు ఇలా వుత్తరాలద్వారా చెప్పాల్సి వస్తుందని వూహించలేదు.

కష్టం సుఖం, మంచి చెడు, పాపం పుణ్యంకలసి పంచుకుంటామని పెళ్ళినాడు అగ్నిచుట్టూ తిరుగుతూ ప్రమాణంచేసిన మనం, ఎంత విరుద్ధంగా ప్రవర్తిస్తున్నాం!

మీకున్న కష్టమేమిటో నాకు చెప్పరు. నా సుఖం, పిల్లల మంచి మీకక్కరలేదు. మీ ప్రపంచం, ఆలోచన్లు, అలవాట్లు మీవి.

పైగా అసహ్యకరమైన అలవాట్లు, భయం పుట్టించే ప్రవర్తన.

రాత్రి మీరు అల్మారాలోంచి చంద్ర హారం దొంగతనంగా తీసుకుంటున్న దృశ్యం చూసినపుడు నాకు బాధకన్నా భయంవేసింది. ఏవిటీమనిషి...ఎందుకిలా విచిత్రంగా ప్రవర్తిస్తున్నారనిపించింది. నిజంగా అవసరం వచ్చుంటే నాకు చెప్పొచ్చుగదా. చెప్పుంటే వెధవ చంద్ర హారం ఏంఖర్మ...నా చర్మంవొలిచి మీకు ఇచ్చుండేదాన్నే.

దీన్నిబట్టి నాకర్థమైంది. నాపైన మీకు నమ్మకంలేదని, భార్యగా నాకివ్వాల్సిన స్థానం ఇవ్వలేదని. ఒకవేళ ఆ స్థానాన్ని

ఇంకెవరన్నా ఆక్రమించారేమో మీకే తెలియాలి.

కనీసం వుదయం ఆఫీసుకెళ్ళేప్పుడన్నా 'ఇందిరా... ఇదీ విషయం' అని చెప్పుంటే ఎంత సంతోషించుండేదాన్ని.

అందుకే అన్నీ ఆలోచించి ఒక నిర్ణయానికొచ్చాను. మనసులు కలవని యాంత్రికమైన సంసారం నాకొద్దు. మీ అలవాట్ల నీడలు పిల్లల భవిష్యత్తుపై పడటానికివీల్లేదు. అందుకే మా అన్నయ్యగారింటికెడుతున్నా. వుద్యోగంవుందికదాని మిడిసిపాటుతో వెళ్ళానని మీరనవచ్చు. నిజమే. ఆవుద్యోగం కూడా లేనినాలాంటి వాళ్ళ పరిస్థితి తలుచుకోవాలంటేభయంగా వుంది.

నేను నిస్సహాయురాలిని. నే చెబితే మీరు వినరు. అలాగని మీకు మీరే ఆలోచించుకునే విజ్ఞతలేదు. మీరలాఅలవాటులో దహనమైపోతుంటే నే చూస్తూ వుండలేను. అలాగని నేదూరంగా వెళ్ళిపోతే మీరు మారిపోయి పరమహంసలవుతారనికాదు నా వుద్దేశం.

శిఖరంపైనించి పట్టుతప్పిన రాయి ఎక్కడాగుతుందో నాకు తెల్సు!

నా పిల్లలు తాగుబోతువాడి సంతానంగాను, నేను తాగుబోతువాడి భార్యగాను గుర్తింపబడటం, చూడబడటం సహించలేను.

అందుకే వెళ్ళిపోతున్నాను.

దీన్ని మీరు అహంభావం అనండి, అహంకారం అనండి, వొళ్ళు పొగరనండి, ఏదన్నా అనండి... అనుకోండి. నాకేం బాధలేదు.

నక్షత్రం ఆకాశంలోవుంటేనేఅందంగా కన్పిస్తూ, వెలుగుని పంచుతుంది. అది అక్కణ్నించి జారి భూమ్మీద పడితే, ఆ అందాల్ని, వెలుగుల్ని కోల్పోయి ఇక్కడున్న రాళ్ళలో ఒకటవుతుంది.

అలాగే భార్యనబడే వ్యక్తి ప్రేమా మానాలతో, ప్రవర్తనలద్వారా భార గౌరవాన్ని పొందాలిగాని, పశుబలంతోను సాంప్రదాయాలని అట్టిపెట్టుకుని కాదు

ఈ వుత్తరం చదివిన క్షణంనుంచైనా ఆలోచించటం మొదలుపెట్టండి.

మనసారా కావాలనుకుంటే అన్నీ వస్తాయి. వద్దనుకుంటే ఏదీ మిగల్దు... అదే జీవితం.

ఇందిర'

ఉత్తరం చదవటం పూర్తిచేసిన అతడు చలనరహితంగా అలాగే కూర్చుండి పోయాడు. మెరుపులాంటి బాధ తళుక్కున గుండెలో మొదలయ్యి, బుర్రలోకి జరజరా పాకుతున్నట్లు...నరాల్లోని బలమంతా ఒక్కసారిగా మాయమయ్యి, దావాల్లాగ వేలాడుతున్నట్లు భావన. జరిగింది నిజమని చెప్పుకోటానికి, వొప్పుకోటానికి ధైర్యం చాలటంలేదు. 'ఇందిర తమాషాకి చేసుంటుంది. షాక్ట్రీట్మెంటు కోసరం ఇలా చేసుంటుంది. ఇదంతా చిన్నడ్రామా అంతే! తెల్లవారేసరికి నవ్వుకుంటూ వచ్చేస్తుంది' అని సమాధానపర్చుకునేందుకు కాసేపు ప్రయత్నించేడు. కాని ఎంతసేపు అలా అని అనుకున్నా ఆ ఆలోచన వెనకనే నల్లటి నిజం– 'ఇందిర అంత తేలిగ్గా రాదు" అంటూ బుసలుకొడుతోంది.

ప్రకాశం కళ్ళపైన చేతులు అడ్డుంచుకు కూర్చున్నాడు.

ఏం చెయ్యాలో అర్థం కాకుండావుంది. వెళ్ళి భార్యని బెదిరించటమా? దానివల్ల ఘర్షణ తప్ప వుపయోగం వుండదు. లేక బతిమాలటమా? ఏం చెప్పి బతిమాలాలి? తాగుడు పూర్తిగా మానేస్తానని చెప్పి

బతిమాలాలా? అలాతనంటేనమ్ముతుందా? ఎంత చులకనైపోతాడు తను??

అసలయినా ఇపుడొచ్చి పడిన సమస్యకి నిజంగా కారణం తాగుడా? కాదు...తను చేసిన తప్పు ప్రసూన గురించి చెప్పటం. ప్రసూన గురించే పలవరించటం. అప్పట్నుంచే ఇందిరలో మార్పొచ్చింది. అది సహజం. నిజమైనతన బలహీనత తాగుడే కాని ప్రసూనని మర్చిపోలేకపోవటం కాదు. నిజానికి ప్రసూనను తానెప్పుడో మరచిపోయాడు. ఇపుడు తాను తాగుడు మానేయగలడు. మానేస్తే ఇందిర తిరిగి రావచ్చు- కాని, ఇందిరను ఒప్పించి తీసుకువచ్చేదెవరు?



ఇందిర వెళ్ళి పదిరోజులైంది. ఈ పది రోజుల్లోనే ప్రకాశంలో మానసికంగానూ, శారీరకంగానూ చాలా మార్పొచ్చింది.

తనకెవరూ లేరన్న లోన్లీనెస్- మార్కండేయుల్లాంటి ఫ్రెండు లేడు. 'పిచ్చి వెధవా' అన్చెప్పి ఆదరించే అమ్మ లేదు. మనసులోని తాపాన్ని చెప్పుకుని సేదతీర్చుకునేందుకు భార్య లేదు. నాన్నా అని ఎదురొచ్చి, గొడవపెట్టి, సందడిగా తిరిగే పిల్లలేరు...

ఏమిటీ జీవితం... ఎందుకిలా ప్రతి మలుపులోనూ ఎదురుదెబ్బలు, నల్లటి, చిక్కటి దుప్పటి కప్పినట్టు అశాంతి.

యాంత్రికంగా ఆఫీసుకెడుతున్నాడు. సాయంత్రం అయేసరికి నాగరాజు తగులుకుంటున్నాడు. చిత్తుగా తాగి ఏ రాత్రి వేళకో తిరిగొస్తాడు. మంచం వాల్చుకు పడుంటాడు. తిండి తినాలన్న ఇచ్ఛగాని, ఆలోచనగాని రాదు. పదిరోజులకే మొహం బాగా వాడింది. నల్లబడింది. కళ్ళకింద నల్లటి జ్ఞాపకాల్లాంటి చారలు. బట్టలు మార్చుకోవాలన్న ధ్యాసవున్నట్టుగాకూడా అన్పించదు. ఏదో నిర్లిప్తత, నిస్పృహ, విసుగు- అన్నీ అతడిలో చోటు చేసుకున్నాయ్. ఇందిరని తల్చుకోగూడదని పంతంపట్టేడు. ఆడదానికి అలా చేసి లోకువ కాగూడదని నాగరాజు నూరిపోస్తున్నాడు.

ఆఫీసులో అందరూ అతడిలోని మార్పుని గమనించేరు. అడిగినవాళ్ళకి ఏదో కారణం చెప్పితప్పుకున్నాడు. అసలు నాగరాజుకికూడా భార్యా పిల్లల్ని తనే పుట్టింటికి పంపినట్టు చెప్పాడేగాని జరిగింది చెప్పలేకపోయాడు.

ఒకరోజు తాగుతుండగా మిత్రుడొకడు అడిగాడు-"బ్రదర్! నువ్వురోజూ తాగెస్తావుగదా...మీ ఆవిడ గొడవచెయ్యదా" అని.

ఆ ప్రశ్నవిని నాగరాజు ఆశ్చర్యంగా అతడి వైపు చూసేడు.

"ఎందుకు చెయ్యదు. చేసేది.... కాని ఇప్పుడు కాదు- అలవాటైపోయింది. ఇపుడు తాక్కుండా వెడితే ఆశ్చర్యపడుతుంది"

"వెళ్ళిపోతానని ఎప్పుడూ బెదిరించలేదా?" అమాయకంగా అడిగాడు.

"ఎక్కడికి?"

"పుట్టింటికి"

"అక్కడమాత్రం ఎన్నాళ్ళుంచు

కుంటావు? ఎప్పటికయినా రావాల్సిందే"

నాగరాజు భార్యకి ఉద్యోగం లేదని ప్రకాశానికి తెల్సును.

"అయినా ఏం అలా అడిగావ్?" అన్నాడు పరీక్షగా చూస్తూ.

"అబ్బే.... ఏంలేదు. వూరికనే" అంటూ మాట మార్చేడు.

అయినా నాగరాజుకి విషయం అర్థమైంది.

రోజులు గడుస్తున్న కొద్దీ అశాంతి, ఆరాటాలు ఎక్కువవుతున్నాయ్. మనిషి చనిపోతే బాధ దినదినానికి తగ్గుతుంది. కాని కావాల్సినవాళ్లు బతికుండీ దూరమైతే బాధ దావానలంలా వ్యాపిస్తూ దిన దినానికి పెరుగుతుంది. ఆ విషయం అతడికి అనుభవపూర్వకంగా తెల్సింది.

ఒకసారెళ్ళి ఇందిరని కలిసి, పిల్లల్ని చూసొస్తే?

ఈ ఆలోచన చాలాసార్లు వచ్చింది. కాని ఏదో పిరికితనం, భయం-గిల్టీ కాన్షస్ వెళ్ళలేకపోయాడు.

ఆరోజు ఆఫీసులో కూర్చుని ఆలోచిస్తుండగా తటుక్కున మెరిసింది... ఫోన్చేస్తే?

ఆ ఆలోచన రావటంతోటే విచిత్రంగా కొండంత ఆనందం, ఏనుగంత బలం ఎక్కణ్ణించో వచ్చిపడ్డాయ్. చాలారోజుల తర్వాత మొహం ప్రసన్నమైంది. ఈపాటి ఆలోచన ఇంతకుమునుపు రానందుకు తనకు తానే నిందించుకున్నాడు.

వచ్చిన ఆలోచనని అమలుపర్చటానికి లేచి క్యాష్ క్యాబిన్లోంచి బయటికొచ్చి ఫోను దగ్గరకెళ్ళాడు.

నెంబర్ డయల్ చేస్తుంటే సన్నగా వణుకు.

అవతల్నించి ఎవరిదో మగ గొంతు. బహుశా వాళ్ళాఫీసరయివుంటాడు. "యస్ ప్లీజ్" అంటున్నాడు.

ప్రకాశం ఆరిపోతున్న గొంతుని సరి చేసుకుంటూ- "ఇందిర కావాలండీ" అన్నాడు.

"వన్ మినిట్"

కాస్సేపు నిశ్శబ్దం. ప్రకాశం ఆత్రంగా వింటున్నాడు.

రెండు క్షణాల తర్వాత "యస్.... ఇందిరా హియర్" స్పష్టంగా విని పిస్తోంది.

ప్రకాశం మాట్లాడాలని నోరు విప్పబోయాడు.

కాని ఏ అదృశ్య శక్తో అతడి గొంతు నొక్కేసిపట్టింది. మాట పెగల్లేదు.

"ఇందిరా హియర్...హూ ఈజ్ స్పీకింగ్ ప్లీజ్" అంటోంది అవలివైపు నించి. ప్రకాశానికి ఆ ధ్వని నాదస్వరంలా, వీణారవంలావుంది వినటానికి. రిసీవర్ని చెవికి వొత్తిపెట్టుకుని జాగ్రత్తగా వింటు న్నాడు. కళ్ళల్లో నీళ్లు తిరిగాయి.

కాస్సేపటికి ఫోన్ పెట్టేసినట్లు "క్లిక్" మన్న శబ్దం.

ప్రకాశం వచ్చికాబిన్లో కూర్చున్నాడు. మనసంతా వికలంగావుంది. మంటల్లో కూర్చున్నట్టు అసహనంగా, అనీజీగా అన్పించింది.

ఆఫీసయ్యాక బయటికొస్తుంటే నాగరాజన్నాడు— "నీతో ముఖ్యమైన విషయం మాట్లాడాలి" అని.

"ఏమిటది?"

"చెప్తా... పద" అన్నాడు. ఇద్దరూ నడుస్తున్నారు. కొద్దిక్షణాల తర్వాత అడిగాడు- "గత కొద్దిరోజులుగా చాలా వర్రీడ్‌గా వుంటున్నావ్. ఏనీ ట్రబుల్?" అనడిగాడు.

ఆ ప్రశ్న ఆశించని అతడు కంగారు పడ్డాడు. "అబ్బే... అదేంలేదు" అన్నాడు.

నాగరాజుకి నమ్మకం కుదరలేదు.

"ఏమైనావుంటే చెప్పు. నావల్ల అయ్యే సహాయం ఏదైనావుంటే తప్పక చేస్తా"

"థాంక్స్...కాని అటువంటిదేదీలేదు" అని నమ్మించటానికి నవ్వాడు.

రెండు క్షణాల తర్వాత మళ్ళీ అడిగాడు "నీ ఫ్యామిలీ వచ్చారా?"

ప్రకాశం లేదన్నట్లు తలూపాడు.

నాగరాజు మరి ఏం మాట్లాడలేదు. ఏదైనా సహజంగా పుట్టుకు రావాలిగాని బలవంతాన వచ్చేది బతకదు. స్నేహం కూడా అటువంటిదే. కల్సి తిరిగినంత మాత్రాన,తాగినంతమాత్రాన స్నేహితులు కారు. స్నేహానికి నిజాయితీ కావాలి.

నాగరాజు ఆటో పిల్చేడు. ఇద్దరూ ఎక్కేరు.

ఎక్కడికని ప్రకాశం అడగలేదు. ఎక్కడికో నాగరాజు చెప్పలేదు.

కాని ఇద్దరికీ తెలుసు గమ్యం ఎక్కడికో.

ఆటోలో మళ్ళీ నాగరాజే అన్నాడు- "సమస్యలు నిప్పుకణికల్లాంటివి. వాటిని గుండెల్లో పెట్టుకుని దాచాలని ప్రయత్నిస్తే అవి ఆ గుండెనే హోమగుండంగా మార్చేసి మనిషిని దహించివేస్తాయి. స్నేహితుడితో పంచుకుంటే నీళ్ళు చల్లినట్టు ఆరిపోతాయ్"

"సమయం వచ్చినపుడు తప్పక చెబుతానోయ్" అన్నాడు.

నాగరాజు మరెందుకనో మౌనంగానే వుండిపోయేడు.

ఆటో ఆగింది. ఇద్దరూ దిగేరు.

ప్రకాశం ఆ బార్‌కి ఎప్పుడూ రాలేదు. అక్కడ తాగుడుతోపాటు కేబరే డాన్సులు కూడా వున్నాయని అప్పుడే తెల్సింది.

లోపల వరుసగా టేబుల్సు, కుర్చీలు, వాటికి కాస్త దూరంలో చిన్న ఫ్లాట్ ఫారం లాంటిది. దానిపైన మ్యూజికల్ బ్యాండు.

అప్పటికే దాదాపు సీట్లన్నీ నిండి పోయినాయ్.

నాగరాజు డ్రింక్స్‌కి ఆర్డరిచ్చాడు.

కాస్సేపటికి సంగీతం ప్రారంభమైంది. రకరకాల సినిమా పాటలు వాయిస్తున్నారు. అందరూ ఆనందిస్తున్నట్లు కింద కాళ్ళు, పైన తలకాయలు ఆడిస్తున్నారు.

ప్రకాశం అప్పటికే రెండు రౌండ్లు పూర్తిచేసేడు.

ఒక అరగంట గడిచాక వున్నట్లుండి అంతా గాఢాంధకారమైపోయింది. కొద్ది క్షణాలకి లాంఛనప్రాయంగా, బలహీనమైన కాంతి ఆ ఫ్లాట్‌ఫారంపై పడింది. ఆ కాంతిలో ఇద్దరు ఆడవాళ్ళు పాతికేళ్ళ వయసుంటుంది. ఇద్దరూ నల్లగానే వున్నారు. ఇద్దరి శరీరాల్లోనూ వంపులు అధికంగానే వున్నట్లనిపిస్తోంది.

వాళ్ళిద్దరూ నైట్ గౌన్సు లాంటివి వేసుకున్నా, బిగించి కట్టిన అవయవాలు రెచ్చగొట్టేట్టుగా కన్పిస్తున్నాయ్. కత్తిరించుకున్న కనుబొమ్మలు, మేకప్ వేసుకున్న మొహాలు, ఎన్నో ఏళ్ళ అనుభవాన్ని నింపుకున్న వంకర నవ్వులు, వాలుచూపులు... కైపెక్కిన కళ్ళకి అప్సరసల్లా కన్పిస్తున్నారు.

అందరూ ఆశగా ఆత్రంగా చూస్తూ చూపులతోనే వ్యభిచరిస్తున్నారు. మ్యూజిక్కు కూడా సినిమా సంగీతాన్ని వదిలి వ్యాపార సంగీతాన్ని ఆలింగనం చేసుకుంది.

ఆ ఆడపిల్లలిద్దరూ విచిత్రంగా కుప్పి గంతులువేస్తూ, కవ్విస్తూ, ఒంటిపైని బట్టలని ఒక్కొక్కటే విప్పేస్తున్నారు.

మందు మహర్షులు వాళ్ళని కన్నార్పకుండా, తపోభంగం చెయ్యటానికొచ్చిన అప్సరసల్లా కాకుండా తపస్సుకి మెచ్చి సాక్షాత్కరించిన దేవతలని చూసినట్లు చూస్తున్నారు.

ప్రకాశానికి ఎందువల్లనో అది కాస్త ఇబ్బందిగా, బాధగా అనిపించింది.

నాగరాజు మాత్రం చాలా వుత్సాహంగా చూస్తున్నాడు.

సంగీతం పిచ్చెక్కిచ్చేస్తోంది.

అర్ధనగ్నంగా వాళ్ళిద్దరూ రెట్టింపు పిచ్చెక్కిస్తున్నారు. వాళ్ల అక్కణ్ణించి కదిలి ఒక్కొక్క బల్లదగ్గరకి వస్తున్నారు. ఒక్కక్షణం ఒక్కొ మనిషి దగ్గర! వాళ్లు చెయ్యబోయే చిలిపిపన్లని ఒడుపుగా వారిస్తూ పక్కవాడి దగ్గరికి.

ప్రకాశానికి కళ్లు వాలిపోతున్నాయ్. అక్కడే హాయిగా నిద్రపోదామనిపించింది.

నాగరాజు వాళ్ళిద్దరి వంకా చూస్తున్నాడు.

కాస్సేపటికి వాళ్ళిద్దరూ మళ్లీ ఫ్లాట్ ఫారంపైకెళ్లారు.

మ్యూజిక్ వేగం పెరిగింది.

ఆ ఆడవాళ్ళిద్దరూ ఒంటిపై మిగులున్న బట్టలుకూడా తీసేస్తున్నారు. ఒకటి.. రెండు..మూడు క్షణాలు...పూర్తి నగ్నత్వం. తర్వాత అంతా చీకటి.

బిల్లు చెల్లించి ఇద్దరూ బయటికొచ్చారు. ప్రకాశాన్ని అక్కడే వుండమని, నాగరాజు తిరిగి లోపలికెళ్లాడు.

పదినిముషాలకిగాని బయటికి రాలేదు. అప్పటిదాకా ప్రకాశం పక్కనేవున్న కిళ్ళీబడ్డీ ముందున్న చెక్కబల్లపై కూర్చున్నాడు.

నాగరాజు తిరిగొచ్చాక ఇద్దరూ మళ్ళీ ఆటో ఎక్కారు. తోవలో ప్రకాశాన్ని అడిగాడు – "రేపుదయం తొమ్మిదింటికి మీ ఇంటికొస్తా...ఇంట్లోవుంటావా?" అని.

ప్రకాశం వాలిపోతున్న కనురెప్పలని అతికష్టంపై తెరచి "దేనికి?" అనడిగాడు.

దానికి నాగరాజు సూటిగా సమాధానం ఇవ్వకుండా, "పనుంది...ఇంట్లోనే వుండు" అన్నాడు.

సరేనన్నట్లు తలూపేడు ప్రకాశం.

* * *

ఎవరో తలుపు తడుతున్నారు.

ప్రకాశం వులిక్కిపడి లేచాడు. వళ్ళంతా విరగ్గొట్టినట్టుగా వుంది. నోరంతా చేదుగా, అసహ్యంగా వుంది. కళ్లు మండుతున్నాయి.

విసుగ్గా లేచెళ్ళి తలుపు తీసేడు.

వాకిట్లో చిరునవ్వుతో నిల్చున్న నాగరాజుని చూసి ఆశ్చర్యపోలేదుగాని, ఆ వెనుక నిల్చున్న ఆడమనిషిని చూసి భయపడ్డాడు.

ఎవరామె? ఇక్కడికెందుకు తీసుకొచ్చాడు??

నాగరాజు చొరవగా లోపలికొస్తూ– "ఇంకా నిద్ర మంచంలోనే వున్నావా? త్వరగా స్నానం పూర్తిచెయ్యి" అన్నాడు.

నాగరాజు వెనకాలే ఆమెకూడా లోనికొచ్చింది.

ప్రకాశం దొడ్లోకెళ్ళబోతూ ఆమె వంక పరీక్షగా చూసేడు. ఎక్కడో చూసినట్లనిపించింది. కాని వెంటనే గుర్తురాలేదు.

పాతికేళ్ళ వయస్సు పెటపెటలుగా వుంది. నైలాన్ శారీకన్నా కట్టిన పద్ధతి చాలా నీటుగా రెచ్చగొట్టేలా వుంది. పెదాలకి సుతారంగా పులిమినరంగు,

కళ్లకి గాగుల్స్, అందంగానూ ఆశలు గొల్పేలా వుంది.

ప్రకాశం స్నానంచేస్తూకూడా ఆలోచించేడు.

ఎక్కడో చూసినట్టు బాగా గుర్తుంది. కాని ఎక్కడ? ఆఫీసులోనా...కాదు. నాగరాజు ఇంట్లోనా...కాదు—మరెక్కడ? ఏదైనా బార్‌లోనా? బా...ర్...

అప్పుడు గుర్తుకొచ్చింది.

రాత్రి తామెళ్ళిన బార్‌లో కాబరే డాన్సర్!

ఆ విషయం గుర్తుకిరాగానే, ఆమెని నాగరాజు ఎందుకు తెచ్చాడో ఇట్టే అర్థమైంది.

స్నానం పూర్తిచేసి భయం భయంగా లోపలికొచ్చాడు.

నాగరాజు, ఆమె ముందు గదిలో కుర్చీల్లో పక్కపక్కనే ఆనుకుని కూర్చు



మన్నారు. అతడేదో అంటే ఆమె అతడి మీదికి వొరిగిపోతూ పెద్దగా నవ్వుతోంది. నాగరాజు ఆమె భుజంచుట్టూ వెనకనించి చెయ్యి పోనిచ్చి ఏవేవో చిలిపిపన్లుచేసి రెచ్చగొడుతున్నాడు.

ప్రకాశం పైజమా వేసి, బుషర్టు తొడుక్కున్నాడు. తల దువ్వుకుని వాళ్లిద్దరున్న గదిలోకొచ్చాడు.

అతణ్ని చూసి నాగరాజు లేచి నిలబడి, "ఫ్లాస్కుందా?" అనడిగాడు.

ప్రకాశం వుందనగానే "ఇలాతే ... కాఫీ, టిఫిన్లు పట్టుకొస్తాను" అన్నాడు.

లోపకెళ్ళి ఫ్లాస్కు తెచ్చి స్నేహితుడికి అందించేడు.

నాగరాజు బయటికెళ్ళబోతూ-"ఆమె పేరు సుష్మ. ఇతడు ప్రకాశం...నా బెస్ట్ ఫ్రెండ్" అన్చెప్పి పరిచయాల్చేసి, "మా వాడికి కాస్త బెరుకెక్కువ. అంచేత జాగ్రత్తగా చూస్కో" అంటూ వీధి తలుపు దగ్గరగావేసి వెళ్ళిపోయాడు.

ప్రకాశం కుర్చీని కాస్త దూరంగా జరుపుక్కూర్చున్నాడు.

ఆమె వెంటనే తన కుర్చీని అతడికి దగ్గరగా లాగి, "మొగాడివి...అంతగా భయపడితే ఎలా?" అంటూ చొరవగా అతడి చేతిని అందుకుంది.

ప్రకాశం విదిలించుకోబోయాడు. కాని ఆమె గట్టిగా పట్టుకుంది. అలాగే పట్టుకుని, "ఇది సొంతిల్లా?" అనడిగింది.

కాదన్నాడు.ఆమె అడుగుతున్న ప్రశ్నలన్నింటికి యాంత్రికంగా సమాధానాలిస్తూనే, తన చేతిని వెనక్కు తీసుకునే ప్రయత్నం చేస్తున్నాడు.

అంతలో తలుపు ఎవరో సుతారంగా తట్టినట్టు శబ్దమైంది. నాగరాజే అయ్యుంటాడన్న వుద్దేశంతో "కమిన్"అన్నాడు.

తలుపు తెరుచుకుంది. కాని-

ఆ వచ్చిందినాగరాజు కాదు...ఇందిర!

ప్రకాశం లోపలికొచ్చిన భార్యవంక నమ్మలేనట్లుగా చూశాడు. నెత్తిన పిడుగు పడినట్లు అప్రతిభుడైపోయాడు. మాట రాలేదు. చేతులు, కాళ్ళు ఆడలేదు.సుష్మ చేతిలోవున్న అతడి చెయ్యి అలాగేవుండిపోయింది.

ఇందిర ఆ దృశ్యంచూసి అవాక్కయిపోయింది. వచ్చేముందు భర్త ఏ స్థితిలో వుంటాడో, తనని చూడగానే ఏమేమంటాడో వూహించుకునొచ్చింది. నిన్న తనాఫీసుకి ఫోన్చేసి, తీరా తనొచ్చేసరికి ఫోన్ పెట్టేసింది భర్తేననిఆమెకు తెలుసు. జరిగిందానికి బాధపడుతున్నాడని, దాన్ని చెప్పలేక మధనపడుతున్నాడని అంచనా కట్టి, తనూ మూర్ఖంగావుంటే బావుండదని వచ్చింది.

తీరా వచ్చాక కన్పించిన దృశ్యం చూసేక, తన అంచనాలు, ఆలోచన్లు నిజంకావని అర్థమైపోయింది. తను దూరమైనందుకు అతడేం బాధపడటంలేదు. పైగా తీరని కోర్కెలని తీర్చుకుంటున్నాడు!

సుష్మ వాళ్ళిద్దరివంక మార్చిమార్చి ఆసక్తిగా చూస్తోంది.

ముందుగా తేరుకుంది.ఇందిరే."సారీ...కూడని సమయంలో వచ్చినట్టున్నా. పిల్లల స్కూలు ప్రోగ్రెస్ కార్డులు తీసుకెళ్ళటం మరిచాను. అందుకని..." అనుకుంటూ మధ్యగదిలో కెళ్ళింది. అల్మరా తీసిన శబ్దం...

సుష్మ "ఎవరామె?"అని ప్రకాశాన్ని కుదిపి అడగటంతో వులిక్కిపడి వాస్తవంలోకొచ్చాడు.

గడుస్తున్న ప్రతిక్షణం తన

వ్యక్తిత్వాన్ని, నిర్దోషిత్వాన్ని, భవిష్యత్తుని, బతుకుని సమిధలుగామార్చి తగులపెట్టేస్తున్నాయని తెలుసుకునేందుకే కాస్సేపు పట్టింది. కాని, అప్పటికే ఆలస్యమైంది.

ఇందిర ప్రోగ్రెస్ కార్డులని చేత్తో పుచ్చుకుని వచ్చి బయటికి వెళ్ళబోతూ సుష్మ వంక పరీక్షగా చూసింది. ఆమె వదనంలో చాలా తేలికభావం స్పష్టంగా కన్పించింది. దేవాలయంలోకి జొరబడ్డ దొంగవెధవని చూసినట్లుగా చూసి బయట వెళ్ళబోయింది.

అప్పటికికాని ప్రకాశానికి తన కర్తవ్యం గుర్తుకి రాలేదు.

వెంటనే కుర్చీలోంచి లేచాడు. వెళ్ళిపోబోతున్న భార్యతో, "ఇందూ... ఈమె నా ఫ్రెండ్. నాగరాజు... కాఫీ..." మాటలుదొరక్క ముక్కలు ముక్కలుగా చెప్ప ప్రయత్నించాడు.

కాని ఆమె వినే స్థితిలోలేదు. వినాలన్న కుతూహలంకూడాలేదు. ఇప్పటి వరకూ ఇంకా అతడిపట్ల మిగులున్న జాలి, ప్రేమ, ఆప్యాయతలు ఆ క్షణంలో పూర్తిగా అంతరించిపోయినాయి.

"సారీ ఫర్ ది డిస్టర్బెన్స్" అనుకుంటూ వీధి తలుపుని దగ్గరగా వేసి బయటకెళ్ళిపోయింది.

ప్రకాశం అలాగే అచేతనంగా నిల్చుండిపోయాడు.

సుష్మ కుర్చీలోంచి లేచి, అతడి చేతిని అందిపుచ్చుకుంటూ, "ఎవరామె?" అనడిగింది.

ప్రకాశం ఆమెని బలంగా వెనక్కునెట్టి, అలస్యమవుతున్నట్లుగా చెప్పులు తొడుక్కుని బయటికొచ్చేడు.

ఇందిర జాడలేదు.

ఇందిరని కల్సుకోవాలి. వెనక్కి తీసుకొచ్చి నాగరాజు సమక్షంలో జరిగినదంతా చెప్పి తన నిర్దోషిత్వాన్ని రుజువు చేసుకోవాలి. అదే అతడి ఆరాటం.

బస్సుస్టాపు వైపుగా పరిగెత్తాడు.

ఒకళ్ళిద్దరు అతడివైపు విచిత్రంగా చూసారు.

ఇందిర బస్సుస్టాండులో కూడా లేదు.

మళ్ళీ వెనక్కి పరిగెత్తుకుంటూనే వచ్చాడు. దారిలోను కన్పించలేదు.

నాలుగిళ్ళకవతలున్న రమణమ్మ ఇంటివైపుగా పరిగెత్తాడు.

ఆ ఇల్లు తాళంవేసుంది.

ఇందిర బయటకు రాగానే ఎదురుగా ఆటో కన్పించగా అందులో కూర్చుని వెళ్ళిపోయిందని తెలిసి అతడు చాలాసేపు ఆమెకోసం రోడ్డవెంట వెతికేడు.

చివరికి నీరసం, నిస్త్రాణగా కాళ్ళీడ్చుకుంటూ ఇంటికొచ్చేడు.

తలుపు గడియ పెట్టుంది. లోపల్నించి నాగరాజు, సుష్మ గుసగుసలుగా మాట్లాడుకుంటున్నారు. చిన్నగా, చిలిపిగా నవ్వుకుంటున్నారు.

ప్రకాశం వీధివాకిట్లోనే కూలబడ్డాడు. తలుపు తట్టాలనికూడా అన్పించలేదు.

ఇప్పుడతనికి ఎవరిమైనా కోపంగాని, ద్వేషంగాని లేవు. కన్పించని అదృశ్యశక్తి పనిగట్టుకుని తన జీవితాన్ని కూలదోయాలని, తన సంసారాన్ని కూకటివేళ్ళతో పెకలించివెయ్యాలని పథకం ప్రకారం చేస్తుంటే సామాన్యుడు, మానవమాత్రుడైన తనేం చెయ్యగలడు? ఎవర్ని నిందించి ఏమిటి ప్రయోజనం?? కొండపెనించి రాళ్ళవర్షం కురుస్తుంటే, ఆ కొండ నధిరోహించి, ఆ వర్షాన్ని ఆపుచెయ్యటం సాధ్యమా??

ఆ క్షణంనుంచి అతడిలో అంతరు

మునుపు మిణుకుమిణుకుమంటున్న ఆశ కూడా చచ్చిపోయింది. పూర్తి నిరాశ కమ్మేసింది.

కొద్దిక్షణాలు అతడిలో భావసంఘర్షణ... ఒక్కక్షణం చాలు–

మనిషి ఆలోచనాధోరణి మారిపోవటానికి, జీవితగమనం కొత్తదార్లు పట్టాటానికి. ఒక్కక్షణంలోనే కసాయిగా బతికిన బోయవాడు మహర్షయ్యాడు. ఒక్కక్షణంలో చేసిన తప్పిదానికే జీవితకాలం రాతిగోడల మధ్యన, కటకటాల వెనుక మగ్గిపోయేవారెందరో!

ఒక్కక్షణంలో మనస్సు పెకల్చుకుంటే దాంట్లోంచి పుట్టే శక్తిని ఎవ్వరూ ఆపలేరు.

ఆవిధంగా పీధివాకిట్లో కూర్చుని సీక్కారిపోయే ఆలోచనచేస్తున్న అతడి అంతరంగంలో ఒక్కసారి, వున్నట్టుండి వేలు లక్షల మెగావాట్ల విద్యుత్తుకి సరైన వేడి..విశ్వాన్ని మొత్తం భస్మంచెయ్యటానికి సరిపడ వేడి ఫట్‌మని భగ్గున బద్దలైంది.

కసి. పగ, ద్వేషం, కోపం చూది పింజల్లాగా మనో వీధిలో ఎగిరెగిరి పడుతున్నాయ్.

ప్రకాశం లేచి నిల్చున్నాడు.

అతడి కళ్ళు ఎర్రగా జ్వలిస్తున్నాయ్. ఒళ్ళంతా వెచ్చగా పొగలు సెగలు కక్కుతోంది.

ఆవేశంగా తలుపు తట్టేడు.

కొద్దిక్షణాలకి నాగరాజు తలుపు తీసేడు. అతడు చిన్న టవలు మాత్రమే చుట్టుకునున్నాడు. మిత్రుణ్ణి చూసి అర్థవంతంగా నవ్వేడు.

ప్రకాశం లోనికెళ్ళి నాగరాజుని బలంగా బయటికి నెట్టేడు. పరాగ్గావున్న అతడు ఆ బలమైన తోపుడికి వెళ్ళి వీధి గడపలో పడబోయి అతికష్టంపై నిల్చున్నాడు. జరిగిందేవిటో తెల్సుకునే సరికి ప్రకాశం తలుపు గడియపెట్టేడు.

సుష్మ బ్లాంకెట్‌ని మెడవరకు లాక్కుని పడుకునుంది.

ప్రకాశం ఆ గదిలోకెళ్ళాడు. ఆమె పంక పళ్ళు పటపటలాడిస్తూ కోపంగా చూసేడు.

ఆమెకి భయంవేసింది. అతడు ఇందాకటివ్యక్తికదు. విచిత్రమైన, భయం పుట్టించే మార్పు...ఆమె అక్కణ్ణుంచి లేవబోయింది.

ప్రకాశం ఆ అవకాశం ఆమెకివ్వలేదు. ఒక్కసారిగా చేతికందిన బెల్టు తీసుకొని ఇష్టంవచ్చినట్లు బాదేసేడు.

బయట నాగరాజు చాలా అసహ్యమైన పరిస్థితిలో వున్నాడు. ఒంటిపైన చిన్న టవలు..నడిరోడ్డు..అందరూ ఆశ్చర్యంగా ఆగి చూసి వెడుతున్నారు.

అక్కడికీ రెండుసార్లు తలుపుతట్టేడు. సమాధానంలేదు. పైగా లోపల్నుంచి సుష్మ అరుపులు.

కాస్సేపు వ్యవధినిచ్చి మళ్ళీ తలుపు తట్టేడు.

ఈసారి ప్రకాశమే వచ్చి తలుపు తీసేడు.

నాగరాజు ఒక్క గంతు లోనికేసి తలుపు గడియపెట్టాడు.

ప్రకాశం పిచ్చివాడిలా వున్నాడు. కళ్ళు ఎర్రగా, జుట్టు రేగిపోయింది. ఒక్క కుర్చీలో కూర్చున్నాడు.

ఆపైన భోరున ఏడ్వడం మొదలు పెట్టాడు.

నాగరాజు అక్కణ్ణుంచి కదిలి లోపలికెళ్ళాడు.

సుష్మ అలాగే శవంలా పడుకు నుంది. బాధవల్ల కాబోలు ఏడుస్తోంది.

ప్రకాశం మనోస్థితి సరిగ్గా లేదని గమనించిన నాగరాజు సుష్మని త్వరగా బయటపడమని సంజ్ఞ చేసేడు.

కాస్సేపటికి సుష్మ బట్టలేసుకుని, నాగరాజు అందించిన డబ్బు తీసుకుని భయం భయంగా వెళ్ళిపోయింది.

ప్రకాశం అలాగే కూర్చునున్నాడు. కళ్ళవెంట నీళ్ళు కారుతూనే వున్నాయ్, అతడిని పలకరించటం ఇష్టంలేనట్టు, నాగరాజు అక్కడే వున్న మరో కుర్చీలో నిశ్చలంగా, నిశ్శబ్దంగా కూర్చున్నాడు చాలా సేపు.

* * *

ప్రకాశం ఆఫీసుకి సరిగా వెళ్ళటం లేదు. వెళ్ళినా పనిమీద శ్రద్ధ చూపించటం లేదు. పరధ్యానంగా ఏదో పోగొట్టు కున్నవాడిలా నీరసంగా, దిగులుగా ఉంటున్నాడు.

ఇందిర వెళ్ళిపోయాక వచ్చిన నిస్పృహ, నిరాశలు అతడిలో మరింత బలంగా వేళ్ళు నాటుకున్నాయ్.

తాగటం కూడా ఎక్కువైంది. గతంలో సాధారణంగా ఆఫీసయ్యాకే తాగేవాడు. కాని ఇప్పుడు పగలు కూడా తాగేస్తున్నాడు. అప్పుడప్పుడు తాగి ఆఫీసుకు కూడా వస్తున్నాడు.

వాళ్ళ ఆఫీసరు రామ్మూర్తిగారు ధర్మరాజు లాంటివారు. అజాత శత్రువు. మొదట్లో ఎలా వుండేవారో ఎవ్వరికీ తెలీదుగానీ ఇంకా కొద్ది నెలల్లో రిటైరై పోతారని తెల్సి, అందరితోనూ ఆప్యాయంగా, కలివిడిగా వుంటున్నారు. అలాంటి గంగిగోవులాంటి రామ్మూర్తి గారికి కూడా ప్రకాశాన్ని చూస్తుంటే కోపం కట్టలు తెంచేసుకుంటోంది.

రామ్మూర్తిగారికి అతడి మనోస్థితి పరిస్థితులు తెలీవు.

ప్రకాశానికి వున్నట్టుండి పిల్లల్ని చూడాలనిపిస్తుంది. ఒక్కోసారి భార్య, మరికొన్ని సందర్భాల్లో ప్రశాన్త, మార్కండేయులు గుర్తుకొస్తారు.

విచిత్రంగా ఈమధ్యన భార్యా పిల్లలే గుర్తుకొస్తున్నారు. వాళ్ళ గురించే ఆలోచన్లు... ఆలాపన... ఆవేదన.

ఒకరోజు ఆఫీసులో తన క్యాబిన్లో కూర్చునున్నాడు. మధ్యాహ్న సమయం ఆరోజుకి పని పూర్తయింది. దీర్ఘాలోచన్లో వున్నాడు. మొహం పీక్కుపోయింది. గడ్డం బాగా ఏపుగా పెరిగింది. బట్టలు నలిగివున్నాయ్.

అలా నీరసంగా కూర్చుని దీర్ఘంగా ఆలోచిస్తుండగా, ఒక్కసారి పిల్లల్ని చూడాలన్న కోర్కె కల్గింది. భార్య వెళ్ళిపోయిన నెలరోజుల్లో ఎన్నోసార్లు ఈ కోర్కె పుట్టింది. నిజానికి కావాలను కుంటే వాళ్ళు చదువుతున్న స్కూలుకెళ్ళి చూడొచ్చు.

కాని ఏదో అతడికే అర్థంకాని పిరికి తనం- ఎక్కడ పిల్లలు వెళ్ళి తల్లికి చెబు తారోనని. అలా చెబితే తన పిరికితనం బయటపడి తన పరాజయాన్ని తానే ఒప్పేసుకున్నట్టవుతుందన్న బెంగ. కాని ఇప్పటి పరిస్థితి వేరు.

ఆరోజు అవిఘంగా పిల్లల్ని చూడా లని ఆలోచన రాగానే చటుక్కున బయటి కొచ్చి క్యాబిన్ లాక్‌చేసి తాళాన్ని రామ్మూర్తి టేబిలుపైన పెట్టేసి బయటకి నడిచాడు.

రామ్మూర్తిగారు అతడి ప్రవర్తన అర్థంకానట్టు వెర్రిగా, అర్థం అయినట్టు

కోపంగాను కూడా చూసేది.

అతడు సరాసరి బయటికొచ్చి, స్కూలు అడ్రసుచెప్పి ఆటోలో కూర్చున్నాడు.

అప్పుడు సరిగ్గా నాలుగయింది.

సాయంత్రపు నీరెండలో రోడ్లు అందంగా కన్పిస్తున్నాయి. రివ్వున బాణాల్లా దూసుకుపోతున్న ఆటోవాళ్లు, వాళ్ళనధిగమిస్తున్న సైకిలిస్టులు, గర్భిణీ స్త్రీలలాగా మెల్లిగా వెడుతున్న సిటీ బస్సులు...రోడ్లు సందడిగా కూడా వున్నాయి.

ప్రకాశం ఆటోని స్కూలుకి కాస్త దూరంగానే ఆపించాడు. అప్పుడే స్కూలు వదిలారు. పిల్లలు గుంపులు గుంపులుగా ఇళ్ళదారి పడుతున్నారు. పగలంతా చదవటంచేతనో లేక మోయలేని పుస్తకాల బరువులు మోయటం చేతనో అందరి మొహాలు దాగా వాడి అలసటగా వున్నాయి. వాళ్ళ వెనక వస్తున్న టీచర్లు నలగని ఇస్త్రీ మడతల్లాగా కులాసాగా వున్నారు.

ప్రకాశం వచ్చి స్కూలుకి కాస్త దూరంలో నిలబడి వెళ్ళిపోతున్న పిల్లల గుంపుల్లో తనవాళ్ళకోసం ఆత్రంగా కళ్ళతోనే వెతుకుతున్నాడు.

కాస్సేపటికి అతడి కృషి ఫలించింది.

ఇద్దరు పిల్లలు రవి, రమ మెల్లిగా కాళ్లీడ్చుకుంటూ వస్తున్నారు.

రమ పెద్దది. ఇద్దరికి రెండేళ్ళ తేడావుంది.

రమ తమ్ముడి చేతిని గట్టిగా పట్టుకుంది. రవి జారిపోతున్న లాగుని పైకి లాక్కుంటూ బస్తాలాంటి పుస్తకాల సంచిని భుజాన వేసుకుని అక్క వెంట నడుస్తున్నాడు.

ప్రకాశం కదలకుండా అక్కడ్నించే ఇద్దర్నీ పరీక్షగా చూసేడు.

ఇద్దరూ కాస్త చిక్కినట్లు అన్పించింది. ఆ లేత మనసుల్లో అర్థంకాని, చెప్పుకోలేని దిగులు, బాధ. తల్లి తండ్రి వైషమ్యాల నడుమ నలిగిపోయేది, నష్టపోయేది ఎప్పుడూ పిల్లలే.

ఇద్దరూ రోడ్డు పక్కనించి నడుచుకుంటూ మెయిన్ రోడ్డువైపు వెడుతున్నారు.

ఇద్దరికీ స్కూలు యూనిఫారమ్ నలిగిపోయి మాసిపోయింది. కాలి బూట్లు, సాక్సు అవసానదశలో వున్నట్లు చిరిగి వేలాడుతున్నాయి.

వాళ్ళిద్దర్నీ చూస్తున్న ప్రకాశానికి కళ్లు చెమ్మగిల్లినాయి.

రమ చేతిలో చిన్న సత్తు టిఫిన్ కారియర్, భుజానికి వాటర్ బ్యాగ్ వేలాడుతున్నాయి.

ఆ టిఫిన్ కారేజీని విప్పి వాళ్ళిద్దరూ ఆత్రంగా, ఆకలిగా అన్నం తింటున్న దృశ్యం వూహించుకుంటే గుండెలో ఎవరో చెయ్యిపెట్టి తిప్పినట్లనిపించింది.

ఆ వయసులో అర్థం పర్థం తెలీని వాళ్ళకి ఎన్ని బాధ్యతలు? ఇస్త్రీ యూనిఫారమ్స్‌లో, స్టీలు క్యారేజీలతోనూ ప్రక్కనే స్కూటర్లపైన వచ్చే పిల్లలతో పోలిస్తే వీళ్లెపాటి? తన పిల్లలుగా పుట్టినందుకు వాళ్లకేవిడిస్తున్నట్టు?

ప్రకాశానికి ఒక్కసారిగా తన తల్లి తరచు తండ్రితో అంటుండే మాట గుర్తుకొచ్చింది- 'మన కడుపున పుట్టి వాడేం బావుకున్నాడండీ' అని.

అప్పట్లో ఆ మాట తన హక్కుల్ని నష్టచేస్తున్నట్లు ధైర్యంగాను తల్లిపైన తన గౌరవాన్ని పెంచేదిగాను వుండేది.

పిల్లలిద్దరూ మెయిన్‌రోడ్డుని సమీపించి, దాన్ని దాటలేక అలాగే రోడ్డు అంచున నిల్చున్నారు.

ప్రకాశానికి వాళ్ళిద్దర్నీ పిల్చి, కాస్సేపు ముద్దులాడి, ఏదైనా కొనిచ్చి పంపాలని గట్టిగా వుంది. కాని ఆ ఆలోచన వెనకే ఒక భయం. ఇంటికెళ్ళి తల్లితో చెబితే, ఇందిర తనపైన కోపం, ద్వేషం చేత వాళ్ళని స్కూలు కూడా మాన్పించేయొచ్చు. అపుడు ఇలా రహస్యంగానైనా చూసే అవకాశం కూడా వుండదు.

ఆ ఆలోచన రావటంతో భయం కోర్కెని చంపేసింది.

పిల్లలిద్దరూ అక్కడే అలాగే నిల్చున్నారు. ఆ సమయంలో మెయిన్‌రోడ్డు చాలా రద్దీగా వుంటుంది. వాళ్ళు ఆ రోడ్డు దాటి, కాస్త దూరం నడిచి బస్సెక్కాలి.

నిల్చున్న అతడికి ఒక ఆలోచన వచ్చింది.

పక్కనే వున్న రిక్షావాణ్ని పిలిచాడు. తీపబడిగా కూర్చుని, సుఖంగా బీడి తాగుతున్న అతగాడు పులిక్కిపడి రిక్షాతో సహా కదిలొచ్చాడు.

ప్రకాశం అతడికి దూరంగా నిల్చున్న పిల్లల్ని చూపించి, ఎక్కడికి తీసుకెళ్ళాలో అడ్రస్సు చెప్పాడు.

రిక్షా అతను సరే అనటంతో అయిదు రూపాయల కాగితం అతడి చేతిలోపుంచి వెళ్ళమన్నాడు.

రిక్షా కదిలింది.

ప్రకాశం అలాగే నిల్చుని ఆత్రంగా చూస్తున్నాడు.

రిక్షా అతను వెళ్ళి రమతో ఏదో చెప్పి ఎక్కమంటున్నాడు.

కాని ఆమె చిన్నదైనా అతడితో ఏదో వాదిస్తోంది.

ప్రకాశానికి నవ్వొచ్చింది.

రమదంతా వాళ్ళమ్మ పోలిక. చాలా జాగ్రత్తగా వుంటుంది.

దానికి తగ్గట్టు తను కూడా చెబుతుండేవాడు – "ఎవరు పిల్చినా వెళ్ళకూడదని, ఏం పెట్టినా తినరాదని"

అవి గుర్తుకొచ్చి పిల్లదాని జాగ్రత్తకి నవ్వొచ్చింది.

రిక్షావాడు ప్రకాశం నిల్చున్నవైపుగా చూపించి ఏదో చెప్పాడు.

పిల్లలిద్దరూ అతడున్నవైపుగా చూడటంతో ప్రకాశం కిళ్ళీబడ్డీ వెనగ్గా తప్పుకున్నాడు.

కొద్దిక్షణాల తర్వాత కొద్దిగా తల బయటపెట్టి చూసేడు.

పిల్లలిద్దరూ రిక్షా ఎక్కి కూర్చున్నారు– రిక్షా కదిలింది.

అప్పుడుగాని ప్రకాశం అక్కణ్నించి కదల్లేదు.




ఆ తర్వాత మూడ్రోజులు ప్రకాశం ఆఫీసుకెళ్ళలేదు. వుదయం ఇంట్లో బయల్దేరేటప్పుడు ఆఫీసుకనే బయల్దేరేవాడు. కాని సగం దూరం వచ్చాక మనసు మారిపోయేది. అక్కణ్నించి ఎక్కడెక్కడో తిరిగేవాడు..కాళ్ళు అరిగేటట్టు,పిచ్చివాడిలా తిరిగేవాడు.

ఒకరోజు ఇందిర ఆఫీసు ముందు

రోజంతా కూర్చున్నాడు. తీరా ఆమె ఇంటి కెళ్ళిపోతుంటే అలాగే మూగగా చూస్తూ నిల్చుండిపోయేడేగాని ఆప్యాయంగా పిలవలేకపోయాడు.

ఆరోజు బాధ మరింత అధికమైంది. అంచేత మరింత తాగేడు. మర్నాడు ఆఫీసుకెళ్ళినా విస్కీ వాసన గుప్పుమని కొట్టేటట్టు తాగేడు. అతడి వాలకాన్ని చూసి రామ్మూర్తిగారు విసుక్కుని, మందలించారు.

"చేస్తున్న వుద్యోగం పట్ల కాస్త బాధ్యత చూపించాలోయ్. నువు చెప్పాపెట్టకుండా సెలవులు పెడితే ఎలా? ప్రవర్తన మార్చుకోపోతే అవస్థపడతావ్...నీ ఇష్టం"

ప్రకాశం తలొంచుకున్నాడు.

రామ్మూర్తిగారు అతడి వంక అసహ్యంగా చూసి—

"వెళ్ళు... వెళ్లు ... పన్చూసుకో" అన్చెప్పి చటుక్కున ఏదో గుర్తుకొచ్చిన వాడిలా "అన్నట్టు నిన్న నీకోసం ఎవరో ఆడమనిషి ఫోన్చేసింది" అన్నారు.

వెళ్ళబోతున్న అతడు ఒక్కసారిగా వెనక్కి తిరిగి, ఆశగా "ఎవరు? పేరుగాని చెప్పారా??" ఆత్రంగా అడిగాడు.

'ఇందిరా? ఫోన్చేసిందంటే కోపం తగ్గినట్టేనా?' ఏవేవో ఆశలు, ఆలోచనలు.

రామ్మూర్తిగారు అతడి ప్రశ్నకి బదులివ్వకుండానే, సొరుగులోంచి ఉన్న కాగితాన్ని తీసి అతడికందిస్తూ — "ఆమె పేరు, ఫోన్ నెంబరు అందులో రాశాను. నువ్వు రాగానే ఫోన్చేయమని చెప్పింది" అన్నారు.

ప్రకాశం ఆత్రంగా ఆ కాగితాన్ని విప్పి చూశాడు.

ఫోన్చేసింది భార్య ఇందిర కాదు ... ప్రసూన.

ఆ క్షణంలో ప్రసూన ఫోన్ చేసినందుకు సంతోషపడకపోగా, భార్య కానందుకు బాధపడ్డాడు.

తిరిగి ఆమెకి ఫోన్ చెయ్యాలన్న వుద్దేశంకూడా లేనట్టు ఆ కాగితాన్ని చిన్న వుండగా చుట్టి విసిరేశాడు.

అది వెళ్ళి నాగరాజు ముందు పడటం గాని, అతడు దాన్ని కాలివేళ్ళతో అందుకుని, భద్రంగా సొరుగులో దాచటం గాని అతడు గమనించలేదు.

ప్రకాశం చరచరా వెళ్ళి తన క్యాబిన్లో కూర్చున్నాడు.

మనసంతా వికలంగావుంది. ఆలోచిస్తే జీవితం విచిత్రం అన్పిస్తుంది.

మొన్న మొన్నటిదాకా ప్రసూన కోసం పలవరించాడు. ఆ కారణంగానే భార్యతో వైరం తెచ్చుకున్నాడు, వాళ్ళకి దూరమైనాడు. ఇపుడు తను పలవరించి, పలవరింపుకోసం ఎదురుచూసిన ప్రసూన ఫోన్చేయమందిట.

కాని తనకాసక్తి లేదు.

ఎందువల్ల?

ఎందుకీ విచిత్రమైన మార్పు??

భార్యాపిల్లలపట్ల తనకి మమకారం పెరగటంచేతనా? లేక ప్రసూన పట్ల తను ఇన్నేళ్లుగా నిల్పుకున్న ప్రేమ అంతరించి హరించుకుపోవటం చేతనా??

అసలు ప్రేమంటే ఏమిటి? అదొక తీపి గుర్తు..అంతేగాని విషపుగుళిక కాదు. ప్రేమ మనిషిని బతికించాలి .... చంపకూడదు.

మనం ఎంతోమందిని ప్రేమిస్తాం... తల్లిని, చెల్లిని, ప్రకృతిని, డబ్బుని, సోదాని, స్నేహితుణ్ని...

కాని జీవించేది మాత్రం భార్యతోనే...

పిల్లం కోసమే!

ఇది సాంఘికపరమైన నైతిక బాధ్యత.

ఇంత చిన్న విషయాన్ని తెల్సుకోవటానికి ఎంతకాలం పట్టింది? ఎంతటి జీవన మధనం జరిగింది... ఎన్ని గుండెల్లో గునపాలు గుచ్చుకున్నాయి?

ప్రకాశం క్యాబిన్లో అసహనంగా కదిలాడు...వళ్ళంతా చెమటలు దిగ్గారుతున్నాయి. గుండెల్లో ఎవ్వరో కత్తిని దింపుతున్నట్లుగా బాధ. అతడికి గ్లాసుడు నీళ్ళు తాగాలనిపించింది. కుర్చీలోంచి లేచాడు. రెండడుగులు వేసి కుప్పలా నేలపై కూలిపోయాడు.

మొదటగానాగరాజు, ఆపైన అందరూ పరుగెత్తుకుంటూ వచ్చి అతడిచుట్టూ మూగారు.

అతడికి చెమటలు కారిపోతున్నాయ్. కళ్ళు వాలిపోతున్నాయ్.

చూస్తున్న జనంలోంచి ఎవరో అన్నారు—

"అది ఖచ్చితంగా హార్ట్ఎటాక్ త్వరగా ఆసుపత్రికి తీసుకెళ్ళండి ఆలస్యమైతే ఇక్కడే అయిపోతుంది"

నాగరాజు ప్రకాశం తలని తన ఒళ్లో పెట్టుకూర్చున్నాడు.



రామ్మూర్తిగారు కంపెనీ కారు అరేంజ్ చేశారు.

ప్రకాశం మూతలు పడిపోతున్న కళ్ళని బలవంతాన తెరిచి నాగరాజు వంక చూస్తున్నాడు. నోరు చెప్పలేని మాటలు కళ్లు చెబుతున్నాయ్.

కాని నాగరాజుకి కళ్ళ భాష అర్థం కావటం లేదు.

అవి భార్యని పిలిపించమని అర్థింపు చూపులు కావచ్చు...పిల్లల్ని చూపించమని ప్రార్థన కావచ్చు. కనీసం ప్రసూననన్నా పిలిపిస్తే ఏం అనే సమర్థింపు కావచ్చు.

నలుగురు పట్టి ప్రకాశాన్ని వెనుక సీటులో పడుకోబెట్టారు.

నాగరాజు, మరో ఇద్దరూ కూడా ఎక్కారు.

రామ్మూర్తిగారు అదుర్దాగా చెప్పారు-

"మంచి ఆసుపత్రికి తీసుకెళ్ళండి... డబ్బుకోసం చూడొద్దు. వెంటనే నాకు ఫోన్చేసి ఎలా వుంది చెప్పాలి"

సరేనన్నాడు నాగరాజు.

కారు కదిలింది.

కారు వెళ్ళిపోయాక, లోపలికొస్తూ అందరూ తలో రకంగా అంటున్నారు-

"మొదట్లో బాగానే వుండేవాడు. ఈమధ్య మరీ పాడైపోయాడు. ఎప్పుడు చూసినా తాగే వుంటున్నాడు"

"పెళ్ళాం ఇతగాణ్ని వదిలేసి వెళ్ళిపోయిందట. అప్పట్నించి అలా తయారయ్యాట్ట"

"వెళ్ళక ఏం చేస్తుంది చెప్పండి... తాగుబోతు వెధవల్ని ఎన్నాళ్ళని ఎవరు మాత్రం భరిస్తారు"

మధ్యాహ్నం మూడింటికి నాగరాజు తిరిగొచ్చాడు.

అందరూ అతణ్ని చుట్టుముట్టేరు, "ఎలా వుంది?" అంటూ.

"ఆసుపత్రిలో ఎడ్మిట్ చేసుకున్నారు. ఇంటెన్సివ్ కేర్ యూనిట్లో వుంచారు. అప్పుడే ఏం చెప్పలేం అంటున్నారు" అన్చెప్పాడు.

"అతడి భార్య అడ్రసుగాని తెలుసా?" అనడిగారు రామ్మూర్తిగారు.

"ఉహూ ... తెలీదు. ఏదో ఆఫీసులో పన్చేస్తుందని చెప్పాడుగాని గుర్తులేదు"

సాయంత్రం అందరూ మెల్లిమెల్లిగా ఇంటి తోవపడుతున్నారు.

నాగరాజుకి ఏం పట్టనట్టు వెళ్ళిపోవాలంటే కాళ్ళూ, చేతులూ ఆడటం లేదు. అక్కడ ఆసుపత్రిలో స్నేహితుడు గుండెపోటుతో పలకరించే దిక్కులేకుండా ప్రమాదస్థితిలో పడున్నాడన్న ఆలోచనే అతడికిబ్బందిగా అనిపించింది.

అతడి తాలూకు మనుషులకి తెలియబరిస్తే తన బాధ్యత కొంతవరకు తీరుతుంది.కాని, ఎవరికని చెప్పడం? ఎలా చెప్పడం??

అలా కుర్చీలో కూర్చుని తీవ్రంగా ఆలోచిస్తుండగా గుర్తుకొచ్చింది - నిన్న అతడికోసం ఎవరో ఆడమనిషి ఫోన్ చేసిన విషయం.

చకచకా తన సొరుగుని వెతికి ఆ కాగితం ముక్కని పట్టుకున్నాడు.

"ప్రసూన. ఫోన్ నెం. 53276"

ఎవరీ ప్రసూన? అతడి బంధువా? స్నేహితురాలా? ఏమో అర్థంకాలేదు. ఆమెకి ఫోన్చేస్తే ప్రకాశం భార్య గురించిన సమాచారం తెలుస్తుందిగదా!

నాగరాజు నెంబరు డయల్ చేసి ఆత్రంగా, అదుర్దాగా రెస్పాన్స్ కోసం ఎదురుచూస్తున్నాడు.

కాస్సేపటికి అవతలివైపునించి ఎవరో

ఆడమనిషి 'యస్ ప్లీజ్' అంది.

"ప్రసూనగారాండీ?"

"యస్...ప్రసూన హియర్" అంది మెత్తగా.

"నా పేరు నాగరాజండీ" అన్నాడు సంభాషణ ఎలా మొదలుపెట్టాలో తెలీనట్లు.

"ఎవరండీ?"

"ప్రకాశం ఫ్రెండుని ... పేరు నాగరాజు"

"ఓహో..అలాగా! ప్రకాశం ఏవన్నా చెప్పమన్నాడా?" అందామె కుతూహలంగా.

నాగరాజు మెల్లిగా అన్నాడు-

"ప్రకాశం ఏం చెప్పే స్థితిలో లేదండి"

"అంటే వాడ్డూయూ మీన్" ఆత్రం, ఆదుర్దా, భయం...

"ప్రకాశానికి హృదయం గుండెపోటు వచ్చింది. ఆసుపత్రిలో చేర్పించాం"

"ఇప్పుడెలావుంది?"

"అప్పుడే ఏం చెప్పలేం అన్నారు. మీతో చాలా విషయాలు చెప్పాలి. మనం ఒకసారి కలిసే అవకాశం వుంటుందా?"

"అలాగే. ఇంతకీ నాకు ఫోన్చెయ్యమని ప్రకాశం చెప్పాడా?" అవునన్న సమాధానం ఆశిస్తున్నట్లుగా వుంది ఆమె గొంతు.

"లేదు. చెప్పానుగా అతడేం ... చెప్పగలిగేస్థితిలో లేడని. పర్సనల్గా అన్ని విషయాలు మాట్లాడుకోవచ్చు"

"అలాగే. కాని ఎక్కడికి రమ్మంటారు?"

"గీతా నర్సింగ్ హోమ్ మీకు తెలిసే వుంటుంది"

"తెల్సు"

"సరాసరి అక్కడికొచ్చెయ్యండి. నే వాకిట్లో నిల్చుంటాను. నా చేతిలో ఎర్ర చేతిగుడ్డ వుంటుంది...అదే గుర్తు"

"అలాగే. ఇపుడే బయల్దేరుతున్నా"

ఫోన్ పెట్టేసిన శబ్దం.

నాగరాజు కష్టం ఫలించినట్లుగా చేతిగుడ్డతో మొహం తుడుచుకుని నర్సింగ్ హోమ్కి వెళ్ళటానికి బయటికెళ్ళాడు.

నాగరాజు ఎర్ర చేతిగుడ్డని పుచ్చుకుని గీతా నర్సింగ్హోమ్ గేటువద్ద నిల్చున్నాడు. వచ్చేపోయే ఆడవాళ్లని ఆదుర్దాగా చూస్తున్నాడు.

దాదాపు అరగంట గడిచింది.

సూర్యుడు ఆరోజుకి కొలువు చాలించి తప్పుకుని చీకట్లని భూమ్మీదకొదిలాడు. ఆసుపత్రి కాంపౌండులో నియాన్ లైట్లు వెలిగాయ్. రోడ్లపైన ఈవినింగ్ రష్ అధికంగా వుంది.

అంతలో ఒక ఆటో వచ్చి అక్కడ ఆగింది. దాంట్లోంచి ఒక స్త్రీ దిగింది. ఆమె గోల్డ్ కలర్ శారీ, అదే రంగు బ్లౌజు ధరించింది. మనిషి కాస్త లావుగా అన్పించినా ఎబ్బెట్టుగా అన్పించకపోగా అదేవిటో చాలా అందంగా కన్పిస్తోంది. కోలమొహం,విశాలమైన నుదురు,దానిమీద దోసగింజంత బొట్టు, ఫాషన్గా కట్టుకున్న శారీ, దాచలేని ఆరోగ్యమైన ఒళ్లు.

ఆమె ఆటోకి డబ్బులిచ్చేసి అక్కడే కదలకుండా రెండుక్షణాలు నిలబడి చుట్టూ చూసింది - ఎర్ర చేతిగుడ్డ పుచ్చుకున్న వ్యక్తికోసం.

నాగరాజు ఆటో దిగుతున్నపుడే ఆమెని చూసేడు. వెంటనే అనుకున్నాడు- ఆమె ప్రసూనయ్యుండాలని. అలా అనుకోటానికి కారణాలంటూ ఏవీలేవు. ఫోన్లో తాను విన్న మధురమైన గొంతుకి, ఇపుడు చూస్తున్న మధురమైన రూపానికి

ఖచ్చితంగా సంబంధం వుండి తీరాలని పించింది.

ఆమె కదిలి, ఎర్రచేతిగుడ్డని గమనించి నాగరాజు వైపుగా వచ్చింది.

అతడు గూడా రెండడుగులు ముందు కేస్తూ "ప్రసూనగారా?" అన్నాడు.

"మీరేగా ఇపుడు ఫోన్చేసింది.... నాగరాజు"

అవునన్నట్లుగా తలాడించేడు.

"ఎలా వుంది ప్రకాశానికి?" అనడిగింది. తెల్లటి నియాన్ లైటు కాంతిలో ఆమె మొహంలోని ఆదుర్దా, గాభరా స్పష్టంగా కన్పిస్తున్నాయ్.

"ఇంజక్షన్ చేసారు. ఎవరూ ఇపుడు అతడ్ని డిస్టర్బ్ చెయ్యకూడదట"

ప్రసూన రెండడుగులు వెనక్కి వేసింది. ఆ కళ్ళలో ఏదో బాధ సుళ్ళు తిరుగుతోంది– వదనంలో నిరుత్సాహం.

"ప్రస్తుతం డాక్టర్స్ లేరు. వచ్చాక అడిగి అతణ్ని చూద్దురుగాని. ఈ లోపల అలా వెళ్ళి ఓ కప్పుకాఫీ తాగొద్దాం. మీతో చాలా విషయాలు చెప్పాలి" అన్నాడు నాగరాజు.

ఆమె సరేనంది. ఇద్దరూ పక్కనే వున్న హోటల్లోకెళ్ళి ఫామిలీ రూములో కూర్చున్నాక కాఫీకి ఆర్డరిచ్చాడు.

మొదటగా ఆమె అడిగింది– "అతడి భార్య పక్కనే వుందా?" అని.

నాగరాజు తలవిదిలించి,"ఆ విషయమే మీకు చెప్పాలన్నది. ప్రకాశాన్ని భార్య వదిలేసి వెళ్ళిపోయింది. ప్రస్తుతం అతడు ఒంటరిగాడు"

ఆ మాట విని ఆమె నమ్మలేనట్టుగా రెండు క్షణాలు తదేకంగా అతడివైపు కన్నార్పకుండా చూసింది.

"మీరు చెప్పేది నిజమా?" అంది ఆపైన.

"అక్షరాలా నిజం. ఆమె అడ్రస్సు తెలీకనే మీకు ఫోన్చేసింది"

"నా అడ్రసు ఎలా తెల్సింది?"

"రెండ్రోజుల క్రితం మీరు ఫోన్చేసారట. అపుడు మా ఆఫీసరు మీరు చెప్పిన నెంబరు కాగితం పై రాసి పెట్టాడు..." తర్వాత జరిగింది చెప్పటం ఇష్టంలేక అక్కడే ఆపేశాడు.

"నేను నిన్ననే వెళ్ళిపోవాల్సింది. పెళ్ళికని వచ్చాను. రాత్రి బయల్దేరాను కూడా. తీరా నే స్టేషన్కెళ్ళేసరికి రైలు అప్పుడే వెళ్ళిందన్నారు"

"అంటేమీరు ఇక్కడ కాదావుండేది?"

"లేదు. పూనాలో స్టేట్ బ్యాంకులో ప్రొబేషన్ ఆఫీసర్ని. ఫ్రెండు పెళ్ళి కని వచ్చాను. వచ్చాను కదాని ఎలావున్నాడో కనుక్కుందామని ఆరోజు ఫోన్చేసాను. మనకి తెలీకుండా యాదృచ్ఛికంగా చేసిన పన్లే ఎలా వుపయోగపడతాయో"

నాగరాజు అవునన్నట్లు తలూపేడు.

అంతలో కాఫీ వచ్చింది.

అతడు ఒక కప్పుని ఆమె వైపుగా జరిపేడు. ఆమె దాన్ని మరింత దగ్గరగా జరుపుకుంటూ, "ఇంతకీ అతడి భార్య అలా వెళ్ళి పోవటానిక్కారణాలు గాని తెల్సునా?" అనడిగింది.

"లేదు– అతడెప్పుడూ చెప్పలేదు. నేను అడగనూ లేదు. అయినా ప్రకాశం ఆదోరకం మనిషి"

"అంటే?"

"చాలా సీక్రటివ్ టైపు. విషయాలు అంత తేలిగ్గా చెప్పేవాడు కాదు. త్వరగా ఎవర్నీ నమ్మడు కూడా" అన్నాడు ఆమె రియాక్షన్ గమనిస్తూ.

ప్రసూన నవ్వి వూరుకుంది.

అది గమనించనట్లు అతడు చెప్పుకు పోతున్నాడు.

"మొదట్లో తనే భార్యని పుట్టింటికి పంపినట్లు చెప్పాడు. కాని తర్వాత నాకు తెల్సింది... అది నిజంకాదని"

"ఎలా తెల్సింది? ఎవరైనా చెప్పారా?"

"లేదు. అతడిలోను, ప్రవర్తనలోను వచ్చిన మార్పునిబట్టి జరిగింది ఊహిం చాను. ఎప్పుడూ చికాగ్గా, బాధగా కూర్చుని దీర్ఘంగా ఆలోచించటం, ప్రతి రోజూ తాగటం"

"ఏమిటీ..ప్రకాశం తాగుతున్నాడా?" ఆదుర్దాగా ప్రశ్నించింది – అతడు చెబుతున్నది పూర్తికాకుండానే.

"అవును... ఈమధ్యన విపరీతంగా తాగుతున్నాడు. ఇపుడు గుండెపోటు రావటానికి అదే కారణమని డాక్టరు చెప్పాడు"

ఆమాట విని తాగుతున్న కాఫీ చేదుగా అన్పించినట్లు కప్పుని పక్కకు నెట్టేసింది. తలవంచు కూర్చుంది.

తను చెప్పిన విషయం ఆమెని బాగా కదిలించిందని గమనించి అతడేం మాట్లాడక మౌనంగా కూర్చున్నాడు.

కాసేపటికి బ్యాగ్‌లోంచి సిల్కు కర్చీఫ్ తీసి అశ్రువుల్ని అద్దుకుంది.

"ప్రకాశం ఈవిధంగా తయారౌతాడని గాని, అతడి బతుకు ఇలా మారుతుందని గాని నేనెప్పుడూ ఊహించలేదు.ఇన్నాళ్ళూ అతడు హాయిగా, సంతోషంగా వున్నా డన్న వూహతో ధైర్యంగా తృప్తిగా కాలం గడుపుతున్నాను"

అప్పుడుగాని నాగరాజుకి అర్థంకాలేదు ఆమె ప్రకాశానికేమౌతుందో. మనసు నుంచి మనసుకి ప్రేమనే తీగలతో కలయిక ఏర్పరచుకుని కష్టాలు సుఖాలు, ఇష్టాలు అయిష్టాలు, ఆశలు నిరాశలు, బాధలు గాథలు అరమరికలేకుండా చెప్పుకుని, మానసికంగా దగ్గరయిన వాళ్ళకి తప్ప అంత బాధ అన్పించదు...కన్పించదు.

ఆమె ప్రకాశం ప్రియురాలు!

ఆ విషయం తెల్సాక ప్రకాశం చాలా అదృష్టవంతుడనిపించింది ... ఇంతటి అందమైన శరీరం, మనసువున్న ప్రియు రాలిని మర్చిపోలేక తాగటం తప్పుకాదని పించింది.

నాగరాజు ఆలోచనల్లోనుంచి బయటపడే సరికి, ఆమె మళ్ళీ మళ్ళీ కర్చీఫ్‌తో కళ్ళద్దు కోవటం కంటపడి బాధనిపించింది.

"బాధపడకండి. ప్రకాశం తప్పక రికవరౌతాడు" అన్నాడు ఓదార్పుగా.

"శారీరకంగా కోలుకోవచ్చు. కాని..." ఏదో అనబోయి అనకుండా మాట మారు స్తున్నట్లు – "అతడి భార్య అడ్రస్సు గాని తెల్సునా?" అంది.

"అది తెలీకనే మీకు ఫోన్చేసింది"

"అప్పుడప్పుడు ... చెప్పాడు. మర్చి పోయాను. అన్నట్లు ఒకసారి అతనే మాటల సందర్భంలో ఆమె పనిచేసే ఆఫీసు చెప్పినట్లు గుర్తు. పాత డైరీలు వెదికితే కనిపించొచ్చు"

అంతలో వెయిటరొచ్చి బిల్లుని చిన్న ప్లేటులోవుంచి వెళ్ళాడు.

నాగరాజు వెంటనే డబ్బులు తీసి దాంట్లో వుంచాడు.

ఆమె ఇదంతా గమనించనట్లుగా –

"మీరు నాకో సహాయం చెయ్యాలి" అంది.

నాగరాజు ఆశ్చర్యపోయాడా మాటవిని "ఏమిటది?"

"రేపు ప్రకాశానికి సంగతులేవీ తెలి నివ్వకూడదు. మీరు నాకు ఫోన్చేసినట్టు

గాని, నే పరిగెట్టుకుంటూ వచ్చినట్లుగాని' వనం మాట్లాడుకున్నట్టుగాని ... ఏవీ అతడికి తెలీకూడదు''

"ఎందువల్ల ... చెపితే అతడూ సంతోషిస్తాడుగా"

''కొన్ని వ్యక్తిగత కారణాలవల్ల ఇలా అంటున్నాను. అంతేకాదు... మీరు నాకు ఫోన్చేసినట్టు...నేను విసుక్కుని, 'నాకెందుకుచెబుతారు, అతడి భార్యుందిగా చెప్పండి' అన్నట్లుగాకూడా అనాలి"

నాగరాజు ఆశ్చర్యంగా ఆమె వైపు చూస్తూ, "అబద్ధమా...ఎలా చెప్పేది?" అన్నాడు.

ఆమె కాస్త ముందుకు వంగి ''నిజం చెప్పి అతణ్ని ఇంకా పాడుచెయ్యటం కన్నా చిన్న అబద్ధం చెప్పి అతణ్ని,అతడి సంసారాన్ని కాపాడటం నా వుద్దేశం ... బహుశా మీరూ ఏకీభవిస్తారనుకుంటా"

"అవును...నిజమే"

"అందుకే నే చెప్పినట్లు చెప్పండి... అలా చెబుతానని హామీ కావాలి" ఆశగా అతడివైపు చూస్తూ అంది.

"అలాగే తప్పకుండా" అన్నాడు నాగరాజు నవ్వుతూ.

"ప్రామిస్?''

"యస్... ప్రామిస్. ప్రకాశం మీకే కాదు... నాకూ కావాల్సినవాడే''

ఆమె లేచి నిల్చుంది. నాగరాజుకూడా లేచేడు.

ఇద్దరూ రెస్టారెంట్లోంచి బయటికొచ్చి ఆసుపత్రివేపుగా నడుస్తున్నారు పక్క- పక్కగా.

ఆసుపత్రిసమీపిస్తుండగా ఆమే అంది-

''ఒక్కసారి లోనికెళ్ళి డాక్టరుతో మాట్లాడి, వీలయితే ప్రకాశాన్ని దూరం నుంచయినా అతడి దృష్టిలో పడకుండా ఒక్కసారి చూసి వెడతాను. బహుశానాకు ఇటువేపు రావటం పడదేమో.రేపు రాత్రికే నా ప్రయాణం. రేపుదయం అతడిభార్యని కల్సి మాట్లాడటానికి ప్రయత్నిస్తాను. వీలైతే రేపు ఆమెకి ఫోన్చెయ్యండి. అతడే చెయ్యమన్నాడని చెప్పండి. ఆమె పే పలవరిస్తున్నాడని చిన్న అబద్ధంగూడా చెప్పండి... ఏం ఫర్వాలేదు''

చిన్నపిల్లవాడికి ఎలా ప్రవర్తించాలో చెబుతున్నట్లుగా ఆమె చెప్పే విధానం చూస్తే నాగరాజుకి నవ్వు, ప్రకాశం పది కాలాలు పచ్చగా వుండాలన్న ఆమె తపనని చూస్తే గౌరవం, ఆనందం పుట్టు కొచ్చేయ్.

ఇద్దరూ ఆసుపత్రి ముందుకొచ్చి ఆగేరు.

సరిగ్గా అప్పుడే డాక్టరు కారు రివ్వున లోపలికి దూసుకెళ్ళింది.

''డాక్టరొచ్చినట్లున్నారు. నేవెళ్ళి కాస్సేపు ఆయన్తోమాట్లాడి మరివెడతాను" అంది ప్రసూన-అతడివేపుఅభిమానపూర్వకంగా చూస్తూ.

''మంచిది.ప్రకాశం ఎప్పుడూ అంటూ వుంటాడు- నేచాలా దురదృష్టవంతుడి నోయ్ అని. కాని, మిమ్మల్ని చూసాక అది నిజంకాదనిపిస్తోంది. మీలాంటి శ్రేయోభిలాషినికలిగివున్న అతడు చాలా అదృష్టవంతుడనుకుంటున్నాను. వస్తాను మరి'' అంటూ వెనక్కి తిరిగాడు.

ఆశించని కాంప్లిమెంటుకి ఆశ్చర్య పోతూనే-

''నే చెప్పిన విషయాలు గుర్తున్నాయి కదూ'' అంది.

"మీరేం కంగారుపడకండి. తు.చ. తప్పకుండా పాటిస్తాను" అనేసి బింకంగా అడుగులేసుకుంటూ వెళ్ళిపోయేడు.

ప్రసూన రెండు క్షణాలు అతడు వెళ్ళినవేపే చూస్తూ నిల్చుని ఆ పైన అక్కణ్నుంచి కదిలి ఆసుపత్రిలోకెళ్ళింది.

* * *

ఇందిర తలెత్తింది.

"ఎవరుకావాలండి?" అందిమర్యాదగా.

"ఇందిరంటే మీరేకదూ?"

ఔనన్నట్లుగా తలూపింది ఇందిర.

"మీతో కాస్త పనుండి వచ్చాను"

"చెప్పండి"

"ఇక్కడ కాదు...కాస్సేపు అలా బయటికి రాగలరా?" సందేహంగా అడిగింది ప్రసూన.

"ఇంతకీ మీరెవరు?"

"అవన్నీ తర్వాతచెబుతాను. ఇప్పుడు ఏం అడక్కండి... ప్లీజ్"

ఇందిర అనుమానంగాచూసి, రిజిష్టరు మూసి లేచి నిలబడింది.

ఇద్దరూ ఆఫీసుదాటి వరండాలోకి వచ్చారు.

మొదటిచూపులోనే ప్రసూనని పరీక్షగా చూసి ఎవరో వున్నవాళ్ళ పిల్ల, ఇంకా వున్నవాడికి భార్యఅయిన అదృష్టవంతురాలై వుంటుందని వూహించింది ఇందిర. కాని ఆమెనిచూస్తే పెళ్ళయిన లక్షణాలు కన్పించలేదు.

"ప్రకాశానికి నిన్న గుండెపోటొచ్చింది. ఆసుపత్రిలో వున్నాడు" అంది ప్రసూన మెల్లిగా.

ఇందిర ఆ మాట విని వులిక్కిపడింది. ఎవరో ఛళ్ళున కొరడాతో ఏమరుపాటుగా వున్నపుడు చరచినట్లు అదిరిపడింది.

"ఏమిటీ మీరనేది. నిజమా....?" నమ్మలేనట్లుగా అడిగింది.

"అవును...నిజమే. వివరాలు కావాలంటే నాతో పాటుగా రండి. ఇప్పుడే మాట్లాడుకుందాం. ఇంతకీ నేను పరాయి దాన్ని కాదు. నా పేరు?"

"అక్కర్లేదు. అర్థమైంది. మీ పేరు ప్రసూన"

"ఎలా కనిపెట్టేరు?"

ఆమె ప్రశ్నను పట్టించుకోకుండా.

ఇందిర ఆదుర్దాగా అడిగింది — "మీరన్నది నిజమేనా...ఆయనకి గుండెపోటు రావటం?"

"నిజమే...గీతా నర్సింగ్ హోమ్‌లో వున్నారు. ప్రమాదస్థితి దాటింది"

"విచిత్రంగా వుందే. మిమ్మల్ని చూసేక గుండెపోటు రావటానికి వీల్లేదే. పాపం ప్రతి రోజూ మీ స్మరణే" ఆ మాటల్లో అసూయ,ఎత్తి పొడుపు స్పష్టంగా వినిపిస్తున్నాయ్.

"మీరనుకుంటున్నట్టుగా నేను అతడిని కలవలేదు"

"ఓహో...అంటే ఆ తర్వాత వెళ్ళి ఆసుపత్రిలో చేర్పించి,దగ్గరుండి సపర్యలు చేస్తున్నారన్నమాట. అసలందుకే ఆ నొప్పికూడా వచ్చుంటుంది"

"మీరు మరీ దారుణంగా మాట్లాడుతున్నారు. అసలీ క్షణం వరకు నేనతన్ని కల్సుకోలేదంటే మీరు ఆశ్చర్యపోతారు"

"అయ్యయ్యో...అదేం పాపం! కల్సుకోవాల్సింది. మందుల్లేకుండానే రోగం కుదిరేది" అంది అక్కసుగా.

ప్రసూనకి ఆమె ధోరణి బాధనిపించింది.

"మీ మాటలని బట్టి అతడిపై మీకెంతగా కోపం వుందో అర్థమౌతోంది. నేను అతడి కంట పడకపోవటానికి మీ కారణం"

"నేనా...అదెలాగ?"

"అతడికి సపర్యలు చేసే హక్కు

నాకులేదు. హక్కులేని చోట అధికారం చెలాయించటం నాకిష్టం వుండదు. అతడు మీఆస్థి. ఆ హక్కు మీ ఒక్కరికే వుంది"

ఇందిర వ్యంగ్యంగా, హేళన చేస్తున్నట్లుగా నవ్వింది.

"భలేవారే మీరు! ఈ మాట ఎందుకంటున్నారో అర్థం కావటంలేదు. ఈ విషయంలో ఆయనభిప్రాయాలు భిన్నంగా వున్నాయ్. పాపం మిమ్మల్ని మర్చిపోలేక తాగుతున్నారుకూడా. ఇపుడారోగ్యం కూడా చెడగొట్టుకున్నారు"

ప్రసూన ఆమెవంక తీక్షణంగా చూస్తూ,

"అవును... విన్నాను. దానిక్కూడా మీరే బాధ్యులు" అంది.

ఆ మాట విని ఇందిర తెల్లబోయింది.

"అదేవిటి... అన్నిటినీ నా తలపైనే రుద్దుతున్నారు?"

ప్రసూన చిన్నగా నవ్వుతూ—

"ఇది రుద్దటంకాదు. మనసులు విప్పి మాట్లాడుకోవటం. చనువు తీసుకున్నందుకు క్షమించండి" అంది.

"ఫర్వాలేదు. నిర్భయంగా చెప్పండి"

"మొగుడు పక్కనున్న భార్యనొదిలేసి ఇంకో స్త్రీని పలవరిస్తున్నాడంటే దానర్థం ఆ భార్య అతడికివ్వాల్సింది అందించలేకపోతోందన్న మాట. ప్రేమ, ఆప్యాయత, అనునయం, సెక్స్ సుఖం... ఏదైనా కానివ్వండి అవి ఇంట్లో దొరకనప్పుడు మగాడు బజార్నపడతాడు ... బరితెగిస్తాడు"

"అది నిజంకాదు... ఇంతకీ మీకు పెళ్ళయిందా?"

"ఇంకా లేదు"

"అందువల్లనే ఈ మొగుళ్ళ సంగతి మీకు తెలీదు. ఇంట్లో వున్నదంతా తిని ఆకలి తీర్చుకుని పక్కింటికెళ్ళి చేతులు చాచేరకం"

"ఏమో...నాకు పెళ్ళికాలేదు గాబట్టి నేనేం చెప్పలేను. కాని ఒక్కటి మాత్రం చెప్పగలను. భర్త చెడు మార్గాన పోతున్నపుడు, అతడితో గొడవ పడటంకన్నా మంచిగానే దార్లోకి తెచ్చుకుంటే బావుంటుందని నా అభిప్రాయం. 'నేనూ, నా పిల్లలు నీ గురించే బతుకుతున్నాం. నీకోసమే బతుకుతున్నాం. నువ్వులేకపోతే మా భవిష్యత్తే శూన్యం' అనేలా ప్రవర్తించి చూడండి. ఎంత చెడ్డవాడైనా అతడూ మనిషేకదా"

ఇందిర కోపంగా ఆమెవంక చూసింది.

"అంటే అలా నే ప్రవర్తించలేదని, అదే నా తప్పంటారు. అంతేగా!ఆయనెన్ని పన్లుచేసారో మీకెలా తెలుస్తుంది? ఆడది సంసారాన్నికూడా కాదని బయటికొచ్చేసిందంటే దాన్నిబట్టే మీరూహించుకోవచ్చు..ఎంత అసహ్యంగా ప్రవర్తించేరో"

"ఆవేశపడకండి"

"ఆవేశం కాదు...ఆవేదన. ప్రతిరోజు తాగి రావటం,అసహ్యంగా ప్రవర్తించటం పెళ్ళాంపక్కలో పడుకుని ప్రియురాలి పేరు జపం చెయ్యటం, వూరంతా అప్పు చెయ్యటం,తనింట్లో...తన భార్యగొలుసే దొంగతనం చెయ్యటం ఛీ ఛీ...అనుకోవటానికే అసహ్యంగా అన్పిస్తోంది"

"మీరు చెప్పేది నిజమా?"

"కాకపోతే సరదాకి, తమాషాకిలా వచ్చేసాననుకుంటున్నారా? నే వచ్చేసిన వారంరోజులకి అసలెలావున్నారో చూద్దామని ఇంటికెళ్ళాను. నిజానికి వేరుగా వచ్చేటప్పుడు శాశ్వతంగా ఆయనకి దూరంగా వుండాలన్న వుద్దేశమే లేదు. రాస్త భయపెట్టినట్టు, బెదిరించినట్టు

ష్టంటుందని వచ్చేను. కనీసం జరిగిందానికి బాధపడుతున్నట్టు కన్పించినా సంతోషంగా ఆయన పంచకి చేరేదాన్ని. కాని ఆరోజు నే వెళ్ళేసరికి అక్కడి దృశ్యం చూసేక అసహ్యం అన్పించింది. నా లోటుగాని, నే వెళ్ళిపోయాసన్న బాధగాని ఆయనకి లేవని అర్థమైపోయింది. అంతే! అప్పట్నించి ఆయన్ని గురించి ఆలోచించటమే మానేశాను'' అంది తలొంచుకుని.

''ఇంతకీ మీరక్కడ చూసిన దృశ్యం ఏవిటో చెప్పనేలేదు''

''అదంత ముఖ్యమంటారా? అయిలే వినండి...నే వెళ్ళేసరికి రంభలాంటి ఆడపిల్లతో సరసాలాడుకుంటున్నారు'' అసహ్యంగా మొహం పెట్టి అంది.

''కాని ఇది నే నమ్మను''

''అంటే?''

''అంటే మీరబద్ధం చెబుతున్నారని కాదు నా భావం. అతడు అలాంటివాడు కాదు. అనుకోకుండా ఆకస్మాత్తుగా



ఇంకొకరివల్ల అలా జరుగుండాలేగాని ప్రకాశం మాత్రం అలాంటివాడు కాదు"

"ఎలా చెప్పగలరు?"

"చెప్పొచ్చు ... ఇంతకన్నా చిన్న వయసులో యవ్వనం పురివిప్పే వయసులోనే మేమిద్దరం ఏకాంతంగా గంటలతరబడి ఒకే గదిలో కూర్చుని కబుర్లు చెప్పుకునే వాళ్ళం. అతడు కనీసం నన్ను కవ్వించాలనిగాని, తాకాలనిగాని ఎప్పుడూ ప్రయత్నించలేదు. అతణ్ని నే అభిమానించటానికి అదొక ముఖ్యమైన కారణం"

ఇందిర మాట్లాడలేదు.

"ప్రకాశం చెడిపోతున్నాడేమోగాని చెడ్డవ్యక్తి మాత్రం కాదు" ఇందిర అసహనంగా కదిలి "ఏమో ... మీ అభిప్రాయాలు మీవి. కాదంటానికి నేనెవర్ని? సరే..చాలా సేపయిందివచ్చి... నే వెళ్ళాలి." అంది.

ప్రసూన కంగారుపడింది.

"అసలు నే వచ్చిన పనే చెప్పలేదు. అప్పుడే వెళ్ళిపోతారా?"

ఇందిర చెప్పమన్నట్టుగా చూసింది

"నన్ను చూసేరు ... కాస్సేపు మాట్లాడేరు. నా గురించి మీ అభిప్రాయమేమిటో చెప్పగలరా?" అనడిగింది.

ఇందిర ఆశించని ప్రశ్నకి ఆశ్చర్యపోతూ—

"ఏమో ... నాకేం తెలీదు. అయినా ఎవ్వరిమీద నాకు దురభిప్రాయాలుండవ్" అంది నిశ్చయంగా.

ఆ మాటతో కాస్త ధైర్యంవచ్చినట్లు—

"థాంక్స్ ఆ మాత్రం గౌరవం చాలు. ఆ చనువుతోనే ఒక కోర్కె కోరతాను. తీరుస్తారా. మీ చెల్లెలే అడుగుతున్నట్లు భావించండి" అడిగింది.

ఇందిర ఆమె ధోరణికి మళ్ళీ ఆశ్చర్యపోయింది.

"మీ కోర్కె నే తీర్చాలా? ఆశ్చర్యంగా వుందే! ఏవిటో చెప్పండి"

"జరిగిందంతా మర్చిపోయి మీరు మళ్ళీ ప్రకాశం వద్దకెళ్ళాలి. జబ్బుతో పడున్న అతణ్ని ఆదుకోవాలి. ఇద్దరూ కల్సిపోయి చిలకా గోరింకల్లా అన్యోన్యంగా జీవించాలి"

"వుండాలనే వుంటుంది ప్రతి స్త్రీకి. కాని మగవాడి సహకారం కూడా కావాలిగా"

"అది నిజమే. ఇప్పుడతను ఆరోగ్యం పాడుచేసుకుని ఆసుపత్రిలో వున్నాడు. కాస్త అభిమానంతో వెళ్ళి ఒక్కసారి మాట్లాడితే అదే అతడికి మందులాగా పన్చేస్తుంది. నైతికంగా ఎంతో ధైర్యం వస్తుంది"

ఇందిర మాట్లాడలేదు.

"అతణ్ని కలవటంగాని, అతడితో మాట్లాడటంగాని నాకిష్టంలేదు. నేనిక్కడికొచ్చి కలవకుండా వెళ్ళిపోయానని అతడికి తెలియాలి. ఇంకే మూలన్నా నాపైన ఆశలు, భ్రమలుంటే ఈ దెబ్బతో సరి. అందువల్ల అలా ప్రవర్తిస్తుంటే ఇక ముందు సరిదిద్దుకుంటాడు. దానికి మీరు ఆసుపత్రికి వెళ్ళటం ద్వారా చొరవ తీసుకోవాలి"

అయినా ఇందిర ఇంకేం మాట్లాడలేదు.

"నా తరఫున మీకో హామీనిస్తున్నా. ఇకముందు ఎన్నడూ అతణ్ని కలవను... మాట్లాడను. ఎప్పుడన్నా ఇక్కడికొస్తే మిమ్మల్ని కలిసి సంగతులు తెల్సుకుంటాను...ప్రామిస్"

ఇందిర మౌనమే పాటిస్తోంది.

"నా కారణంగా అతడ...

అయిపోయాడన్నీ, నా కారణంగానే మీరిలా విడిపోయారని తెల్సినప్పటి నుంచి చాలా బాధగాను, గిల్టీగానువుంది. మీరు మనస్ఫూర్తిగా హామీనిస్తేనేగాని నాకు శాంతివుండదు...ఏమంటారు?"

ఇందిర చిన్నగా నవ్వి—

"మిమ్మల్ని చూస్తుంటే నవ్వొస్తోంది. మీకన్నా ఎక్కువ ఆదుర్దా, ఆత్రం, తొందరలు నాకున్నాయ్. కాని అలా కనిపించకుండా జాగ్రత్త పడుతున్నా. సరే...మీరు చెప్పినట్టు వెళ్ళి ఆయన్ని చూసొస్తాను కాని ఒకటి మాత్రం నిజం. ఆయన్లో ఖచ్చితమైన మార్పు కన్పిస్తేనే వెళ్ళేది" అంది.

"సరే! నేవెళ్ళొస్తా...సారీ వెడతా. మళ్ళీ రాన్లెండి" అంది ప్రసూన.

"అదేం కుదర్దు. ఎప్పుడే ఊరు వచ్చినా మా ఇంటికి రావాలి" ఇపుడు ఇందిరలో సందేహంగాని, భయంగాని లేవు. చాలా ఆత్మీయురాలిలా కనిపిస్తోంది ప్రసూన.

"అలాగే వస్తాను బై" అనేసి ఒకసారి ఆమె చేతిని స్పృశించి, వెనక్కు తిరిగి పడివడిగా వెళ్ళిపోయి, కాస్సేపటికి కనుమరుగైంది

* * *

సాయంత్రం అరయింది.

ప్రకాశం గదిలో పడుకుని వీధి వైపు, వచ్చిపోయేవాళ్ళవైపు ఆరగా చూస్తున్నాడు.

ఎవరైనా పరిచయం వున్న మొహం వచ్చి పలకరించి, పరామర్శించి వెడతారేమోనని ఆత్రంగా చూస్తున్నాడు. కష్టంలో వున్నపుడు అనునయం కోసం, ఆప్యాయత కోసం ప్రాణం తహతహలాడుతుంది. అది సహజం.

కాని అతడు ఆసుపత్రిలో చేరిన దగ్గిర్నించి, వచ్చి పలకరించి వెడుతోంది ఒక్క నాగరాజు మాత్రమే.

ప్రకాశం కనిపిస్తున్న ఆరోడ్డువైపు చూస్తూ దీర్ఘంగా ఆలోచిస్తున్నాడు.

ప్రసూన కూడా నాగరాజు ఫోన్చేస్తే విసుక్కుండట. అతడి భార్యకి చెప్పందే నాకెందుకు చెబుతారందట.

ఆఫీసు కొలీగ్స్, ఇందిర, ప్రసూన వీళ్ళంతా తనపట్ల సానుభూతి కనబరచక పోవటానికి కారణమేమిటి?

స్వయంకృతమనా?

చేసుకున్నవాడికి చేసుకున్నంత—అనుభవించనీ అన్న నిర్లక్ష్యమా?

ఏమో...ఏదీ అర్థం కావడంలేదు.

నాగరాజు ఫోన్చేసి ఇందిరకి కూడా చెప్పేట్ట. ఇపుడొస్తానందట.

కాని నిజంగా ఇందిర వస్తుందా? ఒకపక్క అనుమానం.

అలా రోడ్డువైపు, గేటు వైపుచూస్తూ కూర్చున్నాడు.

కాస్సేపటికి అతడి శ్రమ ఫలించింది.

ఆసుపత్రి ముందు ఆగిన ఆటోలోంచి ఇందిర దిగింది. తెల్లటి వి(ప్రి)ంటు చీరకట్టుకుంది...కొంగుని భుజం నిండుగా కప్పుకుంది. చేతిలో చిన్న పర్సు.

ఆటోకి డబ్బులిచ్చి, లోపలికొస్తోంది.

ప్రకాశం కూర్చున్నవాడల్లా కిందికి జారి పడుకున్నాడు. కళ్ళు మూసుకున్నాడు.

అడుగుల సవ్వడి కోసం చెవులు రిక్కించి వింటున్నాడు.

మెత్తటి పాదాలు నడుస్తున్నట్లు వినబడ్డుడు.

ప్రకాశం అలాగే కళ్ళు మూసుకుని

పడుకున్నాడు.

ఒక చల్లటి చెయ్యి నుదుటి మీద పడింది.

సందేహం లేదు.

ఆ చెయ్యి ఎవ్వరిదో కాదు.

తన ఒక్క జీతంతో సంసారాన్ని లాగలేక ఇబ్బంది పడుతుంటే ధైర్యం చెప్పి తనూ రంగంలోకి దిగిన చెయ్యి.

జీవితాంతం కలసి బతుకుతామని ప్రమాణం చేసినదాన్ని మర్చిపోయి తను వదిలి వేసిన చెయ్యి.

ప్రకాశం ఒక్కసారిగా కళ్ళు తెరిచాడు.

ఇందిర కళ్ళు వర్షిస్తున్నాయ్.

ప్రకాశానికి దుఃఖం ఆగిందికాదు.

"ఎలావుంది?'' అంటోంది ఏడ్పుని ఆపుకుంటూ.

ప్రకాశం ఏం చెప్పలేకపోయాడు.

"డాక్టరేమన్నాడు?"

ప్రకాశం బాధగా కళ్ళు మూసుకున్నాడు.

ప్రకాశానికి ఆమె వచ్చినందుకు పరమానందభరితంగా వున్నా, కళ్ళు తెరచి సూటిగా చూస్తే, తనలోని పశ్చాత్తాపం ఎక్కడ కళ్ళల్లో గోచరిస్తుందోనన్న భయం.

ఇందిరకి ఇంకోరకం ఇబ్బంది. సగమయిన అతణ్ని అలా మంచంలో చూస్తుంటే ఎంత చెడ్డవాడైనా, ఎన్ని తప్పులు చేసినా ఎక్కువ శిక్ష వేశానేమో నన్న శంక-

ఆమె కొద్దిక్షణాలు అలాగే నిల్చుని, కాస్త వ్యవధి చిక్కించుకోవటం కోసం అన్నట్లు "మళ్ళీ వస్తా'' అంటూ వెళ్ళబోయింది.

ప్రకాశం భయంతో కళ్ళు తెరచి "ఇందూ....'' అని ఏదో చెప్పబోయాడు.

ఇందిర ఆగి, వెనక్కి తిరిగి భర్త వంక చూసి, చిన్నగా నవ్వి "డాక్టరు గారితో మాట్లాడొస్తా" అంటూ బయటికి వెళ్ళింది.

చాలా కాలం తర్వాత 'ఇందూ' అని ప్రేమగా పిలవగలిగినందుకు అతడికి, పిలిపించుకున్నందుకామెకి పట్టలేని సంతోషంగా వుంది.

ఇందిర రూములోకెళ్ళే సరికి డాక్టర్ ప్రశ్నార్థకంగా మొహంపెట్టేరు.

"ప్రకాశరావు నా హజ్బెండ్" అంది.

"ఐసీ...అలా కూర్చోండి''అన్నారు.

అక్కడున్న కుషన్ కుర్చీలో కూర్చుంది.

"ఈసారికి నువ్వు అదృష్టవంతురాలివే. మైల్డుగా వచ్చింది. అతడికి డ్రింకింగ్ అలవాటున్నట్టుగా చెప్పాడు. అది పూర్తిగా మానెయ్యాలి. వేళకి తిండి తిని, విశ్రాంతి పుచ్చుకోవాలి''

"ఇంకేం ప్రమాదం లేదంటారా''?

"చెప్పాగా...ప్రస్తుతానికి భయంలేదు. ఇకముందు సంగతి అతడి అలవాట్లపై ఆధారపడుంటుంది. అతడు మానసికంగా కూడా ఏదో వర్రీలో వున్నట్టు గమనించేను. అదేవిటో తెల్సుకుని పరిష్కరించటం వుత్తమం''

ఇందిర కృతజ్ఞతా పూర్వకంగా చూసింది.

"మీ బిల్లు...."

"బిల్లు ఆవిడ పేచేసేసిందిగా''

ఇందిర ఆశ్చర్యపడింది"ఎవరూ...?''

"ఎవరో ఒకావిడ నిన్నొచ్చింది. అతడి గురించి గుచ్చిగుచ్చి అడిగింది. ఇంతవరకు అయిన బిల్లు కట్టేసి, ఇంకా వారం రోజులున్నా సరిపడ అడ్వాన్స్ కూడా ఇచ్చేసి వెళ్ళింది...పేరు కూడా

ఏదో చెప్పింది" అంటూ కళ్ళుమూసుకుని ఆలోచించటం మొదలెట్టారు.

"ప్రసూన" అందించింది ఇందిర.

"యస్...కరక్ట్! ప్రసూన. వెరీ డాషింగ్ అండ్ చార్మింగ్ లేడీ. మీకేమవుతుంది?"

ఇందిర ఏమాత్రం తడుముకోకుండా "సిస్టరు" అంది.

"గుడ్! ఇంకో వారందాకా వుండవచ్చు. ప్రస్తుతం ఏ కాంప్లికేషన్స్ లేవు. హి ఈజ్ పర్‌ఫెక్ట్‌లీ ఆల్ రైట్"

ఇందిర ఆయనకి థాంక్స్ చెప్పి మళ్ళీ భర్త గదికొచ్చింది.

ప్రకాశం లేచి కూర్చున్నాడు.

"ఏమన్నాడు డాక్టర్?"

"ప్రస్తుతానికి ఫర్వాలేదన్నాడు. కాని అలవాట్లుపూర్తిగా మార్చుకోవాలన్నాడు"

ప్రకాశం ఏం మాట్లాడలేదు.

"ఇవ్వాళ మీ ఫ్రెండ్ నాగరాజుట... ఫోన్చేసి చెప్పేదాకా నాకీసంగతి తెలీదు"

ప్రకాశం మాట మారుస్తున్నట్లుగా—

"పిల్లల్ని తీసుకురాలేదేం?" అనడిగాడు.

"ఇద్దరూ ట్యూషన్‌కెళ్ళారు"

పిల్లల మాట గుర్తుకొచ్చేసరికి ప్రకాశానికి కళ్ళు అశ్రుపూరితాలయ్యాయి. చేత్తోనే కళ్ళు తుడుచుకున్నాడు.

"ఎందుకలా బాధపడతారు? ఇప్పుడు ఏమైందని??" అంది బుజ్జగింపుగా.

"బాధ కాక ఇంకేం మిగిలింది నాకు. చదువుకోవటానికి పడ్డ కష్టం, వుద్యోగం లేక పడ్డ కష్టం, జీతంచాలక పడ్డ అవస్థలు అపార్థాలు, అపోహలు, మన క్లేశాలు, విడిపోవటాలు..."

"స్వయంకృతాపరాధాలకి సానుభూతి వుండదండీఇప్పటికయినా మించిపోయింది లేదు. పద్ధతుల్నీ, అలవాట్లనీ, ఆలోచనా ధోరణిని మార్చుకోండి. కష్టం సుఖం కలిసే పంచుకుందాం"

ప్రకాశం ఒక్కసారి భార్యవంక చూసేడు. దగ్గరగా రమ్మని సంజ్ఞచేసేడు.

ఆమె అనుమానంగా అర్థం కానట్లు దగ్గరగా వచ్చింది.

ఒక్కసారి అతడి చెయ్యి ఆమె నడుంని చుట్టుకుని దగ్గరకు లాక్కుంది.

ఇందిర కంగారుగా విదిలించుకుంటూ—"అయ్యో! అసలే మీకు ఒంట్లో బాగా లేదు. వదలండి" అంది.

ప్రకాశం ఆమెని దగ్గరగా ఒత్తుకుంటూ—"ఇంట్లోను, ఒంట్లోను ఇకనుంచి బ్రహ్మాండంగా వుంటుంది. నువ్వోచ్చావుగా" అన్నాడు.

రెండు క్షణాలు అలాగే వుండిపోయారిద్దరూ.

అనూహ్యమైన ఆనందం...

భాషకందని భావం...

ఈ క్షణం శాశ్వతం కావాలని రెండు గుండెల్లోనూ ఆశ...

ఈ ఆనందానికి దూరం కాకుండా చూసే బాధ్యత తనదేనని ఎవరికివారే ఆలోచన...

ఎవరో వస్తున్నట్లు శబ్దం అవటంతో ఇద్దరూ విడిపోయి దూరంగా బుద్ధిగా కూర్చున్నారు.

ఇందిర అక్కడున్న బత్తాయిపండుని చేతిలోకి తీసుకుని చెక్కు తియ్యటం ప్రారంభించింది.

ప్రకాశం వుత్సాహంగా ఆమెని గమనిస్తున్నాడు.

చీకటి ఆకాశంలో మబ్బుల్నించి తప్పుకున్న చిన్న నక్షత్రం తళుక్కున మెరుస్తూ కాంతులు విరజిమ్ముతోంది.

దూరాన్నించి గంటలు జేగంటల్లా విన్పిస్తున్నాయి. ★

# ప్రపంచం



## లేడీ జాకీ

సకల రంగాల్లో స్త్రీ ప్రవేశానికి నిదర్శనంగా ఆయేషా కెప్టెన్ అనే యువతి, రేసుల్లో గుర్రాలను స్వారీచేసే 'జాకీ' వృత్తిని చేపట్టింది. ఇప్పటివరకూ పురుషులు మాత్రమే జాకీలుగా వుంటున్న ఆ రంగంలో ఆయేషా ప్రవేశం కొత్త అధ్యాయానికి నాంది పలికింది! జాకీ వృత్తిలో ఆమెకొచ్చిన గుర్తింపు స్త్రీలు అన్ని రంగాలలోనూ రాణించగలరని చాటుతోంది.

మనదేశంలో స్త్రీ ఈ వృత్తిని స్వీకరించడం కొత్తగానీ, అమెరికా, ఆస్ట్రేలియా, ఇంగ్లాండ్‌లాంటి దేశాలలో ఇప్పటికే పురుషులతో పోటీగా అనేకమంది స్త్రీలు జాకీలుగా వున్నారు.

"మొదట్లో నాకు జాకీగా వుద్యోగ మిచ్చేందుకు ఎవరూ సిద్ధపడలేదు" అని చెబుతోంది ఆయేషా.

ప్రతివారూ 'సుకుమారమైన ఓ యువతి గుర్రాలను ఏం అదుపుచేస్తుంది?' అని సందేహించారు. కొందరు ఎంతో విలువైన గుర్రాలను ఆమెకు అప్పగించి నష్టాన్ని కొని తెచ్చుకోవడమెందుకని జంకారు. కాని అదృష్టం ఆమె పక్షాన వుండటంతో కొందరు నష్టానికి సిద్ధపడి ఆమెకు జాకీ వుద్యోగమిచ్చారు. శారీరకబలం, గుర్రాన్ని అదుపులో వుంచుకునే శక్తిలో ఆమె మగ జాకీలకెవరికీ తీసిపోదని ఇప్పుడంతా గుర్తించారు.

ఆయేషా కుటుంబంలో అందరికీ గుర్రపుస్వారీ అంటే మక్కువే. ఆయేషా తండ్రి స్నేహితుడికి గుర్రాలను పోషించే 'స్టడ్‌ఫార్మ్' వుండేది. ఓసారి ఆ గుర్రాల శాలకు వెళ్ళినప్పుడు ఆయేషాకి జాకీ వృత్తిని చేపట్టాలనే అభిలాష కలిగింది. దానికి పెద్దల ప్రోత్సాహం లభించడంతో ఆమె ఆ తరహా శిక్షణలో చేరింది.

శిక్షణ మొదలైన కొద్దికాలంలోనే ఆయేషా గుర్రపు స్వారీలోని మెలకువలను ఆకళింపు చేసుకుంది. ఆడుతూ పాడుతూ తిరగాల్సిన కాలాన్ని తన వృత్తి కోసం వెచ్చించడంలో త్యాగం చేసింది.

ఇప్పుడు ఆయేషాకు గుర్రాలే మంచి స్నేహితులు. ఉదయం 4 గంటలకి ప్రారంభమయే ఆమె దినచర్య రాత్రి 9 గంటలకు ముగుస్తుంది. జాకీగా ఆమె తన బరువులో హెచ్చుతగ్గులు లేకుండా చూసుకోవడం తప్పనిసరి. వ్యాయామాలతో శరీరాన్ని పొందికగా వుంచుకోవడం ఆమె దినచర్యలో భాగం! దీనికోసం ఆమె జాగింగ్ చేయడం, రోజుకు 8 మైళ్లు సైకిల్ తొక్కడమేకాక ఆహారనియమాలు ఖచ్చితంగా పాటిస్తుంది. అందుకోసమే ఇదివరకు మసాలా వంటకాలు అధికంగా తినే అలవాటున్న ఆయేషా, ఇప్పుడు ఉడకబెట్టిన ఆహారం, పళ్ళరసాలతో సరిపెట్టుకుంటోంది.

## కాషాయ రహిత సన్యాసం



"నా జీవితాన్ని పూర్తిగా ప్రజాసేవలోనే గడుపుతాను" అని చెబుతున్నాడు బెంగుళూరుకి 250కిలోమీటర్ల దూరంలోని మల్లాడి జలపల్లిలో ఓ ఆశ్రమం నిర్వహిస్తున్న 93 ఏళ్ల రాఘవేంద్రస్వామి. సంఘసేవ చేస్తూ సర్వసంగ పరిత్యాగిలా కాలం గడుపుతున్నా కాషాయవస్త్రాలు ధరించకపోవడం ఈ స్వామీజీలోని విశేషం!

"కేవలం కాషాయ వస్త్రాలు ధరించినంత మాత్రాన ఎవరూ యోగి కాబోరు'' అనేది ఆయన నమ్మకం. ఆయన దృష్టిలో త్యాగనిరతి, మానవత్వ భావనలు గల వారే నిజమైన యోగులు.

తొంభయ్యోపడిలో సైతం స్వామీజీ శరీరాన్ని దృఢంగా వుంచుకోడంతో పాటు, మల్లయుద్ధపోటీల్లో కూడా పాల్గొంటుంటాడు. ఆయన వైద్యుడు, ఉపాధ్యాయుడు, మల్లుడే కాక భిక్షుకుడు కూడా.

స్వామీజీ ఆయుర్వేదవైద్యంలో మంచి నిపుణుడు. ఆయన ప్రతి సోమవారమూ, వందలాది రోగులకు వుచిత చికిత్స చేస్తాడు. బాలురకు మల్లయుద్ధం,వ్యాయామవిద్యల్లో తర్ఫీదునిచ్చే తరగతులు నిర్వహిస్తాడు.

స్వామీజీ తను నిర్వహిస్తున్న ఆయుర్వేద ఆశ్రమం కోసం వారంలోఆరురోజుల పాటు కాలి నడకన చుట్టుపక్కల వూళ్లన్నీ సంచరిస్తూ చందాలు సేకరిస్తాడు. ఆయన పిడికెడు బియ్యాన్ని కూడా సంతోషంగానే స్వీకరిస్తాడు. ఎక్కడ తిరుగుతున్నాసరే ప్రతి సోమవారం సాయంత్రం అయిదున్నర గంటలకల్లా ఖచ్చితంగా ఆశ్రమానికి చేరుకోవడం ఆయనకలవాటు.

దూరప్రాంతాల నుంచి వచ్చే రోగులకి స్వామీజీ తన ఆశ్రమంలోనే ఉచితంగా ఆహార వసతులను కల్పిస్తాడు. ఆయన ఫీజంటూ ఏమీ అడగకుండా, రోగులు ఇచ్చిందేదో తీసుకుంటాడు. ఇంతవరకూ ఆయన వద్ద చికిత్సపొందిన 10 లక్షల మంది రోగుల్లో 90 శాతం మంది పూర్తి స్వస్థతపొందారు.

1943లో స్వామీజీ, సూర్‌దాస్ అనే శిష్యుడితో కలిసి స్థాపించిన ఆశ్రమం ఇప్పుడు 45 కోట్ల విలువజేసే భారీ సంఘసేవా ప్రాజెక్టుగా విస్తరిల్లింది. ప్రస్తుతం అది అనేక పాఠశాలలు, కళాశాలలు, వ్యాయామ శిక్షణా కేంద్రాలను నిర్వహిస్తోంది. ఆశ్రమంలోని సొంత ప్రెస్సులో ఆరోగ్యం, యోగాసనాలు, తత్వ విషయాలపై స్వామీజీ రాసిన పుస్తకాలెన్నో ముద్రింపబడతాయి.

కర్నాటక రాష్ట్రంలో జనాదరణ ఎక్కువగా పొందిన నృత్య నాటకం 'యక్షగానం'.చాలా పురాతన కళ అయిన ఆ యక్షగాన ప్రదర్శనలివ్వడంలో ప్రసిద్ధులైన నరసింహయ్య, పుత్లీబాయి దంపతుల కుమారుడే రాఘవేంద్రస్వామీజీ!

రాఘవేంద్ర స్వామీజీ చిన్నతనంలో ఎప్పుడూ ఏదో ఒక జబ్బుతో బాధపడుతుండేవాడు. మూర్ఛవ్యాధితో తరచుగా స్పృహ కోల్పోతుండేవాడు. స్కూలు విద్య ముగిశాక ఇంట్లోంచి వెళ్లిపోయి ఉత్తర కర్నాటక ప్రాంతాలలో తిరుగుతూ కొంతకాలం గడిపాడు. అప్పట్లో స్థానిక జానపద సంగీతం నేర్చుకుని, నటుడిగా మారాడు.

ఓసారి డాక్టర్లు ఆరోగ్యం సరిగ్గా లేనందువల్ల అతను ఎంతోకాలం బతకడని తేల్చారు. ఆ సమయంలో రాఘవేంద్రకి కర్నాటకలోని'గోకక్'కి చెందిన పళనిస్వామి అనే స్వాములవారితో పరిచయమేర్పడింది. పళనిస్వామి యోగంలో సిద్ధహస్తుడు. ఆయన ప్రోత్సాహంతో రాఘవేంద్రస్వామీజీ యోగాసనాలు వేయడంతో ఆరోగ్యం మెరుగైంది. తర్వాత అతను పూనేలోని స్వామి శివానంద ఆశ్రమంలో చేరి త్యాగనిరతిని పెంపొం

దించుకున్నాడు.

ఆహార నియమాలు ఖచ్చితంగా పాటించే రాఘవేంద్రస్వామీజీ స్వీట్స్ తినడు. ఆయన 93 ఏళ్లవృద్ధుడైనా 40 ఏళ్లవాడిలా కనబడతాడు!

## ప్రపంచ రికార్డుల పుస్తకం



యూరప్‌లోని మద్యం తయారుచేసే పరిశ్రమలలో ఆర్థర్ కిన్సన్ అండ్ కంపెనీ ప్రముఖమైనది. ఒకపుడు ఆ కంపెనీకి మనేజింగ్ డైరెక్టరైన 'హ్యూబేవర్'కి ఖాళీ సమయాల్లో పక్షుల వేట హాబీగా ఉండేది.

ఒకనాడతను ఓ పక్షిపైకి తుపాకీ పేల్చాడు. కాని, అది తప్పించుకుని అతివేగంగా అక్కడినుంచి ఎగిరిపోయింది. అప్పుడు బేవర్ మనసులో ఆ పక్షి ఎంత వేగంగా ఎగురుతుందనే ప్రశ్న వుత్పన్నమైంది.

తన సందేహ నివృత్తికోసం బేవర్ చేయని ప్రయత్నంలేదు. పక్షుల గురించిన వివరాలున్న అనేక పుస్తకాలు చదివాడు. చాలా మంది వద్ద తన సందేహాన్ని వెల్లడించాడు. అయినా అతనికి సమాధానం లభించలేదు. చివరికి అతను సమాచారశాఖలోని ఓ అధికారి దగ్గిర తన సందేహాన్ని బైటపెట్టాడు.

"మార్క్ వీర్‌టర్ సోదరులు నీ ప్రశ్నకు తృటిలో జవాబు చెప్పగలరు" అని చెప్పాడా అధికారి.

మార్క్ వీర్‌టర్ సోదరులు ఓ ప్రాత్రికేయుని కుమారులు. వాళ్లు వివిధ పత్రికలలో 'నమ్మలేని నిజాలు' లాంటి వాస్తవాలను రాస్తుంటారు.

బేవర్ మరునటిరోజు ఆ సోదరులని కలిశాడు. వాళ్లు బేవర్ చూసిన పక్షి గురించి వెంటనే వివరాలివ్వగలిగారు. వారి ప్రజ్ఞను గమనించిన బేవర్‌కి హఠాత్తుగా, 'ఈ సోదరులందించే అద్భుత సమాచారం ఆధారంగా ఓ పుస్తకాన్ని రూపొందిస్తే ఎలా వుంటుంది' అనే ఆలోచన కలిగింది.

ఆ విధంగా "గిన్నిస్ బుక్ ఆఫ్ రికార్డ్స్" ప్రచురణ ఆరంభమైంది!

## ఇల్లరికపు పెళ్లిళ్లు

మనదేశంలో వివాహానంతరం భార్య భర్త ఇంటికి వెళ్లి అక్కడే జీవితమంతా గడపటం సాంప్రదాయం. ఆవిధంగా స్త్రీకి తన పుట్టిల్లుకాక భర్త ఇల్లే 'సొంతిల్లు'



అవుతుంది. కాని, మనదేశానికే చెందిన లక్షద్వీప్ దీవుల్లో సాంప్రదాయం దీనికి విరుద్ధం. అక్కడ భర్త భార్య పుట్టింటికే వెళ్లి కాపురం చేయాలి. ఆ దీవుల్లోని ప్రజలు అనేక శతాబ్దాల క్రితం కేరళ నుంచి అక్కడికి వలసపోయినవారు!

లక్షద్వీప్‌లో వివాహమయ్యాక భర్త భార్య ఇంట్లో వుండాల్సివచ్చినా అతను తల్లిదండ్రులు, బంధువులకి దూరం కానక్కరలేదు. పగటి పూట తల్లిదండ్రులు, తోబుట్టువులతో గడపవచ్చు. కాని, పొద్దుబోయేసరికి విధిగా భార్య ఇంటికి చేరుకోవాలి.

అక్కడ భర్తలకో సుఖముంది. భార్య తిండి, వసతి గురించి చూసుకునే బాధ్యత వారిపై వుండదు. భార్యకవసరమైన దుస్తుల ఖర్చుమాత్రమే వాళ్లు భరించవలసి వుంటుంది. ఇతర ఖర్చులు భార్య తోబుట్టువులు, తల్లిదండ్రులే భరిస్తారు.

లక్షద్వీప్‌లో వివాహమయ్యాక పెళ్లికొడుకు కుటుంబం ఊరేగింపుగా పెళ్లికూతురి ఇంటికెళ్ళి పాట రూపంలో, "మేము మా అబ్బాయిని మీ ఇంటికి పంపుతున్నాము. మా వాడిని సరిగ్గా చూసుకుంటారా?" అని అడుగుతారు. దానికి పెళ్లికూతురి కుటుంబం, "అలాగే, మీ అబ్బాయికి ఎలాటి కష్టం కలగకుండా చూసుకుంటాం" అని బృందగానం చేస్తుంది. అదయ్యాక చక్కని బట్టలలో ముస్తాబుచేసిన పెళ్లికూతురిని బయటికి తెసుకొస్తారు. పెళ్లికొడుకు రెండు నిమిషాలసేపు మాత్రమే ఆమెని చూసే అవకాశం కల్పిస్తారు. తర్వాత పెళ్ళికూతురిని ఇంట్లోకి తీసుకెళ్లిపోతారు.

పెళ్లికొడుకు తన స్నేహితులతో వెళ్లిపోతాడు. పధ్నాలుగురోజులపాటు పెళ్ళికొడుకుని స్నేహితులు ఆటపట్టిస్తూ, నవ్విస్తూ గడుపుతారు. తర్వాత రెండు కుటుంబాలలోని పెద్దలూ సంప్రదించుకుని భార్యాభర్తలకి శోభనం నిశ్చయిస్తారు.

ఆరోజు పెళ్లికొడుకు స్నేహితుల్ని పంపేస్తారు. ఓ గదిలో పెళ్లికొడుకు పగలంతా ఒంటరిగా గడిపాక పెళ్లికూతురిని ఆ గదిలోకి పంపిస్తారు. ఆవిధంగా చేసే విరహంతో బాధపడ్డ భర్త ఆమెకు మానసికంగా దగ్గిరవుతాడని వారి వుద్దేశం.

లక్షద్వీప్‌లో పెళ్లి ఖర్చులన్నీ పెళ్లికొడుకు తరఫువారే భరించవలసివుంటుంది కాబట్టి తండ్రులు ఎంతమంది ఆడ సంతానం కలిగినా విచారపడరు. అక్కడ కట్నంలాంటి దుష్ట సంప్రదాయాలేమీ లేవు.

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications
Printed at Colorama, Offset Printers, Hyderabad. CHATURA Telugu Monthly
Eenadu Compound, Hyderabad - 500 004.

